శ్రీరస్తు.

# నీతిచంద్రిక

## పూర్వార్థము

శ్రీపరవస్తు చిన్నయసూరి కృతము.



చెన్నపురి:
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
వారిచే ప్రకటితము.
1954

# శ్రీ పరవస్తు చిన్నయసూరి

కర్త: భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు

ఆంగ్లమునుండి అనువాదకులు: వాకాటి పెంచలరెడ్డి.

సుప్రసిద్ధ సమకాలికులగు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు, మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వేంకట రత్నముపంతులు, హైందవ వేదాంతోన్నత పాఠశాల సంస్థాపకులగు శ్రీ ఆర్. శివశంకర పాండ్యాజీలు శ్రీ పరవస్తు చిన్నయ సూరిని ననుపమాధుని కాంధ్రగద్యనిర్మాతగం బరిగణించిరి. శ్రీ సూరి తన జీవితమున గౌరవనీయులగు శ్రీ గాజుల లక్ష్మీ నరసింహులుశెట్టిగారు, సి. యస్. ఐ. మున్నగు మహనీయుల ప్రాపకముసుబొందెను. శ్రీ చిన్నయసూరి రచనలన్నియు లభ్యము గాకుండుట మన దురదృష్టము. "హిందూచట్టము" ప్రచురణలో శ్రీ సూరి, జాన్. డి. మెయోన్ గారికి దోహదమొసంగిరట; కాని శ్రీ సూరి స్వయముగ వ్రాసిన గద్య నేఁడలభ్యము. 1858 లో నయ్యది గ్రంథరూపము దాల్చినట్లు తెలిసికొంటిని. సూరిరచనలు బ్రిటిషు వస్తుప్రదర్శనశాల (మ్యూజియమ్)లో నున్నట్లు విద్వాంసులవలన దెలిసికొంటిని.

"తత్త్వబోధిని పత్త్రిక" ననుసరించి శ్రీ సూరి 1866 లో మద్రాసు పాఠ్యపుస్తక నిర్ణయసంఘము, భాషాసమితి - అనువానికి సభ్యత్వముగ నిర్ణీతుఁడయ్యెను. ఆంధ్ర, మద్రాసు విశ్వకళాపరిషత్తువారి సౌజన్యమున పరిశోధకులు శ్రీ సూరి రచనలం బరిశోధించి, ప్రచురించుటకు సావకాశము మెండుగాఁ గలదు. ఆంధ్రమున స్వయముగ వీరు నిఘంటువును గూర్చిరి. అతివసయ్యమైన వారిస్వహస్తలిఖితాక్షరములఁగాంచు భాగ్యము నాకు లభించెను. నిఘంటు వసంపూర్ణముగ నిలిచిపోవుట మన యభా

గ్యము. చెన్నపురి విశ్వకళాపరిషత్తునం దాంధ్రభాషకు మకుటాయమానులైన శ్రీనిడదవోలు వేంకటరావు, ఎమ్. ఏ. గారు తెలుఁగు విద్వత్సభవారి సంచికలోఁ బ్రచురించిన రచనలు, నారాయణవనం వకులాభరణము వ్రాసిన సంక్షిప్త సూరిజీవితము, నాస్మృతిపథమున నిలిచిన విషయముల నాధారముగ నేను వారి జీవితమును వ్రాయ సాహసించితిని. ఈ తెగువ కాంధ్రసాహితీ పరులు నన్ను మన్నింతురుగాత.

## జననము-విద్య

పందొమ్మిదవ శతాబ్దమున వన్నెకెక్కిన తెలుఁగువిద్వాంసులలో పరవస్తు చిన్నయసూరి ప్రథమగణ్యుఁడు. ఒక శతాబ్దమునుండి వీరి "బాలవ్యాకరణ", "నీతిచంద్రిక"లు పాఠశాలల లోను కళాశాలలలోను నిర్బంధపాఠ్యగ్రంథములగుటచే నీ గ్రంథములను జదువని విద్యార్థు లుండరని చెప్పు టతిశయోక్తి కాఁజాలదు. ప్రాచీనయుగమునఁ బ్రథమ వ్యాకర్తగా, కవిగా నన్నయ వాసికెక్కెను. ఆధునికయుగమున చిన్నయసూరి ప్రఖ్యాతవ్యాకరణనిర్మాతగా నేకగ్రీవముగఁ బరిగణింపఁబడు చున్నాఁడు. బ్రిటిషు తూర్పుఇండియాకంపెనీవారు మన రాజధానిలో స్థిరనివాస మేర్పఱచికొనినపిమ్మట, ప్రభుత్వనిర్వహణమునకు వారికి పెక్కురు వ్రాయసకాండ్రు, పండితులు, ఉపాధ్యాయు లవసరమైరి. నాఁటి దేశకాలానుగుణ్యగద్య పద్యరచనకు చార్లెస్, ఫిలిప్, బ్రౌనుదొరవారు పునాదివేసిరి. ఇయ్యది చిన్నయసూరి, చదలవాడ సీతారామశాస్త్రులు, రావిపాటి గురుమూర్తిశాస్త్రి మున్నగు పండితవరేణ్యులకుఁ బ్రోత్సాహజనకమయ్యెను. కళాప్రపూర్ణ శ్రీవఝ్ఝల చిన సీతారామశాస్త్రిగారు ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు ప్రచురించిన "ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వము"ను గ్రంథములో,

"చిన్నయసూరి బాలవ్యాకరణము వ్రాయనిచో, ప్రాచీన వాఙ్మయ మడుగంటిపోయి యుండెడిది" అని వ్రాసిరి.

చిన్నయసూరి చాత్తాద శ్రీవైష్ణవకులస్థుఁడు (సాతాని). వీరి పూర్వీకు లౌత్తరాహులు; బ్రాహ్మణులవలె శ్రీపరవస్తు మతానుయాయులు. వీరికి సూత్రగోత్రములు గలవు. సూరి యాపస్తంభసూత్రుఁడు; గార్గేయసగోత్రుఁడు. ఇతఁడు యజుర్వేది. సూరితండ్రి యుభయవేదాంత శ్రీవేంకటరంగరామానుజాచార్యులు; శ్రీవైష్ణవమతప్రచారకులు. మద్రాసునందలి తిరువల్లిక్కేణి శ్రీరామానుజకూటములో నుపన్యసించుచుండెడివారు. వీరి వ్యాఖ్యానాదులకుఁ జకితులై, ప్రతివాదిభయంకరము శ్రీ శ్రీనివాసాచార్యులు, వీరిని శ్రీరామానుజ జన్మస్థలమగు శ్రీపెరుంబుదూరునకుఁ గొంపోయిరి. దేవాలయార్చకులలో నొకరుగా నియమింపఁబడి, నిత్యము ద్రవిడదివ్యప్రబంధములను దేవతసమ్ముఖమునఁ బారాయణము చేయుచుండెను. ఇట్లు శ్రీరామానుజాచార్యులు స్వీయకార్యములను దేవాలయములో నిర్వహింపుచుండ, గాఢమతాన్వేషులగు విద్యార్థిబృందము వారిని గలసికొనుట సంభవించుచుండెను. వీరావిద్యార్థుల నందఱను శ్రీవైష్ణవులుగ మార్చుచుండిరి. శ్రీరామానుజాచార్యులు ద్రవిడవేదాంతమునందే కాక, సంస్కృతాంధ్రములలోఁ గడుసమర్థులు. విరామవేళలందు వీరు విద్యార్థులకుఁ బై భాషలను బోధించుచుండిరి. సూరి జన్మించుటకుముందు శ్రీరామానుజాచార్యులవారికి నొక్కపుత్రిక మాత్ర ముండెను. ఈమె బాల్యముననే భర్తను గోల్పోయెను. శ్రీరామానుజాచార్యులు, తనభార్య—వీరిరువురు పుత్రసంతానాభిలాషులై, మిత్రుఁడు శ్రీ శ్రీనివాసాచార్యుల సలహానుసారము పుత్రకామేష్టి నాచరించిరి. యజ్ఞపాయసము

(అన్నము, పాలు, తేనె, చక్కెరల మిశ్రితము)ను ద్రావి పరితృప్తులైరి. 1309 లోఁ బుత్త్రోదయమయ్యెను. ఈతఁడే చిన్నయసూరి.

చిన్నయసూరి జన్మించినపుడు కుడికంటిలో మచ్చయుండుటచే నీతఁడు మహనీయుఁడగునని పలువురు భావించిరి. వయసుమీరాఁజిన దంపతుల కల్లారుబిడ్డఁడై పరగుచున్నందున నీతఁడు పదునాలువర్షములవఱకు విద్యాగంధశూన్యుఁడయ్యెను. వివాహముల కాపహూతురాలైన తల్లిని సూరి వెంబడించి, పెండ్లిండ్లలోఁ బాటలను బాడుచుండెడివాఁడు. ఈతఁ డాటపాటలలో నెక్కుడు కాలమును గడపెను. శ్రీరామానుజాచార్యులవారి స్నేహితుఁడు, శ్రీకంచి రామానుజాచార్యులు విద్యాగంధములేని యీకుఱ్ఱఁ డెవ్వరని పరామర్శించెను. కొంతవడి మిన్నకుండి సూరితండ్రి యాపిల్లవాఁడు తనకుమారుఁడే యని నుడివెను. పిల్లవానిని జీరి శ్రీరామానుజాచార్యులిట్లు సోచ్ఛరించెను. నాయనా! మీ తండ్రి వయోవృద్ధుఁడ కాక పెక్కురకు గురుతుల్యుఁడు. వీరిశిష్యులలో నధికులు విద్వాంసులు. సుతుఁ డేలకో యవిద్యావంతుఁ డయ్యెనని యక్షరమాలయు రానందుకు వానిని దండించెను. ఇయ్యది వానికి బాధావహమై తండ్రిని సమీపించెను. పుత్త్రునియుద్దేశ్యమును గమనించి, తండ్రి, సఖుఁడగు రామానుజాచార్యులవారికి వానికి విద్యగఱపుఁడని చీటి వ్రాసియిచ్చెను. పత్త్రిమును దిలకించినవెంటనే నిన్ను విద్యావంతునిజేయుట సంశయాస్పదముగ నున్నదని వానితో రామానుజాచార్యులు నుడివిరి. సక్రమముగఁ బాఠముల నభ్యసింపుదు నని పిల్లవాఁడు వచించినతోడనే శ్రీరామానుజాచార్యులు వానికి వర్ణమాలఁ గఱపిరి. కొన్నివత్సరముల బోధనాఫలితముగ బాలుఁడు విద్వాంసుఁడు కాఁగలఁడని

యుపాధ్యాయుఁడు గమనించెను. కతిపయదినములలోనే విద్యార్థి బాలరామాయణము, అమరకోశము, ఆంధ్రనామ సంగ్రహములను తూర్ణముగఁ బఠించెను. పిల్లవానితండ్రి, తన యుని విద్యాభివృద్ధికి మిక్కిలి సంతసించి, వానికి వ్యాకరణమును బోధించెను. చెన్నపురి పౌరాగ్రేసరుఁడగు శ్రీగాజుల లక్ష్మీ నరసింహులశెట్టిగారి సిఫారసువలన బ్రిటిషు తూర్పుఇండియా కంపెనీవారి పరమోన్నతన్యాయస్థానమున చిన్నయ పండితో ద్యోగమును బడసెను. సూరి మద్రాసులో నున్నతటి వ్యాకర ణములోనేకాక, అరవ, ఆంధ్ర, ప్రాకృతములలోఁ బారంగతుఁ డయ్యెను. ఈతఁడు శ్రీకంచి రామానుజాచార్యులవలన తర్కమీమాంసాలంకారములను, చదలవాడ శ్రీరామశాస్త్రుల (సుందరరామశాస్త్రిల తండ్రి) వలన యజుర్వేదము, యజు ర్వేదభాష్యముల నభ్యసించెను. హయగ్రీవోపాసన, దీర్ఘ ధ్యానములవలన సూరి సుప్రసిద్ధపండితప్రకాండుఁ డయ్యెను. ఆంధ్రములోఁ బ్రత్యేకాభినివేశమునకై వీ రాంధ్రశబ్దచింతా మణి, అథర్వణకారికలు, అప్పకవీయములను శ్రద్ధతోఁ బఠింపఁ బ్రారంభించిరి. నన్నయ తిక్కనల మహాభారతమును విమర్శ నాత్మకదృష్టితోఁ బఠించుటచే నాంధ్రదేశములో శతాబ్దముగా వెలసిన విఖ్యాత బాలవ్యాకరణమును సూరి రచింపఁగలిగెను.

### సాహిత్యోద్యమము

చిన్నయసూరికాలమున నాంగ్లభాషాప్రవీణులే యున్నతో ద్యోగములఁ గావించుచు, కీర్తిప్రతిష్ఠలను బొందుచుండిరి. ఆకాలమున పండితు లాంగ్లభాషపట్ల విముఖులై యుండిరి. కాని చిన్నయసూరి కాలపరిభ్రమణమును గుర్తించి, యాంగ్లము నభ్య సింప మొదలిడెను. ఆంగ్లము నభ్యసించినపిమ్మట ప్రముఖ ఐరోపియనులతోఁ బరిచయమేర్పడి వారి సిఫారసువలన నధిక

మతప్రచారకులు వీరి శిష్యులైరి. 1836 లో సూరితండ్రి పరమ పదించెను. మరణించునప్పటికి నాతనికి నూటపదివత్సరముల వయస్సు. తండ్రి మరణానంతరము శ్రీసూరి విద్వత్సభలలో నుపన్యసించుచు, బహుభాషాకోవిదులైన నగరపౌరన్యాయాధి కారి మిస్టర్. సి. వి. రంగనాథన్ శాస్త్రియారు, పచ్చయప్ప ధర్మ సంస్థల ధర్మకర్త, కోమలేశ్వరపేట వాస్తవ్యుడైన శ్రీమాన్ శ్రీనివాసన్ పిళ్లైగార్లకుఁ బరిచితుఁడయ్యెను. లండనులో 1837 లో విక్టోరియామహారాణి పట్టాభిషేకమహోత్సవకాల మున తూర్పుఇండియాకంపెనీ సర్వాధికారము గలిగియున్నను, చెన్నపురిలో మహోత్సవమును జరుపుటకు సభ నేర్పాటుగావిం చిరి. ఈ శుభసందర్భమున చిన్నయసూరి సభలో నవరత్నము లను బఠించెను. పద్యపఠనమునకు ముగ్ధులై సూరిగారికి లాభ దాయకోన్నతోద్యోగము నివ్వ సంకల్పించిరి. పచ్చయప్ప మొదలి యార్ సంస్థాపించిన ధర్మసంస్థను శ్రీ శ్రీనివాసపిళ్లై, పరమో న్నత న్యాయస్థాన దుబాసీ (భాషాంతరీకరణము చేయువాఁడు) శ్రీ ఏనుఁగుల వీరాస్వామి అయ్య—అనువారు నడుపుచుండిరి. 1844 లో నీరెండుసంస్థలవారు చిన్నయ నాహ్వానించి, పచ్చ యప్ప పాఠశాలలోఁ బ్రధానాంధ్రశాఖాధ్యక్షునిగ నియ మించిరి. ఆకాలమున మదరాసులో పచ్చయప్ప పాఠశాల, చెన్నపురి ఉన్నత పాఠశాల, క్రైస్తవయాన్ డర్సన్ పాఠశాల లను మూఁడు విద్యాసంస్థలు నెలకొనియుండెను. పచ్చయప్ప పాఠశాలలోఁ బ్రవేశించినపిదప సూరి తెలుఁగులోనేకాక సంస్కృతములోను గవన మల్లనారంభించెను. చాత్తాద శ్రీ వైష్ణవసమాజపుఁ బరమభక్తుఁడేకాక సూరి స్మార్తమతగ్రంథము లలో సమ్యగ్జ్ఞానమును బొందెను. ఇయ్యది సాతానివారికి నప్రీతికరమయ్యెను. వీరి బోధనాపటిమనుగూర్చి చెప్పవలసి

నదియే లేదు. సూరి యితరకృతులనుగూర్చి ముచ్చటింతును. కాక తీయ వంశజుఁడైన శ్రీకృష్ణమాచార్యులు రెండవ ప్రతాప రుద్రుని కాలమున 1300 లలో "సింహగిరి నరహరి వాచకములు" "శఠగోపవిన్నపము"లను రెండు గద్యకృతులను రచించిరి. కాకతీయుల పిమ్మట శ్రీకృష్ణదేవరాయయుగము ప్రారంభ మయ్యెను. ఈయుగము తెలుఁగు కవనపు టౌన్నత్యమునకుఁ బెట్టినది పేరు. 1600 లలో మధురనాయకుల పరిపాలనమందు, తమిళదేశములోఁ దెలుఁగు గద్యవాఙ్మయము పరిపోషింపఁ బడెను. "ధేనుమాహాత్మ్యము", "శ్రీరంగమాహాత్మ్యము", "హాలాస్య మాహాత్మ్యము" "జైమినీభారతము", "సారంగధర చరిత్ర", "రామాయణము", "భారతము"—ఇవియన్నియు ను వెల్లివిరిసెను. వారి వచనరచన నిరుపమానము. పందొమ్మిదవ శతాబ్దములో రావిపాటి గురుమూర్తిశాస్త్రులు "పంచతంత్రము", "విక్రమార్క కథల"ను రచించెను. స్వల్పకాలములో నియ్యవి చతుస్సద్రణములనందుట వీని ప్రాశస్త్యమునకుఁ బ్రబల హేతువు. సి. పి. బ్రౌను "శుకసప్తతికథలు", "తాతాచార్యుల కథలు", "బుక్కరాయసముద్రచరిత్రము" మున్నగు గ్రంథములను రచించెను. క్రైస్తవమతప్రచారకులు వారిమతమునుగూర్చి కొన్ని వచనగ్రంథములను వెలయించిరి.

1858 లో "బాలవ్యాకరణము"ను రచించుటకుఁ బూర్వము శ్రీసూరి సంజ్ఞ, సంధి, శబ్ద, క్రియ, ప్రకీర్ణ పరిచ్ఛేద ములు గల "శబ్దలక్షణసంగ్రహము"ను 1853 లో రచించెను. ఈ గ్రంథములో నయిదువందల డెబ్బది సూత్రములు గలవు. విద్యార్థులకేకాక, జనసామాన్యమున కుపకరించువిధముగ వ్రాసితి నని సూరి యుపోద్ఘాతములో వివరించెను. దీనిని శ్రీగాజుల లక్ష్మీనరసింహులశెట్టిగారికి నంకితమిచ్చెను. శబ్దలక్షణసంగ్రహ

ములోని యైదుభాగములే కాక, తత్సమ తద్భవ పరిచ్ఛేదములు గల "ఆంధ్రభాషానుశాసనము"ను సూరి రచించెను. ప్రఖ్యాత విద్వాంసుఁడు, కవియు నగు శ్రీ వేదము పట్టాభిరామశాస్త్రిగారు పద్యములలో వ్రాసిన "పట్టాభిరామ పండితీయ" మను వ్యాకరణము నాధారముగ చిన్నయసూరి వ్యాకరణమును విరచించెను.

శ్రీ సూరి కూర్చిన నిఘంటువునుగూర్చి కతిపయ విషయ విజ్ఞాపన మొనర్చుట సమంజసమని తోఁచెడిని. తెలుఁగులో నిఘంటువనఁబరగినదేదియు లేనందున సూరి నిఘంటురచన కుపక్రమించెను. తెలుఁగులోని పద్యనిఘంటువు లియ్యవి: 1. పైడిపాటి లక్ష్మణకవి ఆంధ్రనామసంగ్రహము, 2. అడిదము సూరకవి ఆంధ్రనామశేషము, 3. చౌడప్పకృత కవిచౌడప్పసీసములు, 4. గణపవరపు వేంకటేశకవి వేంకటేశ ఆంధ్రము, 5. కస్తూరిరంగకవి సాంబనిఘంటువు, 6. నుదురుపాటి వేంకనరాయ ఆంధ్రభాషార్ణవము (ఆంధ్ర అమరము). నుదురుపాటి వంశజుఁడగు శ్రీ నుదురుపాటి సుబ్రహ్మణ్యము నేఁడు వేంకటగిరిలో వసించుచున్నాఁడు. కరిమనగుంటగ్రామము వీరిది. 1816 లో మామిడి వేంకయ్య "ఆంధ్రదీపిక" అను నిఘంటువును గూర్చి 1849 లోఁ బ్రకటించెను. ఎ. డి. క్యాంబెల్ 1821 లో నాంధ్రాంగ్లనిఘంటువునుగూర్చి ప్రకటించెను. ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ గొప్ప ఆంధ్రాంగ్లనిఘంటువునుగూర్చి 1852 లోఁ బ్రకటించిరి. ఆంధ్రాంగ్లములలో నర్థములే కాక మహాకావ్యముల నుండి దృష్టాంతము లొసఁగఁబడియుండుటచే, పై నిఘంటుత్రయములో బ్రౌనునిఘంటువు ప్రశంసార్హమైనది. విదేశీయుఁడైనందున సి. పి. బ్రౌను నిఘంటువులోఁ గొన్నిదోషములు దొర్లుట సహజము. కావున సూరి సమగ్ర ప్రమాణ తెలుఁగు నిఘంటువును సమకూర్పఁ దలఁచెను. కాని నిఘంటువు పూర్తికాక

చునుపే వారు దివంగతులైరి. సూరి యసంపూర్ణ నిఘంటు వును ప్రచురించినను, తెలుఁగునకుఁ బెన్నిధి సమకూరినట్లగును. "అక్షరగుచ్ఛము", "విభక్తిబోధిని", "ధాతుమాల" మున్నగు నవి సూరికృతములు. సూరి, పచ్చయప్పకళాశాల సంస్కృతాంధ్రపండితుఁడగు వైయ్యాకరణము శ్రీరామానుజాచార్యులతోఁ గలసి "భారతము"ను వచనమున రచించెను. కాని యాది సభాపర్వములు మాత్రము ప్రచురింపఁబడెను. సూరికృతు లన్నియు తిరుపతి శ్రీవేంకటేశ్వరుల వారికి నంకితమియ్యఁబడెను. సూరిపుత్త్రి లిరువురును తండ్రివలెఁగాక ప్రాథమికవిద్యను మాత్రము గడించిరి. సూరి తదనంతరము రాజధాని కళాశాల పండితులు శ్రీరేకము రామానుజసూరి పుత్త్రికను, సూరి పుత్త్రులలో నొకరు పరిణయమాడిరి. సూరి మనుమఁడగు శ్రీరేకము మనవాలయ్య ఉపన్యాసాధిపతిగనుండి ప్రవాహ ములోఁ బడుటచే నకాలమరణమును బొందెను. మదరాసు సంజీవరాయఁకపేటలో వసించు వీరి సోదరుఁడు భాష్యకారయ్య మాపారుగువాఁడు. వీరివలన చిన్నయసూరి జీవితవిశేషము లను బెక్కు తెలిసికొంటిని. ఇటీవలనే వీరు 80 వర్షముల ప్రాయమున మరణించిరి.

1. యస్. పి. జి. ఉన్నతపాఠశాల పండితులు నిశ్చింతం దేవరాజపెరుమాళ్లయ్య, 2. భూతపురి మాహాత్మ్యకర్త కర్ణ పాటి ఆళ్వారయ్య, 3. పచ్చయప్ప కళాశాల ప్రధానాంధ్ర పండితులు శ్రీశైలం తెన్నరంగయ్య, 4. తెలుఁగులో వివిధ గ్రంథరచయిత శ్రీ ఓ. వై. దొరస్వామయ్య, 5. చెంగల్వ రాయసంస్థయందలి కారుమంచి సుబ్బరాయులునాయుఁడు, 6. ప్రాథమిక వ్యాకరణకర్త టి. అబ్బాయినాయుఁడు, యఫ్. టి. యస్, 7. మద్రాసు రెవిన్యూబోర్డు ఏ. నమ్మాళ్వారయ్య,

యమ్. ఏ., 8. ఆనందము ద్రాక్షరశాలపండితులు తంజనగరమ్ తేవపెరుమాళ్లయ్య—వీరు సాతానివంశజులైన సూరిశిష్యులు. సూరిజీవితము క్రమపద్ధతి ననుసరించియుండునని తెలిసికొంటిని. వీరు తెల్లని దుస్తులను, సులోచనములను ధరించెడివారు; రెండు మూఁడుగంటలు ప్రాతఃకాలప్రార్థనలఁ గావించుచుండెడివారు. భోజనమునకుఁ బూర్వము వీరెచ్చటికేని జనియుండుచో గృహమునకు వచ్చినవెంటనే స్నానమాచరింతురు. ఆంధ్ర, మద్రాసు విశ్వకళాపరిషత్తువారిలో నెవరైనను వీరి సంస్కృతశ్లోకములను, తెలుఁగుపద్యముల నొక్కసంపుటిగాఁ బ్రకటింపఁగోరుదును.

ఈ విద్వాంసునిగూర్చి నా యెఱిఁగిన విషయముల నిటఁ బొందుపఱతును.

నాతండ్రి శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులే కాక, బంధువులును గొప్పవిద్వాంసులు. 1. పురాణం హయగ్రీవశాస్త్రులు. (రాజధాని కళాశాల సంస్కృతపండితులు), 2. చదలవాడ శ్రీరామశాస్త్రులు, 3. చదలవాడ సీతారామశాస్త్రులు (రాజధాని కళాశాలపండితులు)-వీరు చిన్నయసూరి యాప్తమిత్రులు. వీరందఱు తండయార్పేటలోని మాస్వగృహమునందు ప్రతియాదివారము సమావేశమై సంస్కృతాంధ్ర సారస్వత విషయములనుగూర్చి తర్కించుచుండెడివారు. చిన్నయసూరి ప్రతి సమావేశమునకు విచ్చేసి చర్చలలోఁ బ్రముఖపాత్రను వహించుచుండువాఁడు. మాతండ్రియెడ వారికిఁ గల యభిమానమును బురస్కరించికొని “అక్షరగుచ్ఛము”, “విభక్తిబోధిని” అను గ్రంథములను బ్రచురణార్థ మొసఁగిరి. ఇవి పెక్కుసార్లు ముద్రితములయ్యెను.

నేఁటి తెలుఁగుపండితులు చిన్నయసూరి బోధనావిధానమును, రచనాశైలిని ననుసరింపఁ గోరుదురు.



# నీతిచంద్రిక

## మంగళము

ఉ. శ్రీ యనుమించుమించొలయ సేవకచాతకలోకమోదసం
ధాయకుఁడై యుదారకరుణారసవృష్టి దురాపతాపముల్
వాయఁగఁ జేయుచున్ సకలవాంఛితసస్యము లుల్లసిల్లఁగాఁ
జేయుచు వేంకటాద్రినివసించుఘనుండిడుఁగాత భద్రముల్.

క. కరుణ తెలుంగున హరియెద
నిరవుకొని యఘాళి నరయనీక యతనిచే
నిరతము సంశ్రితజనులం
బరిరక్షింపించుతల్లి భజియింతు మదిన్.

చ. వనజభవాండభాండము లవారిగ నెవ్వనితుందకందరం
బున నొకమేలనింటరముఁ బొంపక పొందుగఁ బొల్చు నమ్మహా
త్మునినిజభోగశయ్యసడిసొత్తులకందువునట్లు లాలనం [లున్.
బొనరుచు నయ్యనంతుమహిమోన్నతుసన్నుతియింతు నిచ్చ

## ఆదికవిస్తుతి

క. ఘను నన్నయభట్టును ది
క్కన నేఱాప్రెగడఁ బొగడి యలికంబున య

వాఁడు చచ్చెనా తల్లిదండ్రులకు దుఃఖము నాఁటితోనే తీఱు
చున్నది. కులమునకు యశము తెచ్చినవాఁడు పుత్త్రుఁడుగాని తల్లి
కడుపు చెఱుపఁబుట్టినవాఁడు పుత్త్రుఁడు గాఁడు. గుణవంతు
లలోఁ బ్రథమగణ్యుఁడు గాని కొడుకును గన్నతల్లికంటె వేఱు
గొడ్రాలు గలదా? గుణవంతుఁడైనపుత్త్రుఁ డొకఁడు చాలును.
మూర్ఖులు నూఱుగురవలన ఫల మేమి? ఒకరత్నములో గులక
రాలు గంపెడయినను సరిగావు. విద్యావంతులయి గుణవంతు
లయినపుత్త్రులను జూచి సంతోషించుట యనుసంపద మహాపుణ్యు
లకుఁగాని యొల్లవారికి లభింపదు" అని కొంతచింతించి యుంకించి
తల పంకించి "యూరక యీచింత యేల? నాపుత్త్రులు చదువ
మనిరా? పరామరిక మాలి తగినవిద్యాభ్యాసము చేయింప
నయితిని. బిడ్డలకు విద్యాభ్యాసము చేయింపమి తల్లిదండ్రులదో
షము. తల్లిదండ్రులచేత శిక్షితుఁడయి బాలుఁడు విద్వాంసుఁడగు
నుగాని పుట్టఁగానే విద్వాంసుఁడు కాఁడు. పురుషకారముచేతఁ
గార్యములు సిద్ధించును; రిత్తకోరికలచేత సిద్ధింపవు. నిద్రించు
సింహమునోరను మృగములు తమంతవచ్చి చొరవు. కాఁబట్టి
యిప్పుడునాపుత్త్రులకు విద్యాభ్యాసముకయి వలయు ప్రయత్నము
చేసెద" నని చింతించి యచ్చటి విద్వాంసులతో నిట్లనియె,
"నాపుత్త్రులు విద్యాభ్యాసము లేక క్రీడాసక్తులయి తిరుగుచున్న
వారు. ఎవ్వరయినను వీరిని నీతిశాస్త్రము చదివించి మంచి మా
ర్గమునకుఁ ద్రిప్పఁజాలినవారు కలరా?" యనిన విష్ణుశర్మ యను
బ్రాహ్మణుఁ డిట్లనియె. "రాజోత్తమా! యిది యెంతపాటిపని?
మహావంశజాతు లయిన దేవరపుత్త్రులను నీతివేదులను జేయుట
దుష్కరముగాదు. కొంగనుమాటలాడించుట దుష్కరముగాని

చిలుకను బలికించుట దుష్కరము గాదు. సద్వంశమందు గుణహీనుఁడు పుట్టఁడు. పద్మరాగములగనిలో గాజు పుట్టునా? ఎట్టి రత్నమయినను సానపెట్టక ప్రకాశింపనట్లు బాలుఁ డెట్టివాఁడయిన గురుజనశిక్షలేక ప్రకాశింపఁడు. కాఁబట్టి నేనాఱుమాసములలో దేవరపుత్రులను నీతికోవిదులను జేసి మీకు సమర్పించెదను." అనిన రాజు సంతోషించి యిట్లనియె. "పూవులతోఁ గూడిన నారకు వాసన గలిగినట్లు సజ్జనులతోడ సావాసించు మూర్ఖునకు మంచిగుణము గలుగుట సాజము." అంతే కాదు. 'సాధుసాంగత్యము సర్వశ్రేయములకు మూలము.' అని సాదరముగా వచియించి యాతనికిఁ బసదన మిచ్చి తనకొడుకులను రప్పించి చూపి "విద్యాగంధములేక జనుసాంధులవలె నున్నారు. వీరిని గన్నుదెఱపి రక్షించుట మీభార" మనిచెప్పి యొప్పగించెను. అనంతర మాబ్రాహ్మణుఁడు వారల నొకరమణీయసౌధమునకుఁ దోడుకొనిపోయి కూర్చుండఁ బెట్టుకొని యిట్లనియె. "మీకు వినోదార్థ మొకకథచెప్పెద. అది మిత్రలాభము, మిత్రభేదము, విగ్రహము, సంధియు నని నాలుగంశములచేత నొప్పుచుండును వినుండు.

## మిత్రలాభము

"ధనసాధనసంపత్తి లేనివారయ్యు బుద్ధిమంతులు పరస్పరమైత్రి సంపాదించుకొని కాక కూర్మ మృగ మూషికములవలె స్వకార్యములు సాధించుకొందురు." అనిన రాజపుత్రులు విని "యేకార్యములు కాక కూర్మ మృగ మూషికములు సాధించెను. మాకు సవిస్తరముగా వినిపింపుఁ" డనిన విష్ణుశర్మ యిట్లని చెప్పఁదొడంగెను.

"గోదావరీతీరమందు గొప్పబూరుగువృక్షముగలదు. అందు నానాదిక్కులనుండి వచ్చి పక్షులు రాత్రి వసించుచుండును. ఒక నాఁడు వేఁకువ లఘుపతనక మనువాయసము మేలుకొని రెండవ యమునివలె సంచరించుచున్న కిరాతకునిఁ జూచి 'వలువాతలేచి వీనిమొగము చూచితిని. నేఁ డేమి కీడు రాఁగలదో తెలియదు. వీఁడు వచ్చినచోట నిలువఁ దగదు. జాగుచేయక యీచోటు విడిచి పోవలె' నని యత్నము చేయుచుండఁగా వాఁ డావృక్ష మునకు సమీపమందు నూకలు చల్లి వలపన్ని పోయి చేరువ పొదలో దాఁగి పొంచి చూచుచుండెను. అనంతరము చిత్ర గ్రీవుఁ డను కపోతరాజు నింగిని సంచరించుచు నేలమీఁది నూకలు చూచి తనతోడి కపోతములతో ని ట్లనియె. 'ఈనిర్జన వనమందు నూకలు రా నిమిత్తమేమి? మన మీనూకల కాశపడ రాదు. తొల్లి యొకతెరువరి కంకణమున కాశపడి పులిచేతఁ దగులుకొని మృతిబొందెను. మీ కాకథ చెప్పెద వినుండి.

ఒకముసలిపులి స్నానముచేసి దర్భలు చేతఁబట్టుకొని కొలని గట్టున నుండి, 'ఓయి తెరువరి, యీపయిఁడికంకణము వచ్చి పుచ్చుకొ' మ్మని పిలిచి చెప్పెను. ఒకపాంథుఁ డామాటవిని యిది నాభాగ్యముచేతనే వచ్చుచున్నది. ఏల సందేహపడవలె నని చింతించి, యేదీకంకణము చూపు మని యడిగెను. పులిచేయిచాఁచి యిదిగో హేమకంకణముచూడుమనిచూపెను. నీవు క్రూర జంతు వవు కాఁబట్టి యేలాగున నిన్ను నమ్మవచ్చు నని పాంథుఁడు పలి కెను. ఆమాట విని పులి యిట్లనియె: "ఓరీపాంథ! విను. మునుపు యౌవనమందు మిక్కిలి దుష్టుఁడనయి యుంటెని. అనేకము లగు గోవులను మనుష్యులను వధించి మితిలేనిపాపము సంపాదించి

భార్యాపుత్త్రులను బోఁగొట్టుకొని యేకాకి నయి నిలిచితిని. అనంతర మొకపుణ్యాత్ముఁడు నాయందు దయచేసి, 'యింక మీఁదట గోవులను మనుష్యులను వధింపకు. సత్కార్యములు చేయు'మని చెప్పెను. అది మొదలుకొని పాపకృత్యములు విడిచి మంచికార్యములు చేయుచున్నవాఁడను. వృద్ధుఁడను. బోసినోరివాఁడను. గోళ్లు పోయినవి. లేవ సత్తువ లేదు. నన్ను నీవేల నమ్మవు? నీవు దరిద్రుఁడవు కాఁబట్టి యిది నీకు దానముచేయవలెనని కోరితిని. సంశయపడక యీకొలనిలో స్నానముచేసివచ్చి పసిఁడికంకణము పుచ్చుకొమ్ము." అనఁగానే వాఁడు పేరాసచేత దానిమాటలకు లోపడి కొలనిలో స్నానముచేయఁబోయి మొలబంటిబురదలో దిగఁబడెను. అప్పుడు పులి చూచి 'యయ్యయ్యో పెనురొంపిలో దిగఁబడితివిగదా! నేను వచ్చి నిన్ను లేవనెత్తెదను. భయపడకు' మని తిన్నతిన్నగా సమీపించి వానిని బట్టుకొనెను. ఈలాగునవాఁడు తగులుకొని 'క్రూరజంతువును నమ్మరాదు నమ్మి యీగతి తెచ్చుకొంటిని. మించినదానికి వగచి యేమి ప్రయోజనము?ఎవ్వరికైన విధి తిప్పించుకో వశముగాదు.' అని చింతించుచు దానిచేత భక్షింపఁబడియె.

కాఁబట్టి సర్వవిధముల విచారింపనిపని చేయరాదు.చక్కఁగా విచారించి చేసినపనికి హాని యెప్పటికి రాదు.' అని చెప్పఁగా విని యొకకపోతవృద్ధము నవ్వి యిట్లనియె. 'ఆ! యివి యేటిమాటలు? ఒకయిక్కట్టు వచ్చినప్పుడు వృద్ధునిమాట వినవలసినది. వినుండు. స్థానాస్థానములు వివేకింపక సర్వత్ర యిట్టివిచారము పెట్టుకో రాదు. కొఅమాలిసశంకలు తెచ్చుకొని భోజనము మానుకోవచ్చునా? మానుకొని యేలాగున బ్రతుకవచ్చును?

ఈర్ష్యాళువు, జుగుప్సావంతుడు, నిస్సంతోషి, క్రోధనుఁడు, నిత్యశంకితుఁడు, పరభాగ్యోపజీవియు ననువారాఱుగురు దుఃఖ భాగు లని నీతికోవిదులు చెప్పుదురు.' అనఁగా విని కపోతము లన్ని నేల వ్రాలెను.

గొప్పశాస్త్రములు చదివి మిక్కిలి వినికి గలిగి పరులసంశయములను వారింప నేర్పుగలవారు సహితము లోభమువల్ల వివేకము పోఁగొట్టుకొని క్లేశపడియెదరు. ఆహా! లోభ మెంత చెడుగుణము! అన్ని యిడుమలకు లోభము కారణము.

అనంతరము పావురములన్ని వలలోఁ దగులుకొని కపోత వృద్ధమును జూచి 'నీవు వృద్ధుఁడవు, తెలిసినవాఁడ వని భ్రాంతిపడి నీమాటలను విని యీవిపత్తు తెచ్చుకొంటిమి. ఎవ్వఁడు బుద్ధిమంతుఁడో వాఁడు వృద్ధుఁడుగాని యేండ్లుమీఱినవాఁడా వృద్ధుఁడు?' అని కపోతములు నిందింపఁగా విని చిత్రగ్రీవుఁ డిట్లనియె. 'ఇది యాతనిదోషము గాదు. ఆపదలు రాఁగలప్పుడు మంచిసహితము చెడు గగుచున్నది. మనకాలము మంచిది కాదు. ఊరక యేల యాతని నిందించెదరు. ఈతఁడు తనకుఁ దోఁచినది చెప్పినాఁడు. అప్పుడు మనబుద్ధి యేమయ్యె? ఆపద వచ్చినప్పుడు తప్పించుకొనుసాధనము విచారింపవలెఁగాని యీమాటలవల్ల ఫలమేమి? విపత్కాలమందు విస్మయము కాపురుషలక్షణము. కాఁబట్టి యిప్పుడు ధైర్యము తెచ్చుకొని ప్రతీకారము చింతింపుఁడు. ఇప్పటికి నా కొకటి తోఁచుచున్నది. మీరందఱు పరాకు లేక వినుఁడు. ఒక్కసారిగా మనమందఱము వలనెత్తుకొని యెగిరి పోవుదము. మనమల్పులము; మనకీ కార్యముసాధ్యమవునాయని విచారింపఁబనిలేదు. సంఘీభవించి యెంతటికార్యమయిన సాధింప

వచ్చును. గడ్డిపరకలుసహితము వెంటిగా నేర్పడి మదపుటేనుఁగును బంధించుచున్నవి. మీరు విచారింపుఁడు. దీనికంటె మంచి సాధనము మీబుద్ధికిఁ దగిలెనా యది చేయుదము.' అనిన విని 'మీరు చెప్పినదే సరి; యింతకంటె మంచిసాధనము లే'దనిచెప్పి పావురములన్ని విచిత్రముగా గగనమార్గమున కెగిరెను. అప్పుడా వ్యాధుఁడు వెఱఁగుపడి 'యీపక్షులు గుంపుగూడి వలయెత్తుకొనిపోవుచున్నవి. నేలవాలఁగానే పోయి పట్టుకొనియెదఁగాక.' యని చింతించి మొగము మీఁదికెత్తుకొని తెప్పవేయక చూచుచు నవి పోవుదిక్కునకయి క్రిందనే పోవుచుండెను. ఈవింత చూడవలె నని లఘుపతనకము పావురములను వెంబడించి పోవుచుండెను. అనంతర మాపక్షులు చూపుమేర దూరము మీఱిపోఁగానే వ్యాధుఁడు నిరాశ చేసికొని మరలిపోయెను. అదిచూచి యిప్పుడు మనము చేయవలసినది యేమి యని పక్షు లడిగెను. చిత్రగ్రీవుఁ డిట్లనియె. 'లోకమందు మాతాపితలు మిత్త్రుఁ డనువీరు మువ్వురే హితులు. తక్కినవారందఱు ప్రయోజనముఁబట్టి హితులగుచున్నారు. కాఁబట్టి యిప్పుడునాకు మిత్త్రుఁ డొకఁ డున్నాఁడు. అతఁడు హిరణ్యకుఁ డను మూషికరాజు. గండకీతీరమందు విచిత్రవన మాతనివాసస్థానము. అతఁడు పండ్లబలిమిచేత వలత్రాళ్లు తెగఁగొఱికి మనయాపదఁ బాపఁగలఁడు. అక్కడికి మనము పోవుదము.' అని చెప్పఁగానే పావురములన్ని చిత్రగ్రీవుఁడు చెప్పినగుఱుతు పట్టుకొనిపోయి హిరణ్యకుని కలుఁగుదాపున వ్రాలెను. అప్పుడు హిరణ్యకుఁడు కపోతముఁలు వ్రాలినసద్దు విని భయపడి కలుఁగులో మెదలకుండెను. అనంతరము చిత్రగ్రీవుఁడు కలుఁగుదాపు చేరి యెలుఁగెత్తి

యి ట్లనియె: 'ఓచెలికాఁడా! యేల మాతో మాటలాడవు?' అనఁ
గానే హిరణ్యకుఁ డామాట సవ్వడిపట్టి శీఘ్రముగా లాఁగ వెలు
పలికివచ్చి యిట్లనియె.

'ఆహా! యేమి నాభాగ్యము! నాప్రియమిత్రుఁడు చిత్ర
గ్రీవుఁడు నాకు నేత్రోత్సవముచేయుచున్నాఁడు.' అని పలుకుచు
వలలోఁ దగులుకొన్న పావురములను జూచి వెఱఁగుపడి క్షణ
మూరకుండి 'చెలికాఁడా! యిది యే'మని యడిగెను. చిత్రగ్రీవుఁ
డిట్లనియె. 'చెలికాఁడా! యిది మాపూర్వజన్మ కర్మమునకు
ఫలము. చేసినకర్మ మనుభవింపక తీఱునా?' అనఁగానే హిరణ్య
కుఁడు చిత్రగ్రీవునిబంధము ఛేదించుటకయి సమీపింపఁగా
జిత్రగ్రీవుఁ డిట్లనియె. 'చెలికాఁడా! చేయవలసినది యీలాగునఁ
గాదు. ముందుగా నాయాశ్రితులబంధము వదలింపుము. తరు
వాత నాకుఁ గానిమ్ము.' అనిన హిరణ్యకుఁడు విని యిట్లనియె.
'నాదంతములు మిక్కిలి కోమలములు. అన్నిటిబంధములు కఱచి
త్రెంపఁజాలను. పండ్లబలిమి కలిగినంతదాఁక నీబంధము ఛేదించె
దను. తరువాత శక్తిగలిగినపక్షమునకు మిగిలినవారికార్యము
చూచుకొందము.' అనిన విని చిత్రగ్రీవుఁ డిట్లనియె. 'ఆలాగు
ననేకానిమ్ము శక్తికిమీఱి యేమిచేయవచ్చును? ముందు యథా
శక్తి వీరినిర్బంధము మానుపుము. ఆపల నాపని యెప్పటి కయిన
యట్లు విచారించుకొందుము.' అనిన హిరణ్యకుఁ డిట్లనియె.
'తన్ను మానిపరుల రక్షింపవలె ననుట నీతిగాదు. "తన్ను మాలిన
ధర్మము మొదలు చెడ్డబేరము గలదా" యనులోకోక్తి విన్నాఁ
డవుగావా? తాను బ్రదికికదా సమస్తపురుషార్థములు సంపా

దించుకోవలె ? తాను బోయినతర్వాత దేనితోనయినఁ బని యేమి?' అన విని చిత్రగ్రీవుఁ డిట్లనియె. 'చెలికాఁడా! నీవుచెప్పి నది నీతి కాదనను. అయినను నావారిదుఃఖము చూచి సహింపఁ జాలను. కాఁబట్టి యింత నొక్కి చెప్పితిని. ప్రాజ్ఞుండు ధనజీవి తములయిన మానుకొని మంచివారికి వచ్చినకీడు తొలఁగింప వలెనని నీతికోవిదులు చెప్పుదురు. అది యటుండ నిమ్ము. నావంటి వారు వీరు. వీరివంటివాఁడను నేను. ఇప్పటికి కొదవని నాప్రభు త్వమువలన వీరికి గాఁగల ఫల మేమి? చెలికాఁడా! హేయమై వినశ్వరమైన యీకళేబరమం దాస్థ మాని నాకు యశము సంపాదింపుము. నావలన జీతమా బత్తెమా యేదియు లేదు. అయినను వీరు సర్వకాలము నన్ను విడువక కొలుచుచున్నారు. నేను వీరి ఋణ మెప్పుడు తీర్చుకోఁగలనో యెఱుఁగను. నా బ్రతుకు ముఖ్యముగాఁ జూడకు. వీరిప్రాణములు రక్షించితేఁ జాలును. అనిత్యమై మలినమైన కాయముచేత నిత్యమై నిర్మల మైనయశము లభించెనా దానికంటె లాభము గలదా? శరీరము నకు గుణములకు మిక్కిలి యంతరము. శరీరము క్షణభంగు రము; గుణములు కల్పాంతస్థాయులు. ఇట్టిశరీరము నపేక్షించి కీర్తి పోఁగొట్టుకొనవచ్చునా!' అన విని హిరణ్యకుఁడు సంతోష పడి పులకితుఁడై యిట్లనియె. 'చెలికాఁడా! మేలుమేలు, నీయా శ్రితవాత్సల్యము కొనియాడ నేనేపాటివాఁడను? ఈగుణ ముచే త్రిలోకాధిపత్యమునకుఁ దగియున్నాఁడవు.' అని పలికి యన్నింటిబంధములు తెగఁగొఱికి వాని నన్నిటిని సాదరముగా సంపూజించి, 'చిత్రగ్రీవా చెలికాఁడా ! యెంతవారికిఁ గాని పూర్వకర్మ మనుభవింపక తీఱదు. వలఁ దగులుకొనుటకు నొచ్చు

కోకు. సమస్తము తెలిసినవాఁడవు. నీకు నాబోఁటులు చెప్పెడు పాటివారుగారు.' అని యూఱడించి బలఁగంబుతోఁ జిత్రగ్రీవున కాతిథ్యముసేసి కౌఁగిలించుకొని వీడుకొలిపెను. అనంతరము చిత్రగ్రీవుఁడు తనపరిజనములతో హిరణ్యకునిగుణములు కొని యాడుచు నిజేచ్ఛం జనియె. మిత్రలాభముకంటె మించిన లాభము లోకమునం దేదియుఁ గానము. కాఁబట్టి బుద్ధిమంతుఁడు పెక్కండ్రు మిత్రులను సంపాదించుకోవలెను. ఒక్కమూషికము తోడిమైత్రి కపోతముల కెంతకార్యము చేసినది చూడుఁడు." అని చెప్పి మఱియు విష్ణుశర్మ యిట్లనియె. "అనంతరము హిరణ్య కుఁడు తన లాఁగ చొచ్చెను. పిమ్మట లఘుపతనకము జరిగిన సర్వకార్యమునకు వింతపడి హిరణ్యకునిలాఁగద్వారమున వ్రాలి యిట్లనియె. 'ఓహో హిరణ్యకా! కొనియాడఁదగినవాఁడవు గదా! నేను నీతో సఖ్యముగోరి వచ్చితిని. అనుగ్రహింపుము. నాకోరిక సఫలము చేయుము.' అనిన విని హిరణ్యకుఁడు లాఁగ లోపలనుండి యిట్లనియె. 'ఎవ్వఁడవు నీవు?' అన విని కాకి యిట్ల నియె. 'నేను వాయసమను. నాపేరు లఘుపతనకము' అనఁగానే హిరణ్యకుఁడు నవ్వి 'సరిసరి, నీతో నామైత్రి చేయవలె? ఏది యెవ్వ రితోఁ దగునో వారితో బుద్ధిమంతుఁ డది చేయవలె. తగని కార్యము చేయరాదు. నేను భోజ్యమను. నీవు భోక్తవు. మనకు మైత్రి యేలాగున సరిపడును? నీతో మైత్రి నాకు విపత్తునకే కారణము. పూర్వ మొకమృగము జంబుకమును నమ్మి దాని కపటవచనములకు లోఁబడి పాశములోఁ దగులుకొని వాయ సముచేత రక్షింపఁబడియె.' అనిన విని సవిస్తరముగా నాకది చెప్పు మని లఘుపతనక మడిగెను. హిరణ్యకుం డిట్లనియె.

"మగధదేశమందు మందారవతి యనువనముగలదు. అందు బహుదినములనుండి మృగకాకములు రెండు మిక్కిలి సఖ్యముతో వాసముచేయుచుండెను. ఆమృగము లెస్సగా బలిసి వనములో విచ్చలవిడి సంచరించుచుండఁగా నొకనక్క చూచి యిట్లు చింతించె. 'ఆహా! యీజింక యెంత పోతరించియున్నది! ఏలాగున దీని మాంసము నాకు లభించును? మంచిది. దీనికి నమ్మకముపుట్టించెద'నని యాలోచించి తిన్నఁగా సమీపముచేరి యిట్లనియె. 'మిత్రుఁడా! కుశలమా?' అనఁగానేవిని యెవ్వఁడవు నీవని మృగ మడిగెను. నేను నక్కను నాపేరు సుబుద్ధి. నాబంధువులందఱు నన్నొంటిఁ జేసి పోయిరి. ఈయడవిలో మృతకల్పుఁడనయి యున్నవాఁడను. మఱి యెవ్వరితోఁ గాదు దైవముతోఁ జెప్పుచున్నాను వినుము. నిన్నుఁ జూడఁగానే నాబంధువులందఱు వచ్చినట్లు తోఁచినది. సజ్జనదర్శనము సమస్తదోషములు పోఁగొట్టును; సర్వశుభము లిచ్చు నని పెద్దలు చెప్పుదురు. దాని కిదే తార్కాణము. నేను నీతోడ సావాసము చేయవలెనని మిక్కిలి కోరుచున్నాఁడను. నాకోరిక నెఱవేర్పుము.' అనిన విని మంచి దాలాగుననే కానిమ్మని మృగము నక్కను వెంటఁ బెట్టుకొనిపోయి సాయంకాలము తనవాసస్థానము చేరెను. అక్కడ మందారవృక్షముమీఁది కాకి తనమిత్రమయిన మృగమును జూచి యెవ్వ డీతఁ డని యడిగెను. ఈతఁడు సుబుద్ధి యనుజంబుకోత్తముఁడు. నాచెలిమి గోరి వచ్చినవాఁ డని జింక చెప్పెను. ఆమాటలు వాయసము విని యిట్లనియె. 'క్రొత్తగా వచ్చినవానిని నమ్మవచ్చునా? ఇప్పుడు నీవు చేసినపని మంచిది కాదు. కులశీలములు తెలియక యెవ్వరికిఁగాని తావిచ్చుటతగదు.

పూర్వము మార్జాలమునకు జరద్గవ మనుగృధ్రము తా విచ్చి మృతిఁబొందెను. అది సవిస్తరముగా వివరించెద వినుము.

'భాగీరథీతీరమందు గొప్పజువ్వివృక్షము గలదు. దాని తొఱ్ఱలో జరద్గవ మను చీకుముసలిగద్ద వాసము చేయుచుండెను. ఆవృక్షముమీఁద వసించుపక్షులు దానికి జీవనముకయి తాము తెచ్చుకొన్న యెరలోఁ గొంచెముకొంచెము పంచి యిచ్చుచుండును. అది దానిచేత జీవనముచేయుచుండెను. ఒకనాఁడు దీర్ఘకర్ణ మనుపిల్లి పక్షిపిల్లలను భక్షించుటకై యామ్రానికడకు సద్దుచేయక వచ్చెను. దానిరాక చూచి పక్షిపిల్లలు భయపడి కూయసాగెను. ఆకోలాహలమును జరద్గవము విని యెవ్వరో పరులు వచ్చుచున్నారని యెంచుకొని, యెవ రక్కడ నని హెచ్చరించెను. అప్పుడు బిడాలము గద్దను చూచి భయపడి 'హా! చచ్చితిఁగదా! కడుదాపునకు వచ్చితిని; సురిఁగిపో నయితి గాదు; తప్పించుకొనుట కుపాయాంతరము లేదు; కార్యము మించినది; ఇప్పుడు వెనుకదీయ రాదు; కానున్నది కాకమానదు; 'ఱోట్రిలోఁ దలదూర్చి రోఁకటిపోటునకు వెఱవఁ దీఱునా? మంచిది. ఇప్పుడు మంచితనముచూపి దీనికి నమ్మిక పుట్టఁ జేసెద' నని యాలోచించి యెట్టయెదుర నిలిచి యిట్లనియె. 'అయ్యా! నమస్కారము. అనఁగానే గృధ్రమువిని యెవ్వఁడవు నీవని యడిగెను. 'నేను బిడాలమును; నన్ను దీర్ఘకర్ణమని చెప్పుదురు.' అన విని గృధ్ర మిట్లనియె. శీఘ్రము దూరముగాఁబో; పోకుంటివా నీప్రాణములు నీవి కావు. చూడు నాదెబ్బ' అనఁగానే బిడాల మిట్లనియె. 'ముందు నామాటవినుఁడు. నేను వధ్యుఁడనో కానో విచారింపుఁడు. తర్వాత మీకుఁ దోఁచినట్లు చేయుఁడు. గుణ

దోషములు విచారించి వీఁడు పూజ్యుఁడు వీఁడు వధ్యుఁ డని నిర్ణయింపవలెఁగాని జాతిమాత్రముచేత నిర్ణయింపఁగూడునా?' నావుడు నీవు వచ్చినపని యేమని గృధ్ర మడిగెను. పిల్లి యి ట్లనియె. 'ఇక్కడ గంగలో నిత్యము స్నానము చేయుచు మాంసాశనము విడిచి బ్రహ్మచారినై చాంద్రాయణవ్రతము చేయుచున్నాఁడను. మిమ్ము ధర్మజ్ఞు లని మంచివా రని యిచ్చటి పక్షు లప్పుడప్పుడు ప్రశంసింపఁగా విని బహుదినములనుండి నాకు మీదర్శనము చేయవలె నని కోరిక కలదు. అది యిన్నాళ్లకు ఫలించినది. మీరు విద్యావయోవృద్ధులు. కాఁబట్టి మీవలన ధర్మములు వినవలె నని సయితము మనసుకలదు. ధర్మజ్ఞులయిన మీరే యిల్లుత్రొక్కుకొని వచ్చినవానిని వధింపను యత్నము చేసితిరి. గృహస్థధర్మమా యిది! శత్రువున కయినను గృహమునకు వచ్చినవాని కాతిథ్యము చేయవలసినది. ధనము లేని పక్షమునకు మంచిమాటలతోనైన సత్కరింపవలెను. ఉస్సురని యింటికి వచ్చినయతిథి పోరాదు. అది మిక్కిలి పాపమునకు మూలము.' అనఁగావిని గద్ద యిట్లనియె. 'పిల్లులకు మాంసమందు రుచి మిక్కుటము. ఇక్కడనా పక్షిపిల్ల లున్నవి. అందుచేత నే నట్లుచెప్పితిని.' అనఁగానే పిల్లి రెండుచెవులు మూసికొని కృష్ణ! కృష్ణ ! యని యిట్లనియె. ఎంతపాపముచేసి యీపిల్లిజన్మ మెత్తితినో యిదిచాలక యీపాపముసహితము కట్టుకోవలెనా? ఎంత మాట వినవలసివచ్చెను. ధర్మశాస్త్రము విని నిష్కాముఁడనై యిప్పుడు చాంద్రాయణవ్రతము చేయుచున్నాఁడను. నే నిట్టి పాపము చేయుదునా! పరస్పరవిరుద్ధములయిన ధర్మశాస్త్రములు సహిత "అహింసా పరమో ధర్మ" యనుచో నైక్యమతము

గలిగియున్నవి. ఏహింసగాని చేయక సర్వభూతములయందును
దయాళువులయి వర్తించువారికి స్వర్గము కరస్థము భూతదయ
గలవాఁడె సర్వధర్మములు చేసినవాఁడు. అది లేనివాఁడు
చేసియుఁ జేయనివాఁడె కడపటఁ దాను జేసినధర్మములు తనకు
సహాయమయి వచ్చునుగాని తక్కినదియేదియు లోకములోనిది
తోడ రాఁబోదు. తెలియక చెడినకాలము పోనిమ్ము. తెలిసి
యింకఁ జెడుదునా? అడవిలో స్వచ్ఛందముగా మొలచిన
యేశాకముతో నయిన క్షుద్బాధ దీర్చుకొని ప్రొద్దుబుచ్చవచ్చును.
ఈపాడుపొట్టకయి యింతపాపముచేయుట కెవ్వఁడు పాలు
పడును? ఆహా! యెంతమాటాడితిరి. అనఁగా గ్రద్దవిని, 'కోపము
చేయకు. క్రొత్తగా రాఁగానే వచ్చినవారిస్వభావ మేలాగునఁ
దెలిసికోవచ్చును? అప్పుడు తెలియక చెప్పినమాట తప్పుగాఁ
బట్టఁబోకు. పోయినమాట పోనిమ్ము. నీవు యథేచ్ఛముగా
రావచ్చును బోవచ్చును మాకడ నిలువవచ్చును. నీ కొక యడ్డంకి
లే' దని చెప్పెను. అనంతరము మార్జాలము జరద్గవముతో
మిక్కిలి సఖ్యము గలిగి యాతొఱ్ఱలో వాసముచేయుచుండెను.
ఇట్లు కొన్ని దినములు కడచినతర్వాత మార్జాలము ప్రతిదినము
నడిరేయి చప్పుడుచేయక వృక్షమెక్కి పక్షిపిల్లలను గొంతు
కొఱికి తెచ్చి తొఱ్ఱలోఁ బెట్టుకొని తినసాగెను. అక్కడిపక్షులు
తమపిల్లలను గానక మిక్కిలి దుఃఖించి యక్కడక్కడ వెదక
నారంభించెను. అది యెఱిఁగి పిల్లి తొఱ్ఱవెడలి పాఱిపోయెను.
ఆపక్షులు వెదకుచువచ్చి తొఱ్ఱలోఁ దమయెముకలు చూచి
యీగద్దయే మనపిల్లలను భక్షించిన దని నిశ్చయించి దానిని
గోళ్లతో జిక్కి చంచువులతోఁ బొడిచి చంపెను.

కాఁబట్టి క్రొత్తగా వచ్చినవానిని నమ్మరాదని చెప్పితిని. అనఁగా విని నక్క కాకిని మిక్కిలికోపించి చూచి యిట్లనియె. ప్రథమదర్శనదినమందు మృగమునకు నీవుసహితము క్రొత్త వాఁడవే అది యెట్లు నీతో మృగమునకు స్నేహము రాఁగా రాఁగా వర్ధిల్లుచున్నది? నీకు మాఱు లేదుగనుక నీతుల నినోరికి వచ్చినవి వదరుచున్నావు. విద్వాంసుఁడు లేనిచోట స్వల్పబుద్ధియు సమ్మానింపఁబడుచున్నాఁడు. వృక్షములేనిదేశమందు ఆముదపుఁజెట్టు మహావృక్షముకదా? వీఁడు తనవాఁడని వీఁడు పరుఁడని యెన్నిక లఘుబుద్ధులకు. మహాత్ములకు లోకమే కుటుంబము. ఈమృగము నాకు బంధువయినట్లు నీవు కావా? ప్రపంచ మున్నంతకాలము బ్రతుకఁబోము. ఎప్పుడో కాలుఁడు మ్రింగఁ గాచియున్నాఁడు. ఉన్నకాల మందఱికి మంచివాఁడనిపించుకొని పోవలెఁగాని యిట్టి విషమబుద్ధిచేత ఫలమేమి? అనఁగా విని మృగ మిట్లనియె. ఈవాదులాటయేల? మన మందఱ మొకచోట మంచిమాటలతో సుఖముగాఁ గాలక్షేపము చేయుదము. వీనికి వీఁడు మిత్రము, వీనికి వీఁడు శత్రువని నియమము గలదా? వ్యవహారముచేతనే మిత్రులుగాని శత్రువులుగాని కలుగుచున్నారు. నావిని కాకి యాలాగే కానిమ్మని పలికెను. అనంతరము మృగ కాక జంబుకములు కడునేస్తము గలిగి తద్వనమందు వాసముచేయుచుండెను. ఇట్లు కొంతకాలము జరిగినవెనుక నొక్కనాఁడు నక్క జింకతో నిట్లనియె. చెలికాఁడా! యీవనమం దొకచోట నిండుపయిరు గలపొలము నేఁడుచూచి తిని. నీవు నావెంబడిరా. నేను నీ కాపొలము చూపుచున్నాను. అని చెప్పి మృగమును వెంటఁబెట్టుకొని పోయి క్షేత్రము

చూచెను. తరువాతఁ బ్రతిదిన మక్కడికి మృగముపోయి పైరు మేయసాగెను. ఒకనాఁ డది క్షేత్రస్వామిచూచి యీమృగము పయిరు మేయ మరగినది. దీనిని జీవముతో విడువరాదని యాలోచించి పొలములో గూఢముగా వలపన్ని యింటికిఁబోయెను. ఎప్పటివాడుకచొప్పున మఱునాఁడు మృగము వచ్చి పొలములో మేయ దిగి వలలోఁ దగులుకొని యిట్లు చింతించె. అయ్యో! వలలోఁ దగులుకొంటినిగదా యేమి చేయుదును? ఈకాలపాశమువలన నన్ను విడిపించు దిక్కెవరున్నారు? ఇప్పుడు నాప్రియమిత్రుఁడు జంబుకోత్తముఁడు వచ్చెనా యీ విపత్తు మాన్పఁగలఁడు. అని చింతించుచుండఁగా నక్కవచ్చి చూచి లోపల సంతోషపడి యిన్నాళ్లకునాయత్నము ఫలము నకు వచ్చినది. పొలముకాఁపు దీనిని నేఁడు చంపక మానఁడు. దీనియొక్క రక్తమాంసములతోఁ గావలసినన్ని యెముకలు దొరకఁగలవు' నాఁకు నేఁడుగా పండుగు. అని యెంచుకొనుచు దాపునకుఁ బోయెను. మృగము నక్కను జూచి యింక భయము లేదని యెంచుకొని యిట్లనియె. చెలికాఁడా! శీఘ్రముగావచ్చి వలఁ గొఱికి నన్నుఁ గాపాడుము. అనఁగానే నక్క కపియఁ బోయి వలచూచి చెలికాఁడా! యీవల నులినరములతోఁ జేయబడినది. నేఁడు భట్టారకవారము నరములు పండ్లతో నేనెట్లు తాఁకుదును? మిత్రుఁడా! మనములో వేఱుగాఁ దలఁపబోకు. మఱి యేపనిగాని చెప్పితివా ఇప్పుడూ తలతోఁ జేయుచున్నానని పలికెను. అంతట సాయంకాలము కావచ్చె ను. కాకి తనమిత్రము హరిణము తావుచేరమికి మిక్కిలి చింతించి అక్కడక్కడ! వెదకుచువచ్చి యాపొలముకడకు వచ్చె

చూచి చెలికాఁడా! యిది యేమని యడిగెను. మిత్రునిమాట విననిదానికి ఫలమిది. చేటుగాలము దాపించినవాఁడు హితుల మాట యేల విను నని మృగము పలికెను. అన విని కాక మా నక్క యెక్కడ నని యడిగెను. నామాంసము తినవలెనని యిక్కడనే యెక్కడనో కాచుకొనియున్నదని మృగము చెప్పెను. నావిని కాకి యిట్లనియె. నేను మునుపే చెప్పితిని. నామాట వినక పోయితివి. పరులకు నేను గీడుచేయఁ బోను. వారు నాకొకకీడు చేయఁబోరనినమ్మరాదు. మంచివారికిసహితము దుష్టులవలన భయముగలదు. పోఁగాలము దాపించినవారు దీప నిర్వాణగంధము నరుంధతిని మిత్రవాక్యమును మూర్కొనరు కనరు వినరని పెద్దలు చెప్పుదురు. ప్రత్యక్షమం దిచ్చకములాడి పరోక్షమందుఁ గార్యహాని చేయుసంగాతకాఁడు పయోముఖ విషకుంభమువంటివాఁడు. అట్టివానిసాంగత్యమవశ్యము మాను కోవలెను. అనఁగా విని హరిణము నిట్టూర్పు విడిచి యిట్లనియె. సజ్జనసాంగత్యమువలన సర్వశ్రేయములవలె దుర్జనసాంగత్యము వలన సర్వానర్థములు ప్రాప్తించును. దానికి సంశయము లేదు. ఆజిత్తులమారి మృగముయొక్క తేనెమాటలకు మోస పోయితిని. నాలిక తీపు లోను విషమని యెఱుఁగుదునా? అని చెప్పుచుండఁగా దూరమందు వచ్చుచున్న పొలముకాఁపును జూచి కాకి యిట్లనియె. చెలికాఁడా! యిప్పుడు తగిన వెరవు విచారింపక మసలరాదు. అదిగో పొలముకాఁపు బడియ చేతఁ బట్టుకొని యమునివలె వచ్చుచున్నాఁడు. నాకొక యుపా యము తోఁచుచున్నది విను. ఊపిరి బిగియఁబట్టి కడుపు పూరటించి నాలుగుకాళ్లు చాఁచుకొని బిఱ్ఱబిగిసికొని చచ్చి

నట్లు పడియుండుము. నేను నీపయినెక్కి ముక్కుతో నీకన్నులు
పొడుచునట్లు కూర్చుండియుండెద. నేను సమయముచూచి
కూసెదను. కూయఁగానే లేచి పాఱిపొమ్మని చెప్పెను. పిదప
మృగము కాకి చెప్పినట్లు పడియుండెను. తదనంతరము పొలము
కాఁపు దాపునకు వచ్చి చూచి మృగము చచ్చినదని యెంచు
కొని వల వదలింపఁగానే కాకికూసెను. అదివిని మృగము శీఘ్ర
ముగా లేచి పఱగెత్తెను. ఆహా! యిది యెంత మాయలమారి
మృగము. నన్ను మోసపుచ్చినదిగదా? యని యెంచుకొని
పొలముకాఁపు తనచేతిబడియను విసరివ్రేసెను. దైవికముగా
దానితాఁకువడి నక్కచచ్చె. చూడు నక్క యేమితలంచు
కొని యుండెను? తుద కేమాయెను? పరులకు హానిచేయఁ
గోరువారు తామే చెడిపోవుదురు.

అనిన విని హిరణ్యకునితో లఘుపతనక మిట్లనియె. ఏల
యీమాటలు? నీతో మిత్రభావము కోరివచ్చినాఁడను. నన్ను
వేఱుగాఁ దలంపకు. నిన్ను నేను భక్షించినమాత్రాన నాకడుపు
నిండునా? నామనవి విను. చిత్రగ్రీవునివలె నన్ను సహితము
గ్రహింపుము. నీసౌజన్యమే యింతగా నాచేత నిన్ను వేఁడు
కొలుపుచున్నది. నీకు దయవచ్చునంతదాఁక నిన్ను విడిచి పద
లను. నీవంటిసజ్జనుని సాంగత్యముచేసి సౌఖ్యము పొందని
వాని జన్మ మేల?

అనిన హిరణ్యకుఁ డిట్లనియె. నీవు చపలుఁడవు. చపలునితో
మైత్రి సర్వదా చేయరాదు. ఇంతే కాదు. మాకు నీవు శత్రుపక్ష
ము వాఁడవు. ఎంతమంచివానితోఁగాని బాయతో సాంగత్యము
చేయరాదు. కాఁబట్టి నీతో నాకు నేస్తము సరిపడదు. అదె

క్యము శక్యము గాఁబోదు. శక్య మశక్యముగాఁబోదు. జలము
మీఁదబండ్లు నేలమీఁదనావలు నడచునా? ఏల యందనిమ్రాని
పండ్ల కఱ్ఱు చాఁచెదవు? నీపనిమాను. మిక్కిలి ప్రొద్దెక్కినది.
కడుపుపనివిచారించుకో. పోపో. నావిని లఘుపతనక మిట్లనియె.
నాస్వభావము తెలియక యేల యింతదూరము వెగటుమాట
లాడెదవు ? కడపటిది విను. చిత్రగ్రీవుఁడు లోకోత్తరుఁడవయిన
నీతో సౌహార్ద సౌఖ్య మనుభవించుట చూచితిని. నీతో సంగా
తము చేయవలెనని మనసుపడితిని. నాప్రార్థన విని నాకోరిక నెఱ
వేర్చితివా సరి, లేదా యింతే నాభాగ్య మనుకొని యిక్కడనే
ప్రాయోపవేశముచేసి ప్రాణములు విడిచెదను. ఇది నానిశ్చ
యము. మృద్ఘటమువలె దుర్జనుని సులభముగా భేదింప
వచ్చునుగాని సంధింపఁగూడదు. హేమఘటమందువలె సుజను
నియం దీలక్షణము విపరీతమైయుండును. ద్రవత్వమువలన సర్వ
లోహములును, నిమిత్తమువలన మృగపక్షులును, భయలోభ
ములవలన మూర్ఖులును, దర్శనమువలన సజ్జనులు గలిసి
కొందురు. మఱియు శుచిత్వము త్యాగము శౌర్యము సుఖ
దుఃఖములయందు సామాన్యము దాక్షిణ్యము స్నేహము
సత్యవర్తనమును సుహృద్గుణము లని చెప్పుదురు. ఈగుణము
లన్నియు నీయందుఁ గానఁబడుచున్నవి. ఇతరుని నీవంటివానిని
విని యెఱుఁగను. నీబోఁటివానితో సఖ్యము సంపాదించు
కొంటకంటె మేలొకటి లేదు. నాకోరిక యీడేఱిచితివా
మేలయ్యెను. లేదా యింతే నాయదృష్టమని యెంచుకొనియె
దను. అనిన హిరణ్యకుఁడు లాఁగ[illegible] వెడలివచ్చి యిట్లనియె.
లఘుపతనకా ! నీవచనామృతముచేత మిక్కిలి తృప్తిఁబొందితిని.

ప్రీతిపూర్వకమయిన సజ్జనసల్లాపమువలె గంధసారమును హిమాంబుపూరమును వారిజాతవారమును శ్రమముపోఁగొట్టఁ జాలవు. దుర్జనుఁడు తలఁచునది యొకటి చెప్పునది యొకటి చేయునది యొకటి. సజ్జనుఁడు తలఁచునది చెప్పునది చేయునది యొకటిగనే యుండును. నీయందు దోషము లేశమయినను స్వభావముచేతఁ గానఁబడదయ్యె. నీవలన మిక్కిలి సంతోషించి తిని. నీయభిమతమే కానిమ్ము. అని పలికి హిరణ్యకుఁడు యథోచితసత్కారములుచేసి వాయసమును సంతోషపఱిచి వీడుకొలిపి తనవివరము ప్రవేశించెను. నాఁటఁగోలె మూషిక వాయసములు కుశలప్రశ్నములచేత నన్యోన్యాహారదానముల చేత విస్రంభాలాపములచేతఁ గాలక్షేపము చేయుచుండెను. ఒక్కనాఁడు వాయసము మూషికమును జూచి చెలికాఁడా! యిక్కడ నాకాహారము కష్టతరలభ్యముగానున్నది. కాఁబట్టి యీవనము విడిచి యెక్కడికేనిఁ దగినయెడకుఁ బోవలెనని యత్నపడియున్నవాఁడను. అనిన విని హిరణ్యకుఁ డిట్లనియె. దంతములు కేశములు నఖములు నరులును స్థానభ్రంశమును బొందిరేని రాణింపరు. కాఁబట్టి మతిమంతుఁ డీయర్థము తెలిసి కొని స్థానము మానవలె ననుబుద్ధి మానుకోవలెను. అనిన విని కాకి యిట్లనియె. చెలికాఁడా! నీవు చెప్పినవచనము దుర్బలవిష యము. గజములు సింహములు సత్పురుషులును స్థానమువిడిచి విచ్చలవిడి సంచరింతురు. కాకములు మృగములు కాపురుషులును స్థానము మానఁజాలక వినాశముఁ బొందుదురు. అనిన విని హిర ణ్యకుఁ డిట్లనియె. చెలికాఁడా! ఇక్కడ మానుకొని యెక్కడికిఁ బోవలెనని నీయత్నము? అనిన వాయసమిట్లనియె. ముందు చోటు

చూచి పాదము మోపికదా వెనుకటిపాద మెత్తవలెను? అట్లు స్థానాంతరము విచారించుకోక పూర్వస్థానము మానరాదు. కాఁబట్టి ముందు గంతవ్యస్థానము నిరూపించుకొనక ప్రయత్నపడినవాఁడనుగాను విను. దండకారణ్యమందుఁ గర్పూరగౌర మను సరోవరము గలదు. అందు నా ప్రియమిత్రుఁడు మంథరుఁ డను కూర్మరా జున్నాఁడు. అతఁడు సహజధార్మికుఁడు. పరులకు వలసినన్ని ధర్మములు చెప్పవచ్చునుగాని తాను నడచుకోలు దుష్కరము గాదా? ఆ తామేటిమేటి మీనాద్యాహారదానములచేత నన్ను భరింపఁజాలినవాఁడు. నావిని హిరణ్యకుఁ డిట్లనియె. నీవుపోయినతర్వాత నా కిక్కడఁ బని యేమి? సమ్మానము జీవనము బాంధవులు విద్యాగమమును లేనిదేశము మానవలెనని పెద్దలు చెప్పుదురు. కాఁబట్టి నీతోనన్నుఁ దోడుకొనిపొమ్ము వచ్చెదను. అనఁగా విని లఘుపతనకము సంతోషపడి వల్లెయని పయనమై మూషికముతో సరసాలాపములు కావించుచుఁ గతిపయదినంబుల కాకొలను చేరఁబోఁగా మంథరుఁడు దూరమునంచుండిచూచి యెదురువచ్చి కొనిపోయి లఘుపతనక హిరణ్యకులకు యథోచితముగా నాతిథ్యము చేసెను.

తర్వాత లఘుపతనకుఁడు మంథరునితో నిట్లనియె. చెలికాఁడా! యీ మూషికరాజును నీవు మిక్కిలి సమ్మానింపుము. ఇతఁడు పుణ్యకర్ములలోపల ధురీణుఁడు; గుణరత్నాకరుఁడు; హిరణ్యకుఁ డనువాఁడు. ఈతనిగుణములు శేషుఁడు సహితము వర్ణింపఁజాలఁడు. నే నేపాటివాఁడను. అని పలికి మొదటినుండి హిరణ్యకుని వృత్తాంతము సర్వము వినిపించెను. అంతట మంథరుఁడు హిరణ్యకుని మిక్కిలి సమ్మానించి యిట్లనియె. హిరణ్యకా!

నీవు నిర్జనవనమందు వాసముచేయుటకు నిమిత్తమేమి చెప్పుమని యడిగెను. హిరణ్యకుం డిట్లనియె. చంపకవతి యనుపట్టణము గలదు. అందు సన్న్యాసులు పెక్కండ్రు వాసముచేయు చుండుదురు. అందుఁ జూడాకర్ణుం డనుపరివ్రాజకుఁడు గలఁడు. అతఁడు తానుభోజనముచేసి మిగిలినవంటకము భిక్షాపాత్రలోఁ బెట్టి చిలుకకొయ్యమీఁదనుంచి నిద్రపోవును. నేను సద్దు చేయక దానిమీఁది కెగిరి ప్రతిదిన మావంటకము భక్షించి పోవుచుండుదును. ఒకనాఁడు చూడాకర్ణుఁడు తనస్నేహితునితో వీణాకర్ణుఁ డనుసన్న్యాసితో మాటలాడుచుండి మాటిమాటికి మీఁదివంకచూచి తన గిలుకకఱ్ఱలతో నేలమీఁదఁగొట్టి నన్ను వెఱపించుచు వచ్చెను. అప్పుడు వీణాకర్ణుఁడు, చూడాకర్ణుఁడా! యేమది మీఁదుచూచి నేల కఱ్ఱతోఁ దట్టుచున్నాఁడ వని యడుగఁగా జూడాకర్ణుఁ డిట్లనియె. ఒకయెలుక ప్రతిదినము చిలుకకొయ్యమీఁది పాత్రమునం దున్న యన్నము భక్షించి పోవుచున్నది. నాకు దీనియుపద్రవము పెద్దదిగా నున్నది యని చెప్పెను. ఆమాటలు వీణాకర్ణుఁడు విని యెక్కడి యెలుక! యెక్కడి చిలుకకొయ్య! యింత యల్పజంతువున కింతపొడవున కెగురుబల మెక్కడనుండి వచ్చెను ? దీనికేమయినను నిమిత్తము లేకమానదు. పూర్వము నేనొక విప్రునియింటికి భిక్షార్థము పోయియుంటిని. అప్పు డాబ్రాహ్మణుఁడు తన భార్యనుజూచి రేపమావాస్య. బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. ఏమేమిభోజ్య పదార్థములు కూర్చినదాన వని యడిగిన బ్రాహ్మణి యిట్లనియె. పురుషులు పదార్థములను సేకరించి యింటికిఁ దెచ్చిరేని వానిని స్త్రీలు వలసినపనులకు వాడుకొందురుగాని మీరు తేనిపదార్థము

లెక్కడనుండి వచ్చును? అనిన విని యాతఁడు కోపించి భార్యను జూచి యిట్లనియె. 'ఉన్నంతలో జరుపుకోవలెనుగాని విస్తరించి పదార్థసంగ్రహము చేయవలె నని పేరాస పడరాదు.' అనిన బ్రాహ్మణి యిట్లనియె. 'ఆలాగుననే కానిండు. రేపటికార్యము కలిగినంతటితోనే జరిపెదను.' అని చెప్పి యాయమ్మ నూవులు కడిగి దంచి యెండఁబోసెను. అంతట నొక కోడి వచ్చి యా తిలలు కాళ్లతోఁ జీరి చల్లులాడెను. అది బ్రాహ్మణుఁడు చూచి 'యీనువ్వు లంటుపడ్డవి. బ్రాహ్మణభోజనమునకుఁ బనికిరావు. కాఁబట్టి యివి కొనిపోయి మార్చుకొని ర'మ్మని చెప్పెను. తదనంతర మా బ్రాహ్మణి మఱునాఁడు నేను భిక్షార్థముపోయియున్న యింటిలోఁగిటికి వచ్చి యీనువ్వుఁబప్పు పుచ్చుకొని నూవులిచ్చెదరా యని యాయింటివారి నడిగెను. ఆయింటిపాఱుత యా మాటవిని మిక్కిలి సంతోషపడి చేటలో నూవులు పోసికొని వచ్చి మాటలాడుచుండఁగా నామెభర్తవచ్చి యేమి బేరమాడు చున్నా వని యడిగెను. చేరుడునూవులిచ్చి దంచిననూవులు పుచ్చుకొంచున్నా నని యామె చెప్పెను. ఆమాటలు బ్రాహ్మణుఁడు విని, 'యోసీవెఱ్ఱీ, చేరుడునూవులకు దంచిననూవు లెవ్వరయిన నిత్తురా! ఈమె యీలాగునఁ దెచ్చియిచ్చుట కేమయిన నిమిత్త ముండును. కాఁబట్టి నీ వానూవులు పుచ్చుకోకు' మని చెప్పెను. ఆలాగుననే యీ మూషికమున కింతబలిమియు నిక్కడి సదావాసమును నిమిత్తము లేక సంభవింపవు."

అని వీణాకర్ణుఁడు చెప్పఁగా విని, చూడాకర్ణుఁడు, 'తడవులఁ బట్టి యీయెలుక యిక్కడ నొకలాఁగ త్రావుచేసికొని విడువక వాసము చేయుచున్నది. ఇట్లు వసించుటకు నిమిత్తము తెలిసినది

కాదు. త్రవ్వి చూచెదఁగాక' యనిచెప్పి యొకగుద్దలితో నేను వసించు వివరము త్రవ్వి చిరకాలోపార్జితమయిన సాధనము సర్వము గ్రహించెను. తరువాత సత్త్వోత్సాహములు లేక నానాఁ డాహారము సహితము సంపాదించుకొనఁజాలక దిగులు పడి కృశించి మెల్ల మెల్లగా సంచరించుచుండఁగాఁ జూచి చూడా కర్ణుఁ డిట్లనియె. 'ధనముగలవాఁడె బలవంతుఁడు. ధనముగల వాఁడె పండితుఁడు. ధనము సర్వశ్రేయములకు నిదానము. ధనములేనివానిజీవన మేల? ఈమూషికము తనధనము గోలు పోయికదా తొంటిజవసత్త్వము లుడిగి స్వజాతిసామ్యమును బొందెను. అర్థపరిహీనునకు నిరంతరము ఖేదము సంభవించును. నిరంతరఖేదమువలన బుద్ధిహీనత్వము ప్రాప్తించును. బుద్ధిహీనత వలన సమస్తకార్యములు నిదాఘనదీపూరములట్లు వినాశము నొందును. ధనవంతునకే పౌరుషమును మేధాసంపత్తియు బంధుమిత్రులును గలుగుదురు. పుత్త్రమిత్రవిరహితుని గృహ మును మూర్ఖునిచిత్తమును శూన్యములు. దారిద్ర్యము సర్వ శూన్యము. దారిద్ర్యముకంటెమరణము మేలు. మరణమూపాత యాతనావహము. దారిద్ర్యము యావజ్జీవము తీవ్రవేదనా కరము. ఇంద్రియముల నామమున బుద్ధిని వచోధోరణిని బురు షుఁడు తొంటివాఁడయ్యు ధనముచు బాసిన క్షణముననే లాఁతివాఁడగును. ఇది మహాచిత్రము.' అని యాపరివ్రాజనుఁడు చెప్పఁగా విని మిక్కిలి ఖిన్నుఁడనయి యిట్లు చింతించితిని. ఇఁక నా కిక్కడ వసింపఁదగదు. ఇప్పుడు నావృత్తాంతము పరులతోఁ జెప్పికోలును యుక్తముగాదు. అర్థనాశము మనస్తాపము గృహా మందలి దుశ్చరితము వంచనము పరాభవమును బ్రకాశింపఁ

జేయఁదగ దని పెద్దలు చెప్పుదురు. దైవానుకూల్యము లేక పౌరుషము చెడినప్పుడు మానవంతునికి వనవాసముకంటె సుఖము లేదు. కుసుమస్తబకమువలె మానవంతుఁడు సర్వజనుల మూర్ధముమీఁదనయిన నుండవలె. లేదా వనమందు సమసిపోవలె. ఇక్కడనే వాసముచేసికొని యాచనతో జీవించెద నంటినా దానికంటె గర్హితము లేదు. ఒకమ్రుక్కడిని యాచించుకంటె నిప్పులోఁ బడి శరీరము తొఱఁగుట మేలు. అనృతమాడుటకంటె మౌనము మేలు. పరధనాపహరణముకంటెఁ దిరియుట మంచిది. వివేకహీనుఁడయిన ప్రభువును సేవించుటకంటె వనవాస ముత్తమము. యాచించికొని బ్రతుకుటకంటె మరణము శ్రేయము. సేవావృత్తి మానమునువలె యాచనావృత్తి సమస్త గౌరవమును హరించును. ఒకరి యిల్లు కాచి వారి పెట్టువోఁతలకు దోసిలియొగ్గి యునికియు మిక్కిలి నింద్యము అని నానావిధముల విచారించియు లోభముత్రిప్పులకు లోనయి మరల నర్థసంగ్రహము చేయవలె నని తలఁచి యచ్చోటనే నిలిచితిని. లోభము మోహమును బుట్టించును. మోహము దుఃఖము నుత్పాదించును. దుఃఖము జ్వలనమువలె స్వాశ్రయమునకు నాశము పుట్టించును. కాఁబట్టి లోభమునకు బుద్ధిమంతుఁడు లోఁబడఁడు. తరువాత నే నక్కడ వదలకుంట చూచి చూడాకర్ణుఁడు నన్నుఁ గఱ్ఱతో విసరివ్రేసెను. ఆవ్రేటు దైవవశమువలనఁ దప్పిపోయినది. తగిలియుండెనా యింతకు యమలోకములోఁ బాఁతకాఁపనయియుండనా ? అనంతర మిట్లు చింతించితిని. ఆహా! ధనలోభము సర్వాపదలకు మూలముగదా ? తద్వర్జనముకంటె లోకమందు సుఖమేదియు లేదు. ఆశదిగనాడినవాఁడే సత్పురుషుఁడు.

వాఁడే సర్వశాస్త్రములు చదివినవాఁడు. వాఁడే సర్వధర్మము లాచరించినవాఁడు. ఉదకముకయి పరులగోఁజక ప్రాప్తలాభము నకు సంతోషించువాఁ డొక్కఁడు లోకమందు ధన్యుఁడు. వాఁడే సుఖి. తత్తత్కాలానురూపముగా దేహికి దుఃఖములట్లు సుఖములు కోరకయే ప్రాప్తించుచున్నవి. అందులకయి ప్రయాస పాటు నిరర్థకము. ఈత్రావు తాతముత్తాతలు సంపాదించిన కాణాచి గాదు. భూమండలములో నింకఁ ద్రావు దొరకదా? ఇక్కడ నుండ నేల? ఈ చెడగరపు బోడకల్లుమోఁదులునడి ప్రాణ ములు కోలుపోనేల? ఇంక నెక్కడనైన నొక్కవిజనప్రదేశము చేరి కాలముపుచ్చుట మంచిది. శిలాంతరాళమందలి కప్పను భరించు దయామయుఁడయినయీశ్వరుఁడు నన్నుఁ గాపాడ కుండునా? అని చింతించి మనసు గట్టిపఱచుకొని యచ్చోటు విడిచి యానిర్జనవనము చేరితిని. వనములోఁ గాయగసురలు భక్షించి పడియనీరు త్రాగి యొకచెట్టునీడలో వసించి కాలము పుచ్చుట మంచిదిగాని ధనహీనుఁడనయి నలుగురిలో నుండ రాదు. అనంతరము నా పుణ్యమువలన నా కీమిత్రుఁడు లభిం చెను. నామహాభాగ్యమువలననే యిప్పుడు నీయాశ్రయ మను స్వర్గము దొరకినది. సత్సంగతికంటె లోకమందు మే లేదియు లేదు. సంసారవిషవృక్షమునకు రెండుఫలము లమృతతుల్య ములు. కావ్యామృతరసపాన మొకటి. సజ్జనసంగతి యొకటి. అనిన విని మంథరుఁ డిట్లనియె.

అర్థములు నిత్యములుగావు. యౌవనము ఝరీవేగతుల్యము. జీవనము బుద్బుదప్రాయము. కాబట్టి బుద్ధిమంతుఁడు సత్వర ముగా ధర్మము సమాచరింపవలెను. సమాచరింపనివాఁడు పశ్చా

త్తాపముఁ బొంది శోకాగ్నిసంతప్తుఁ డగును. నీ వతిసంచయము చేసితివి. దానిదోష మిది. తటాకోదరజలములకుఁ బరివాహము వలె సమార్జితవిత్తములకుఁ ద్యాగమే రక్షణము: ధనము పాఁతఱలో దాఁపఱికము చేయుట దానివినాశమునకు దారిచేయుట గాని వేఱుగాదు. వాయికట్టి కడుపుకట్టి ధనము గడించువాఁడు పరులకయి మోపుమోయువానియట్లు క్లేశమునకు మాత్రము పాత్రము భోగత్యాగములకు వినియోగింపనిధన ముంటవలన ఫలమేమి ? పోఁడవలన హానియేమి ? లోభి ధనికుఁడయ్యు భోగవిరహముచే దరిద్రునితో సమానుఁడే. అయినను లోభికి ధనార్జనరక్షణహానులయందు దుఃఖ మొకటి విశేషము. లోభి తనధనము పేదలకుఁ బెట్టఁడు. చుట్టములకు వినియోగింపఁడు. తానుం గుడువఁడు. కడపటనేలపాలో దొంగలపాలో చేయుచున్నాఁడు. ప్రియవచనములతోడి దానము, గర్వసహితముగాని జ్ఞానము, క్షమాసహితమైనశౌర్యము, త్యాగయుక్తమయిన విత్త మనియెడు నాలుగు లోకమందు దుర్లభములు. బుద్ధిమంతునకు సర్వదా ధనార్జన మావశ్యకకార్యమేకాని యతిసంచయేచ్ఛ తగదు. తొల్లి యొక్క జంబుకము లోభము చేత మిక్కిలి వస్తువులు సంగ్రహింపఁగోరి వింటిదెబ్బవడిచచ్చెను. వినుము నీ కాకథ చెప్పెదను.

కల్యాణకటక మనుపట్టణమందు భైరవుఁ డనువ్యాధుఁడు గలఁడు. వాఁ డొకనాఁడు వేఁటకయి సింగాణితూపులు వలయురులు చిక్కము లోనగుసాధనములు పూని వింధ్యాటవికిఁ బోయెను. అక్కడ వాఁ డొకవది కావించుకొని మచ్చువెట్టి పొంచియుండి యొక పోతరించిన మృగము నేసి చంపి యెత్తి

యఱకడఁ బెట్టుకొని వచ్చుచుండఁగా నడగొండవలె నొకపంది కానఁబడెను. అంతట నామృగయుఁడు నాభాగ్యమువలన మాంసాంతరము సయితము దొరికిన దని సంతోషించి యా మృగమును నేలడించి విల్లెక్కువెట్టి బాణము సంధించి సూకరము నేసెను. ఏటువడిన యాక్షణమె యావరాహము క్రోధచోదితమయి శరవేగమున ఘుర్ఘురించుచుఁ బాఱివచ్చి కొమ్మున వానిఁ గొట్టెను. వాఁడు మొదలు నఱికినతరువువలె నేలఁగూలి యొలుచుఁ బ్రాణములు విడిచెను. పందియు మృతిఁ బొందెను. అక్కడ నొక్కసర్పము కిరాతవరాహముల త్రొక్కుడులఁ బడి మడిసెను. అంత నొకనక్క దీర్ఘరావ మనునది యాహారార్థము వనములోఁ గ్రుమ్మరుచు నక్కడికివచ్చి చచ్చిపడి యున్నసర్ప కిరాతవరాహమృగములనుజూచి నాకుభోజనము పుష్కలముగా దొరకిన దని సంతోషించి యిట్లు చింతించె. నాకు మూఁడునెలల గ్రాసమునకు వీనిమాంసము చాలును. ఒకమాసము కిరాతునిమాంసముతోఁ గడపవచ్చును. మృగసూకరములమాంసముతో రెండుమాసములు జరుపవచ్చును. ఒకదినమున కీపాము చాలును. తొలియాఁకలి యిప్పటి కీవింటినారినరముతోఁ దీర్చుకొనియెదఁగాక యని చింతించి చేరువకుఁ బోయి గొనయము పంటనొక్కి కొఱుకఁగానే బెట్టు వదలి గొనయము పెట్టు ఱొమ్మునం దాఁకెను. ఆపెట్టుతోనే యానక్క నేలఁగూలి యొలుచు విలవిలఁ దన్నుకొనుచుఁ జచ్చెను. చూడు లోభము నక్క నేపశకుఁ దెచ్చినది.

కాఁబట్టి యతిసంచయేచ్ఛ తగదని చెప్పితిని. ఒరుల కిచ్చి తాను భుజించినదే తనసొత్తు. పరుల కీక తానుగుడువక కూడఁబెట్టిన

ద్రవ్యము వచ్చినతఱి వెంటరాఁబోదు. అని చెప్పి కూర్మము
మఱియు నిట్లనియె. మిగిలిపోయినది యిప్పుడు త్రవ్వుకోనేల?
పోనిమ్ము. బుద్ధిమంతులు రానిదాని కెదురుచూడరు. పోయినదా
నికి వగవరు.విపత్తువచ్చినప్పుడు వితాకుపడరు. కాఁబట్టి మిత్రుఁడా!
సదా నీ వుత్సాహముతో నుండుము. శాస్త్రములు చదివియు
మూర్ఖులయియున్నారు. పురుషుఁ డెవ్వఁడు క్రియావంతుఁడు,
వాఁడు విద్వాంసుఁడు.రోగులకౌషధము పేరుచెప్పినమాత్రమున
రోగశాంతి గాఁబోదు. వివేకహీనునికి శాస్త్రజ్ఞానము గ్రుడ్డి
వానికి స్వహస్తదీపమువలె నిష్ఫలము చూడుము విపత్తు వచ్చి
నప్పుడు నాకు ఖేదములేదు. సంపదవచ్చినప్పుడు మోదములేదు.
దేహి కాపత్సంపదలు పర్యాయమున రాకడ సహజము. అర్థ
ములు నిత్యములుగావనియెడు నెఱుకగలవాఁడు తన్నాశమునకు
వగవఁడు. అర్థము లేకున్న ధీరునకు లోకమందు మాన్యత
కొఱఁతపడదు. పుష్కలముగా ధనము కలిగియున్నను క్షుద్రు
నకు గారవము రాఁబోదు. సింహమునకుఁ గలిగిన నైసర్గిక
తేజము శ్వానమునకు నూఱుబంగారుసొమ్ములు పెట్టినరాదు.
నీవు బుద్ధిమంతుఁడవు. నీగారవమున కిప్పుడు హాని యేమి?
ఏలాగుననైనఁ బుట్టించినవాఁడాహారము కల్పింపకపోఁడు.చూడు
జంతువుగర్భమునుండి నేలజాఱఁగానే తల్లి ఱొమ్ముచేఁపుచున్నది.
కాఁబట్టి జీవనార్థము మిక్కిలి యాయాసంపాటుసయితము
వ్యర్థము. నీవు సకలధర్మములు తెలిసినవాఁడవు. నీకు విస్తరించి
చెప్పఁ బనిలేదు. నీకు లఘుపతనకుఁ డొకఁడు నే నొకఁడను
గాము. మనలను మూవురను దైవ మొక్కచోటఁ జేర్చెను.

దొరకినంతటితోఁ గాలము గడపుకొని సుఖముగా జీవింతము. అనిన హిరణ్యకుఁడు మిక్కిలి సంతోషించి యిట్లనియె.

మంథరా! నీవచనామృతము వర్షించి నాదురంతతాపము నివారించితివి. నేను ధన్యుఁడ నయితిని. "మిత్రలాభ మనులాభ సంపద" యనువచనము నేఁడు నాకు లక్ష్యసమన్విత మయ్యెను.

ఎవ్వఁడు హంసములను శుకములను మయూరములను శుక్ల హరితచిత్రములఁ గావించె నాయీశ్వరుఁడాయాయిజంతువులకుఁ దత్తదనురూపమయినవృత్తిని గల్పించువాఁడు. మూఢు లీయర్థ మెఱుఁగక వృత్తికయి పడరానిపాట్లుపడి కాలము వ్యర్థముగాఁ బోఁగొట్టుచున్నారు. విత్తము గడనయం దొకదుఃఖము కాఁపు దలయం దొకదుఃఖము వినాశమం దొకదుఃఖము పుట్టించు చున్నది. ఇట్లు దుఃఖైకమూలమయిన విత్తమేల? కాల్పనా? ధర్మార్థము ధనము గోరుటకంటె నిస్పృహత్వము మంచిది "అడుసు త్రొక్కనేల కాలు గడుగనేల" ఆకాశమునందుఁ బక్షులచేత భూమియందు వ్యాళములచేత జలములయందు మీలచేత మాంసము భక్షింపఁబడినట్లు సర్వత్ర విత్తవంతుఁడు భక్షింపఁబడియెడును. కాఁబట్టి ధనతృష్ణ మానికోలు వివేక కార్యము. తృష్ణ యొకటి మానెనేని యావల దరిద్రుఁ డెవఁడు? ధనికుఁ డెవఁడు? దాని కెవ్వఁ డెడమిచ్చును? వానిమూర్ధమే దాస్యమునకు సింహాసనము. నీసన్నికర్షప్రభావముచేత నాయజ్ఞానము సర్వము నివర్తించినది కృతార్థుఁడ నయితిని. నిరంతర ముగా నీతోడిసంగతికంటె నాకు లాభ మొకటి లేదు. నీతోడి ప్రణయమున కొక్కకొఱఁతయు రాఁబోదు. ప్రణయము లామరణాంతములు, కోపములు తత్క్షణభంగురములు, త్యాగ

ములు నిశ్శంకములు నగుట మహాత్ములకు సహజము. అని పలికిన మంథరుఁడాపలుకులు విని మిగుల సంతోషించి హిరణ్యక లఘుపతనకులుం దానును యథేచ్ఛవిహారాదులఁ గాలక్షేపము చేయుచు సుఖముగా నుండెను.

తరువాత నొకనాఁడు మంథరాదులుమూవురు సల్లాపములు సలుపుచుఁ బ్రొద్దుపుచ్చుచుండఁగా నొకమృగము మృగయునిచేఁ దఱుమఁబడి బెదరి మహావేగముతో నక్కడికిఁ బాఱివచ్చెను. అది చూచి భయపడి కూర్మము జలములోఁ బ్రవేశించెను. మూషికములాఁగఁజొచ్చెను. వాయసమెగిరివృక్షాగ్రమెక్కెను. అనంతరము వ్రాని మీఁదనుండి కాకము నిక్కి నలుదిక్కులు చూచి చూపుమేర దూరములో భయహేతు వేదియు లేమి నిశ్చయించుకొని మంథరహిరణ్యకులను బిలిచి మీరు వెఱవ కుఁడు చుట్టుపట్టు మిక్కిలిదూరము చూచితిని. భయమునకు నిమిత్తమేదియు నాకంటఁ బడలేదు. అని చెప్పఁగానే కచ్ఛప మూషికములు జలబిలములు వెడలివచ్చెను. లఘుపతనకమును వానిచేరువ వ్రాలెను. అంత మంథరుఁడు భయపడి వడవడ వడంకుచున్న జింకను జూచి నీ వెవ్వఁడవు? నీ వేలపాఱివచ్చితి వని యడిగిన మృగము పక్కలెగయ రొఁజుచు నిట్లనియె. 'నా పేరు చిత్రాంగుఁడు. నన్ను వేఁటకాఁ డొకఁడు తఱుముకొనివచ్చెను. వానికి భయపడి పాఱివచ్చితిని. వాఁడు నాపరుగు పట్టఁజాలక వెనుకఁ జిక్కినాఁడు. మీకు నేను శరణాగతుఁడను. సర్వదాన ములు సర్వవ్రతములు సర్వయాగములు శరణాగతరక్షణముతో సరికావు. శరణాగతు నుపేక్షించుకంటె దురితము లేదని ధర్మజ్ఞులు చెప్పుదురు. మీరు సకలధర్మవేత్త లని బుద్ధిమంతులు

చెప్పఁగా వినియున్న వాఁడను. మనసు కలఁతపడియుండుటవలన నిది చెప్పఁదగినమాట యిది చెప్పఁగూడనిమాట యని యెఱుఁగక యేమో చెప్పినాఁడను. మీకు ధర్మములు చెప్పెడుపాటి వాఁడను గాను. నావాగ్దోషము క్షమియించి నన్ను రక్షింపుఁడు. మీతో మైత్రిసంపాదించుకొని యిక్కడవసించి కాలము గడప వలెనని నాకోరిక. మా బంధువులను మాదేశమును విడిచివచ్చితిని. మీమఱుఁగు చొచ్చితిని. మీఁద నన్నుఁ బాలముంచెదరో నీటముంచెదరో మీభారము' అనిన విని మంథరుఁ డిట్లనియె. 'చిత్రాంగా! నీవు బుద్ధిమంతుఁడవు; సాధువవు. నీతోడి సఖ్య మవశ్యము మా కపేక్షణీయము. దీనికింతదూరము చెప్పఁబనిలేదు. ఈతావు నీయిల్లుగా నెంచుకొని మాతోఁగూడి యథేచ్ఛముగా వర్తించుచు సుఖముగానుండుము' అని చెప్పఁగా మృగము మిగుల సంతోషించి యావనమందు లేబచ్చిక జొంపములు మేయుచు మడుగులోని నీరు త్రావుచుఁ జేరువ నున్నాని నీడలోఁ బండుకొనుచు నిట్టు చిరకాలము సుఖముగా వసించెను.

అంతట నొకనాఁడు మృగము మేఁతకుఁబోయి తొల్లిటివలె వేళకు వచ్చి త్రావుచేరమికి మిక్కిలి చింతపడి మంథరుఁడు లఘుపతనకహిరణ్యకులతో నిట్లనియె. 'మనచెలికాఁడు చిత్రాంగుఁ డింత మసలుటకు నిమిత్తమేమి? ఎన్నఁడుగాని యింతదడవు రాక నిలిచినవాఁడు కాఁడు. అక్కడక్కడ మేఁతకుఁబోయిన శకుంత సంతానములు కొఱఁకులుమాని యిరవులకు రాఁదొడఁగె. ప్రేలుఁ దమతమపసుల కడుపులను ద్రోలుకొని పల్లియలకుఁ బోవుచున్నవారు. సూర్యుఁడు ప్రతీచీముఖమునందు సిందూర తిలకము నందము వహించుచున్నవాఁడు. తరణికిరణవారము

చల్లారఁ జల్లార నా కారాటము పెల్లుమీఱుచున్నది. కొంత దూరముపోయి వెదకివచ్చెదనంటినా నాకు గమనవేగము లేదు. మిమ్ముఁ బంచితినా మీఁదుమిక్కిలి మీరు మరలివచ్చి నాకంటఁ బడునందాఁక నాచిత్తము తత్తఱపడుచుండును. నేనేమిచేయుదు' నని కన్నీరునించి దిక్కులుచూచు చూరకుండ లఘుపతనకుఁ డిట్లనియె. 'నాకు నెల్లపక్షులకంటె జవాతిశయముగలదు. బహు యోజనము లయినను క్షణమాత్రములోఁ గ్రుమ్మరి మరలి రానోపుదు. దానఁబట్టియేకదా లఘుపతనకుఁ డని యన్వర్థసంజ్ఞఁ బడసియున్నాఁడను. నీవు కొందలపడకుము. నే నిక్కడ నున్నట్టె యెంచుకొనుము. ఇదిగో నిమిషమాత్రాన వెదకివచ్చి చిత్రాంగునివృత్తాంతము చెప్పెద' నని పలికి యాక్షణమె యెగిరి పోయి యాయరణ్యము నానాప్రదేశములు వెదకి యొక్కచో నురులలోఁ జిక్కువడియున్న చిత్రాంగునిఁ జూచి కన్నుల నీరు పెట్టుకొని చేరఁబోయి 'చెలికాఁడా! నీవు పరులసొమ్మున కాశపడవు. పరులను బాధింపఁబోవు. అడవిలోని గడ్డి మేసి పడియనీరు త్రాగి యొకచెట్టునీడలోఁ బడియుండి ప్రొద్దుఁబుత్తువు. నీ వొక్కకీడుఁ జేత యెఱుఁగవు. నీవంటిసాధువునకా యిట్టియాపద రావలె! ఇంతదూరము చింతింపనేల? ఎంతవారికిఁగాని దైవ మలంఘ్యము. ప్రాప్తించిన వ్యసనమునకుఁ బ్రతీకారము విచారింపవలెఁగాని చిప్పపడియుండఁదగదు. కాఁబట్టియిప్పుడు కర్తవ్యము నీకుఁ దోఁచినది శీఘ్రముగాఁ జెప్పుము. మంథర హిరణ్యకులు నామార్గము చూచుచుండుదురు. పోవలెను.' అనినఁ జిత్రాంగుఁడు విని 'వేఁటకాఁడు రాకముందు హెచ్చరికపడి సదుపాయము చేసితిరా నన్నుఁ దప్పింపవచ్చును. లేదా నాయాశ నేఁటితో

మూసుండు. ఇప్పుడు పోయి వేగిరము హిరణ్యకునిఁ దోడుకొని రమ్ము. అతఁడువచ్చెనా నాకట్లు తెగఁగొఱికినన్ను రక్షింపఁజాలును.' అని చెప్పఁగానే లఘుపతనకుఁడు మనోవేగముతో నెగిరిపోయి యీవృత్తాంతము మంథర హిరణ్యకులతోఁ జెప్పి హిరణ్యకుని వంకచూచి మనము కడుశీఘ్రముగాఁబోవలెను. నీవు నావేగము ననుసరించి రాఁజాలవు. ఇంతలో నేమికీడుమూడునో తెలియదు. నావీపెక్కుము. నిమిషములోఁ గొనిపోయి విడిచెద' నని చెప్పి యొడంబఱిచి హిరణ్యకునిఁ దన వీఁపుమీఁద నెక్కించుకొని ఱెంగుమను ఱెక్కలత్రోతతో బాణమువలెఁబోయి చిత్రాంగునిచాపున వ్రాలెను. అంతట హిరణ్యకుఁడు చిత్రాంగునిబంధములు త్రెగఁగొఱికి 'చెలికాఁడా! నీవు బుద్ధిమంతుఁడవు వీయురులలో నెట్లు చిక్కితి'వని యడిగెను. లఘుపతనకుఁ డడివాని యిట్లనియె. 'మన మిక్కడ నిలువరాదు. ముందు ముచ్చటలాడుకొన వచ్చును. లే లెం'డనిపలికి పయనముచేసి తాను వారికిమీఁద దాపుగా గగనమార్గమందు వచ్చుచుండెను. అప్పుడు చిత్రాంగుఁడు హిరణ్యకున కిట్లనియె. 'ఎట్టిబుద్ధిమంతునకుఁగాని యెట్టి బుద్ధిహీనునకుఁగాని దుఃఖమో సుఖమో యేకాలమం దేది యనుభవింపవలెనో యది యనుభవింపకతీఱదు. ప్రాణులకు సుఖదుఃఖములు సహజములు. నాపూర్వకర్మ మెట్టిదో పలుమాఱెట్టి యాపదలకే పాలయితిని.

ఆఱునెలలప్రాయమప్పుడు నేనుమాజాతిమృగములతోఁగూడి సంచరించుచుండఁగా నొకనాఁడు వేఁటకాఁడు వచ్చి యురులు పన్ని మంచిపచ్చికఁ దెచ్చి మచ్చుపెట్టి కొంతదూరానఁ బొదమాటునఁ గూర్చుండి చూచుచుండెను. అంతట నేను బాల్య

చాపలముచేతఁ బదువువిడిచి ముందు వేరెము వాఱుచుఁ జివుకు చివుక్కున జవుకళించి దాఁటుచుఁ జని మచ్చుఁజూచి మేయఁ బోయి యురులలోఁ దగులుకొని భయపడి కూఁతఁబెట్టితిని. అంతట మాపదువుమృగములన్ని తలలెత్తి చెవులుజెక్కించినిక్కి చూచి బెదరి చట్రాతిమీఁదఁగొట్టిన కుండ పెంచికలవలెఁ జెదరి నలువలఁకులకుఁ బాఱిపోయెను. అనంతరము వేఁటకాఁడు పొద మాటు విడిచి నాదాపునకువచ్చెను. నేను మృగమను. శిశువను. మాపదువుఁ బాసితిని. బంధములోఁ జిక్కుకొంటిని. దాపున యమునివలె వేఁటకానిఁ జూచితిని. ఇంక నేమిచెప్పవలె? నా ప్రాణము ముక్కాలుమ్మువ్వీసముపోయినవసు, పిమ్మట వాఁడు నాయొద్దఁ గూర్చుండి యొకదారము నా మెడకుఁగట్టి పట్టుకొని నాకు నోవకుండ నురి విడిపించెను. కొంతాయు వున్నది. కాఁబట్టి నన్నుఁ జంపఁగడఁగినవాఁడు కాఁడు. తరువాత నన్ను వాఁ డటు కడఁ బెట్టుకొనిపోయి యాదేశ మేలుచున్న రాజుకొమారునికి నూడిదిగా నిచ్చెను. ఆరాచకొమారుఁడు తమసాహిణమునకు నెదురుఁగొట్టములోఁ గట్టఁబంచి నా కాహారదానాదికృత్యములు తటితప్పక జరుపుట కచ్చటిసేవకులకుఁ గట్టడచేసి నాయందు ముద్దుచేత నానాఁడు నన్ను విచారించుకొనుచుండెను. అంత దినక్రమమున బెదరువిడిచి మనుష్యులతో మచ్చికపడితిని. కాఁబట్టి కాఁచువాండ్రు నన్ను రాచకొమారుని యనుమతిని గట్టువదల్చి తిరుగవిడిచిరి. నేను మెడబంగారు జంగెలుగజ్జెలు. మ్రోఁగఁగా విచ్చలవిడిగా మనస్సువచ్చినచోట్లఁ దిరిగి తోఁపు లందు దొడ్లయందు లేఁబచ్చిక మేసి కొలఁకునీరుత్రాగి చల్లఁ మ్రానినీడఁ గొంతవడి నెమరువెట్టుచుఁ బండుకొనియుండి

సాయంకాలమునకుఁ గట్టుఁబట్టునకు వచ్చి చేరుచుండుదును. ఒక్కనాఁ డాపట్టణమువీథిని సంచరించుచుండఁగా బాలకులు గుంపుగూడి కోయని కూఁకలువెట్టుచు నన్ను వెంబడించి తఱమిరి. నేను బెదరి చవుకళించి దాఁటుచుఁ బాఱి సమీపమందున్న ప్రమదవనముచొచ్చితిని. చొరఁగానే యక్కడిరాజాంతఃపురకాంతలు నన్నుఁబట్టుకొనిపోయి యంతిపురములో రాచకొమారుని శయనగృహమునకు దాపుగా నొకకంబమునకుఁ గట్టిపెట్టిరి. నాఁటిరాత్రిఁ గన్నులు మిఱుమిట్లుగొలుపు మెఱుములతో శ్రవణకుహరములు విదారించునుఱుములతోఁ గడవలతో ముంచి వంచినట్లు నిరంతరధారమై మిన్నుమన్నేకమయినట్లు కారుగ్రమ్మి యొకవర్షముగురిసెను. అప్పు డావర్షముఁజూచి మిక్కిలి కుతూహలపడి మనుష్యభాషతో నాలో నేను మీఁద వానచినుకులు పడఁగ మెల్లనిచల్లనిగాలి పొలయఁగా మాపదుపుతోఁగూడి చవుకళించి దాఁటుచు ధావాళించుచు సద్యోజాతమయిన కదంబముకుళజాతము మేయుచు నిచ్చలవిడిగా సంచరించుభాగ్యము వెండియు నాకెన్నఁడుగలుగునో యనుకొంటిని. అప్పుడు రాచకొమారుఁ డాచమనము సేయను వసారలో వచ్చుచు నామాటలు విని దిక్కులు చూచి వెంబడివచ్చు లంపటవానిఁ జూచి యిక్కడ నింతవా రెవ్వరు లేరు. ఇప్పటి మాటలు నీవును వింటివిగదా! ఇది యేమివింత? ఈజింకపిల్ల యొక్కటియే యీలోఁగిట నున్నది. ఇది యీలాగున మాటలాడియుండు నని తోఁచుచున్నది. నీ కేమి తోఁచుచున్న దనిన వాఁడిట్లనియె పలినవారికిఁ దోఁచినది తప్పదు. మనపిన్నమ్మాటలచేఁ దెలియఁబడినకోరిక మానసికిఁ బుట్టనేరదు. అనిన రాచ

కుమారుఁడు విని యానాఁడు లెస్సగా నూహించితి వని పలికి యాచమించిపోయి శయనించి వఱువాత లేచి కొలువుఁగూట మునకు వచ్చి కూర్చుండి జ్యోతిశ్శాస్త్రపారంగతుని నొక్క బ్రాహ్మణుని రావించి జరిగినవృత్తాంతము వినిపించెను. అతఁ డది విని మృగము మానుషభాష భాషించుట మిక్కిలి యనిష్ట సూచకము. దీనికి జపహోమాదులు చేయింపుఁడు. ఇప్పు డా మృగమును ముందుగా దూరపుటడవిలో విడువఁ బంపుఁడు. ఇట్టి మృగమును నిండినయింటిలో నిమిషమయిన నిలుపరాదు. అన విని రాచకుమారుం డంతఃపురమందుండి నన్నుఁ దెప్పించి యీమృగమును దూరపుటడవిలో విడిచిరం డని సేవకుల కాజ్ఞా పించెను; వారు నట్లు చేసిరి. అవ్వల వనములో నక్కడక్కడఁ దిరుగుచుండఁగా వేఁటకాఁడు తఱుముకొనివచ్చెను. నేను భయ పడి పాఱివచ్చి మీామఱుఁగుచొచ్చి యప్పటిముప్పు తప్పించు కొంటిని. నేఁ డిక్కడఁ దగులుకొని నీ యనుగ్రహమువలన బ్రదుకు గంటిని. ఇప్పటికిఁ గడతేఱితి మనరాదు. మీాఁద నేమి రానున్నదో యెఱుఁగుదుమా? నీ వెంతటిబుద్ధిశాలివి? నీ వృత్తాంతము మంథరలఘుపతనకులవలన విన్నవాఁడను. నీవు పడ్డ యిడుమలు చెప్పితీఱునా? వేయిమాటలేల? విను. విధిత్రిప్పులకు లోఁబడనిజంతు వొకటి లోకమందుండదు. అనిచెప్పి మంథరుఁడు మనరాక వేచియుండును. మనలఁ జూచునందాఁక నాతనికిఁబ్రాణ ములు కుదుటఁబడవు. అని ముచ్చటలాడుచు వచ్చుచుండఁగా నింతలోపల నక్కడ మంథరుఁడు లఘుపతనక హిరణ్యకులు వోయినదిక్కు చూచుచుఁ బోయినవా రేల యింతతడసిరి? పోయినపని నిరంతరాయముగా సాగెనేఁ దడ వేలపట్టును? కట

కటా! యెట్టిపాపపుమాట వినఁబడునో కదా! ఏమి చేయుదును? అని తలపోయు చక్కడ నిలువఁజాలక వెడలివచ్చువాఁడు మార్గమందు హిరణ్యకాదులను జూచి 'యయ్యలార! వచ్చితిరా! నాకడుపునఁ బాలువోసితిరి. శీఘ్రముగాఁ బోయి స్థానము చేరుఁడి' యని పలికి తానును వారివెంబడి వచ్చుచుండెను. అంత హిరణ్యకుఁడు మంథరునితో నిట్లనియె. 'నిమిష మెచ్చు తక్కువగా రాక మానము. దీనిలో నేమి మునిఁగిపోవునది? ఇట్టి సాహసము చేయరాదు. ఏదిగాని యిక్కడ నొక్క యిక్కట్టు వచ్చెనా మేము తప్పించుకోనేర్తుము. జలములయందువలె నీకు మెట్టలో గమనవేగము లేదు. కాఁబట్టి యిప్పు డిక్కడికి నీరాక శుభోదర్కముగా నాకుఁ దోఁచుటలేదు.' అనిన మంథరుఁ డిట్లనియె. 'మీ రింత తాలస్యము చేసితిరి. మీలోపల నొక్కఁడైనను ముందువచ్చి జరిగినవృత్తాంతము చెప్పవచ్చును గదా! అదియును లేకపోయెను. మీరుమిక్కిలిగాఁ బోయినవా రేమి కీడునకుఁ బాలయిరో యేమయిరో కదా యని మనసు మఱిమఱి తత్తఱింపఁ దొడఁగెను. నీవు చెప్పుమా! ఎట్లు నిలువ మనసు వచ్చును? మిమ్ముఁ జూచినవెనుకఁగా నాగుండె కుదుటపడెను.' అని సల్లాపములు సలుపుచుండఁగా మృగయుఁ డురు లొడ్డినచోటికి వచ్చి మృగ ముచ్చు త్రెంచుకొని యుఱికిన దని యెఱిఁగి యాశ్చర్యపడి పిల్లెక్కువెట్టి చేతఁబట్టుకొని యడుగులజాడ చూచుచు మృగము పోయినదారినే వచ్చుచుండఁగా లఘుపతనకుఁడు చూచి 'యోహో! మాటలపరాకున మీరు మెల్లనడక నడచుచున్నవారు. వేఁటకాఁడిదె వెంబడించి పొంచికొని వచ్చుచున్నవాఁడు. మాటల కెడ లేదు. సత్వరముగా నూడనిఁబాఱుఁ

డనిన విని హిరణ్యకుఁ డొక్కలాఁగ దూఱెను. చిత్రాంగుఁడు పాఱిపోయెను. మంథరుఁడు నిసర్గమునకు భయము తోడ్పడ నడవఁ గాళ్లురాక మెల్లగాఁ బోవుచుండెను. అంత మృగయుఁడు తన్నుఁజూచి మృగము పాఱిపోకకు ఖేదపడి యచ్చోటఁ గచ్ఛపమునుజూచి కొంత సంతోషించి డాయఁబోయి పట్టుకొని గునయమునఁ గట్టుకొని మూఁపుమీఁదఁ బెట్టుకొని పోవుచుండెను. అప్పుడు చిత్రాంగాదులు మూవురును గూడుకొని మంథరునకు వచ్చిన వ్యసనమునకుఁ గన్నీరు విడుచుచుఁ గొంతదూరాన వేఁటకాని వెనుకనే పోవుచుండిరి. హిరణ్యకుఁడు చిత్రాంగలఘుపతనకులను జూచి 'ప్రాప్తించిన దుఃఖము నిస్తరించితిమిగదా యని క్షణమునకు ముందు సంతోషపడితిమి. ఇంతలోనే యీదుఃఖము ప్రాప్తించెను. ప్రాప్తించిన దుఃఖమునకు విషాదపడరాదు. వేఁటకాఁ డడవిదాఁటి పోకమునుపే మంథరుని విడిపింప ననువయిన యుపాయము వెదకవలెను. మించిపోయిన వెనుక మన కభిమతము సాధించుట దుష్కరము.' అనిన విని చిత్రాంగలఘుపతనకు లిట్లనిరి. 'మేము నిప్పులఁ బొరలిన ట్లైయుచున్నది. చిత్తము స్వాయత్తముగాదు. కర్తవ్య మిట్టిదని మాకుఁ దోఁచినదిగాదు. నీవు బుద్ధిశాలివి. నీకుఁ దోఁపని యుపాయము లేదు. చెలికానిని విపత్సముద్రముదరిచేర్చి శోకసముద్రముదరిఁ దరివలె మమ్ముఁ జేర్పుము. నీవుదక్క మా కన్యము శరణము లేదు. కర్తవ్యమును మాకుపదేశింపుము. నీపంపు శిరసావహించి చేసెదము.' అనిన హిరణ్యకుఁ డిట్లనియె. మనలోపల నొక్కరికి వచ్చిన మేలుగీళ్లకు మనమందరము పాలివారము. కాఁబట్టి యిప్పుడు ప్రాప్తించిన వ్యసనమునకుఁ బ్రతీకారగవేషణము

మీకుఁబోలె నాకు నావశ్యక మయియుండఁగా మీరు నన్నింత వేఁడుకోనేల ? ఏదో నాకుఁ దోఁచినయుపాయము చెప్పెదను. మీరు మీబుద్ధిచేత విచారింపుఁడు. సర్వసమ్మతమయినపక్ష మవలంబింతము. అని చెప్పి చిత్రాంగునిఁ జూచి 'నీవు వేఁటకాని కంటఁ బడకుండ ముందుపోయి వాఁడువచ్చుమార్గములో నొక జలాశయము తీరమం దొదికిలి నాలుగుకాళ్లు చాఁచుకొని మ్రాఁగన్ను వెట్టి మెడయెత్తి మోరసారించి చచ్చినట్లు మెదలక పండుకొనియుండుము. లఘుపతనకుఁడు నీమీఁదఁ గూర్చుండి కన్నులు పొడుచుకొని తినువానివలె నభినయించుచు నఱచుచు నుండువాఁడు. అంత వేఁటకాఁడు మృగము చచ్చిపడియున్న దని భావించి మంథరునితోడ విల్లుదించి నేలఁబెట్టి చేరువకు వచ్చును. నేను వానివెంటనే వచ్చి మంథరునిబంధము చిటుకనకుండఁ దెగఁగొఱికెదను. అంతట మంథరుఁడు జలాశయము ప్రవేశించు వాఁడు. నేను బొఱియఁ దూఱెదను మీరు పాఱిపొండి. ఇది నాకుఁ దోఁచిన యుపాయము'. అనిన విని చిత్రాంగ లఘుపతన కులు హిరణ్యకుని బుద్ధికి మిగుల సంతోషించి తదుక్తప్రకార మునఁ గార్యము నిర్వర్తింప హిరణ్యకుఁడు వనపాలికార్యము నెఱవేర్చి మనోరథసిద్ధిఁ బడసెను. అప్పుడు మృగయుఁడు మిగుల వగంబొంది యిల్లిల్లఁ దనమునికిపట్టునకుఁ జనియె. హిరణ్య కాదులు తమయిరవునకుఁ జని తొంటియట్లు సుఖముండిరి.

మిత్రలాభము

సంపూర్ణము.

---

# మిత్రభేదము

అనంతరము రాజపుత్త్రులు విష్ణుశర్మతో నిట్లనిరి. స్వామీ! మీయనుగ్రహమువలన మిత్రలాభము వింటిమి. ఇంక మిత్రభేదము వినఁగోరెదము.అనిన విష్ణుశర్మయిట్లు చెప్పఁదొడఁగెను.

ఒకవనములో సింహావృషభములు మిక్కిలి చెలిమిగలిగి యుండెను. ఒకమాయావి యయినగోమాయువు వానికి విద్వేషము పుట్టించి సింహముచేత వృషభమును జంపించెను. ఆకథ మీకు సవిస్తరముగా వినిపించెదను సావధానముగా వినుండి.

దక్షిణాపథమందు రత్నావతి యనుపట్టణము గలదు. అందు వర్ధమానుఁ డనుసార్థవాహుఁడు వాసము చేయుచుండెను. అతఁడు తనకంటె సంపన్నులయిన తనబంధువులను జూచి వారి కంటె మిక్కిలిగా ధనము సంపాదింపవలె నని యెంచి యిట్లు చింతించెను.

అర్థము పురుషార్థములలోపల నుత్తమము. అర్థవంతున కసాధ్యము లోకమం దేదియుఁ గానము. కాఁబట్టి పురుషుఁడు న్యాయము తప్పక యే యుపాయముచేతనయినను ద్రవ్యము సంపాదింపవలెను. ఇంత సంపాదించితి నింకేల యని తనియరాదు. బుద్ధిమంతుఁడు జరామరణములు లేనివానివలె విద్యాధనములఁ గడియింపవలె నని పెద్దలు చెప్పుదురు. ధనార్జనమునకు సాధనములు పెక్కులు గలవు. వానిలోపల వాణిజ్యము సర్వప్రకారములచే మేలయి కానఁబడుచున్నది. అని విచారించి పరదేశము నకు వలసిన తనదేశమందలి మేలుసరకులు సేకరించుకొని పెక్కు సరకులు బండ్లమీఁద గుఱ్ఱములమీఁద వేసడములమీఁద

నెత్తించి కొన్నిటికి భారవాహములను నియమించి మంచికంచర
మొకటి సిద్ధముచేసికొని దానిని సంజీవక నందకము లనునెద్దులను
బూన్చి యొక్క సముచితపరివారముతో నుత్తరదేశమునకుఁ
బయనమాయెను. ఇట్లు బయలువెడలి కొంతదూరము గడచి
సుదుర్గమను పర్వతముచేరువ కాంతారమందుఁ బోవుచుండఁగా
సంజీవకము కంచరమును లాగఁజాలక లాగుచు జాఱిమోఁకాలు
విఱుగ నేలఁబడియె. అంత నావర్తకుఁడు కంచరము దిగి శీఘ్ర
ముగా సంజీవకము మెడకాఁడికట్టు వదలించి రెండవయెద్దును
విడువఁబంచి యిట్లు చింతించెను. ఈ పాటిది నా సంచారపు టెద్దు
లలో నొకటిగాని లేదు. ఇది మంచియెద్దు. ఇక్కడ నిలిచి దీనికి
చికిత్స చేయించుకొని పోదమంటినా యిది మహారణ్యమధ్యము.
నిలువఁ జోటుగాదు. దీని కీయడవిపాలు కానిచ్చినగతి మనస్సున
కాఁబోలును. ఎట్టిపౌరుషముగాని దైవగతి విపరీతమగుచున్నప్పుడు
పనికిరాదు. కీడో మేలో యేకాలమం దేది రానున్నదో యది
రాకమానదు. కాఁబట్టి యొకయిబ్బంది వచ్చినప్పుడు వెనుకఁబడఁ
గాదు. వెనుకఁబడితిమిపో దానిచేత సాధ్యమేమి? అని చింతించి
తనసరకుబండ్లు కావళ్లు మొదలయినవి దాఁటిసాగిపోనిచ్చి తన
కొంతపరివారమును కంచరమునకు బలికరముంచి యక్కడికి
సమీపమందు ధర్మపురమను గ్రామమునకుఁ బోయి పోతరించి
లావుగలిగిన యొక యెద్దును విలిచి తెచ్చి కంచరమునకుఁ
గట్టించుకొని సాగిపోయెను.

తరువాత నాకాటియందు సంజీవకము భాగ్యము మంచిది
కాఁబట్టి ప్రాణసత్త్వముల బారికిఁ దప్పి విఱిగినమోఁకాళ్లు
చక్కఁబడి లేచి నడయాడసాగెను. "ఆయువు గట్టిగా నుండెనా,

మహామృత్యుప్రవాహంబొచ్చియయిన మరలిరావచ్చును. కాలము సమీపించెనా, కోటివేల్పులయిన మరణము మానుపఁజాలరు.” పిమ్మట నావృషభము వనములో విచ్చలవిడిగాఁ దిరుగుచు నానాఁడు మంచిపచ్చికమేఁత కడుపారదొరకఁబట్టి లెస్సగా బలిసి యొకనాఁడు పర్వతగుహలు మాఱుమ్రోఁగ గణిల్లని ఱంకె వేసెను.

ఆకాననమందుఁ బింగళకమనుసింహము గలదు. అది పుండరీకముల ఖండించుచు సలుగుల నలుగులంపడఁ జేయుచుఁ గాసరముల మీసరము గాసించుచు ఋక్షముల శిక్షించుచుఁ దక్కిన ముక్కడిమృగముల లెక్కింపక యిచ్చకువచ్చినట్టు విహరించుచు నాఁడు డప్పివడి పిపాసితమై యమునాకచ్ఛమునకుం బోయి ప్రలయసమయపర్జన్యగర్జానుకారి యయినసంజీవకము భీషణఘోషణము విని వెఱఁగుచే రాపడి నిలుచుండెను. ఆయరణ్యమందుఁ గరటకదమనకము లను జంబుకములు గలవు. కరటకుఁడు దమనకునితో ముచ్చటలాడుచుండి సంజీవకము రావము విని యదరిపడి గుండెలు తటతటఁ గొట్టుకొనఁ గొంతవడికి సంబళించుకొని యావలనికిఁ గ్రేగంటిచూపు నిగిడించి చెవి నిక్కించి యాలించి యిట్లనియె. ‘మఱి సద్దుగానము. నీవును వింటివిగదా? ఇదియేమి? ఇంతకాలమాయెను. ఈయరణ్యములో నున్నారము. ఇట్టిబెట్టిదపుఁగూఁత యెన్నఁడుగాని విన్నది లేదు.’ అనిన దమనకుం డిట్లనియె. ‘ఔనౌను మునుపు విన్నది గాదు. ఈశబ్దము మహాశ్చర్యము. అదిగో చూడు మనరాజు పింగళకుఁడు యమునాకచ్ఛమునకుఁ బోవువాఁడు రాపడి నిలుచున్నాఁడు. ఆధ్వని విని కాఁబోలు.’ అని చిఱునవ్వు నవ్వి

'యంతవాఁ డట్లాయెను మనమనఁగా నెంతవారము?' అనినఁ గరటకుం డిట్లనియె. 'ఇట్టి బెట్టిదపుటులివు గావించినజంతువు కొంచెపాటిగానుండదు. ఎక్కడనుండివచ్చి యీజంతు వీవనము చేరినది. ధ్వనిమాత్రము విన్నారము గాని యాజంతువును గానము. నిన్నమాపో నేఁడుతేపో యిక్కడి కదివచ్చి చేరియుం డును. ఇంక నేమి యిడుమపాటు రానున్నదో యెవ రెఱుఁగు దురు.' అనిన దమనకుం డిట్లనియె. 'ఈయరణ్యము మనకు మాన్య క్షేత్రమా? లాఁతిచోటికిఁ బోఁగూడదని నియమమా? మఱి యరణ్యములేదా? అభిజన మెవ్వరికిఁగాని దుస్త్యజమే. అట్లని చావున కొప్పుకోవచ్చునా? ఈవిచారమేల? ఇప్పుడు మనకు వలసవీయునంతయిడుమ యేమివచ్చినది? ఈ వఱ కాజంతువు నల్లనిదో తెల్లనిదో యెఱుఁగము. అది క్షుద్రజంతువో మహా జంతువో ముందు తెలిసికొని పిమ్మటఁ గర్తవ్యము విచారింతము. పిట్ట కొంచెము కూఁత ఘన మన్నట్టు క్షుద్రజంతువునకు సయి తము పెద్దనో రుండవచ్చును. జంతు వంత బెట్టిదము గాదనుటకు నాకు సూచన కొంతఁ గానఁబడుచున్నది. నీవును జూచుము. ఆవంక జంతువులు కలగుండుపడినలక్షణ మేదియుఁ గానరాదు గదా! మంచిది యాలకింపుము. క్షోభ మేమాత్రము పుట్టిన నలబలము వినరాకుండునా?' అనినఁ గరటకుం డిట్లనియె. 'అవు నది నిజమే కాని కడపట నది యిట్టిజంతు కూఁత యనిమాత్ర మాకళింతకు రాలేదు.' అనిచెప్పి కొంతతడ వూరకుండి చిఱు నవ్వు నవ్వి యిట్లనియె. 'ఇప్పటికి స్మరణకు వచ్చినది. మఱి యేమి గాదు విను. కొన్నాళ్లకు మునుపు వర్తకుఁ డొకఁడు దారిని బోవుచుండి యీడువఁజాలక యీడిగిలఁబడిన యొక బెక్క

యెద్దును బ్రయాణత్వరంబట్టి యీ యడవిలో విడిచిపోయి
నాఁడు. అది యీ కాటిలో గడ్డిపరకలు కొఱికి తేఱుకొని
కొంత చియ్యఁబట్టి యక్కడక్కడ నఱ్ఱాడఁగాఁ జూచితిని.
అప్పుడు మనము విన్నది దానిఱంకె. దానికి సందేహము లేదు.
ఊరక యీవఱకుఁ బనికిమాలిన పిఱికితనము దెచ్చుకొంటిమి.
మనకంటె కూరుఁడు మనరాజు.' నావుఁడు దమనకుం డిట్లనియె.
'మనము పింగళకునకు మంత్రిపుత్త్రుల మైయుండి యిప్పు
డొప్పరికింపరాదు. డాయఁబోయి యాతనిభీతి మానింతము.
ఈనెపముచేత నాతనికొలువు సంపాదించుకొని యనుగ్రహము
వడయవచ్చును. రాజానుగ్రహముఁ బొందినవానికి సర్వసంప
దలు గలుగును. మన మాతనితోంటెనిగ్రహము పాటింపరాదు.
మనకుఁ దదనుగ్రహసంపాదనము ముఖ్యముగాని తక్కిన
మోఱకుఁదన మేల?' అనినఁ గరటకుం డిట్లనియె. 'దమనకా!
వినుము. ఈతనిసంగతి నాకు సరిపడదు. మునుపు కొలువుండి
పడ్డపాట్లు చాలును. ఈతఁ డెత్తువారిచేతిబిడ్డగాని యొక తెన్నునఁ
బోవువాఁడు గాఁడు. ఇట్టివానికొలువు మిక్కిలి కష్టము. అది
యుండనిమ్ము. ఉదరపోషణముకయి పరులకు శరీర మమ్ము
కొనుట మిక్కిలి హేయము. పరాయత్తవర్తనుఁడు మృత
కల్పుఁడు. అయినను సేవకుఁడు స్వకృత్యములయందు స్వామి
చేత మన్ననం బడసెనా సేవాదుఃఖము కొంత నిస్తరించును.
ఉపేక్షితుఁ డయ్యెనా దానికంటె దుఃఖము లేదు. పరాభూతుఁ
డయ్యెనేనిఁ జెప్పవలసిన దేమి? సేవావృత్తిచే వచ్చుపాయసము
కంటె స్వచ్ఛందవృత్తిచే లభించు గంజి మేలు. కాఁబట్టి ప్రాప్త
లాభముచేఁ దృప్తిపడి సుఖ ముండుదము. ఇప్పు డాతనిభీతి

మూనుపవలసినజోలి మన కేమి గలదు? జోలిమాలినపని పయిఁ బెట్టుకొన్నవాఁడు మేకును బెఱికినకోఁతివలెఁ దప్పక ముప్పుఁ జెందును. ఆకథ చెప్పెదను. వినుము.

మగధదేశమునం దరిదుర్గ మనుపట్టణము కలదు. అందు మహావిభవసంపన్నుఁడయి శుభదత్తుఁ డనువైశ్యుఁడు గలఁడు. ఆతఁడు సంతానము లేనివాఁడు కాఁబట్టి తనధన మారామ తటాకాది ప్రతిష్ఠల వెచ్చించుచు నాపట్టణములో నొకదేవ ళము జీర్ణమైయుండఁగాఁ జూచి కారువులను రావించి తగినవేత నములు నియమించి దానిఁ గట్ట నియోగించెను. వారు దానిఁ గట్టుచుండఁగా నొకనాఁడు చేవదూలము నంపముచేఁ గోయిం చుచు నది సుకరముగా వ్రీల్చుటకు సూత్రధారుఁ డక్కడక్కడ మ్రానిమేకులు దిగఁగొట్టి మధ్యాహ్నభోజనార్థము కూలి వాండ్రును దానును బోయెను. అప్పు డాపరిసరతరువులందుఁ దిరుగుచున్నకోఁతులు దేవాలయము దాపునకు వచ్చి ప్రాకార ములు ప్రాఁకుచుఁ బ్రాంతమహీరుహములమీఁదికిఁ గుప్పించి దాఁటుచు వ్రేలుగొమ్మలు కాళ్లతోఁబట్టి తలక్రిందుగా వ్రేలుచుఁ బెనుఁగొమ్మలు కరములతోఁ బట్టి యూఁచుచు విమానముల మీఁదఁ గూర్చుండి వికృతముగా బరులు వీఁపు గీఱుకొనుచు నిక్కుచు బొమలెత్తి యుఱుగొట్టి బెదరించుచుఁ బం డ్లిగిలిం చుచు వెక్కిరించుచు నొకటి నొకటి కుఱువుమీఁదఁ బండించు కొనిమేనిపేల నేఱి నోరవేసికొనుచుఁ గిలకిలారావములు గావిం చుచు నొండొంటితోఁ బోరుచు ఫలములు భక్షించుచు మధువు లానుచు స్వాభావికచపలభావముతోఁ దిరుగుచుండెను. ఒక ముసలిమల్లు కాలచోదితమై చేవదూలము డాసి యెక్కి దాని

నెఱియలోఁ దనముష్కము ప్రేలం గూర్చుండి, యందు బిగియ గొట్టిన కొయ్యమేకును రెండుచేతులతోఁ జిక్కఁబట్టి బలిమితో నూడఁబెఱికి యానెరియలో ప్రేలుముష్కము చదియుటఁ జేసి ఱోలుచుఁ గాలధర్మము నొందెను. కాఁబట్టి జోలిమాలినపనికిఁ బోగాదు.

మన మిప్పు డాతనిభృత్యపదమందు లేము. అతనికిఁ గ్రొత్త కొలువుడుకాండ్ర నేకులున్నారు. స్వామిహితాహితముల విచారము వారిదిగాని మన కాయధికారాము లేదు. పరాధికారము పయివేసికొన్నవాఁ డొండ్ర వెట్టి మోఁదువడినగాడిదెవలె వినాశముఁ బొందును. ఆకథ చెప్పెదను సావధానముగా వినుము.

వారణాసియందు ధావకమల్లుఁ డనుచాకివాఁడు గలఁడు. ఒకనాఁడు వాఁడు మిగుల బట్టలుగుంజిన బడలికచేత మయి మఱచి గుఱువెట్టి నిద్రపోవుచుండెను. ఆనడికిరేయి వానియిల్లొకదొంగ చొచ్చెను. అప్పుడు వానియింటివాకిటఁ గాలిబందముతో గాడిద నిలుచుండెను. ఆయింటికావలికుక్క దాపునఁ గూర్చుండి చూచుచుండెను. అవి యొండొంటితో 'లోనికి దొంగ చొచ్చినాఁడు. చూచితివా?' 'చూచితిఁ జూచితి.' మఱి యేల మొఱుఁగవు?' 'నాపని విచారింప నీ కేమినిమిత్తము?' 'మన దొరయిల్లు దొద్దవోఁగా నొప్పరికింపవచ్చునా?' 'నీవే మెఱుఁగుదువు? రాత్రిందివము నిమిషమాత్రమయినఁ బ్రమాదపడక తలవాకిలి వదలక యిల్లు గాచుకొని యుండుదును. ఆవంతయయిన నావలని ప్రయోజన మెఱుఁగక యేలిక నాయందు సాకతము లేకయున్నాఁడు. కాఁబట్టి కూడు కమికెఁ డయిన

దొరకుట కలవయ్యె. పాలెటుఁగనిదొరను సేవించుటకంటె మిన్నకుంట మేలు.'

ఇట్లు ఖరశ్వానములు ప్రశ్నోత్తరములు జరుపుచుండఁగా గాడిద మిక్కిలి కోపించుకొని "యోరిదురాత్మ! వినుము. ఒక పోరామి వచ్చినప్పుడు స్వామిదోషములు దడవి యుపేక్షించి యుంట భృత్యునకు ధర్మముగాదు. అదియునుగాక స్వామిరక్షణము విచారింపక సేవకుఁడు స్వార్థపరుఁడయి స్వకృత్యమునందుఁ బ్రవర్తింపఁడేనిఁ గృతఘ్నుఁడగును. నీవు పాపిష్ఠుఁడవు. దొసఁగు పొసఁగినప్పుడు స్వామికార్య ముపేక్షించితివి. ఇంతటితో నేదియు మునిఁగిపోదు. నీపని నాచేతఁగాదా? చూడు మనయేలిక నిప్పుడు ప్రబోధించెదను" అనిచెప్పి గట్టిగా నోండ్రపెట్టెను. అంత నామడివేలు మేలుకొని నిద్రాభంగ మాయెనని మహాకోపముతో లేచి యొకబడియతో గాడిదెను మోఁదెను. ఆయమం దామోఁదు తాఁకుటఁజేసి యాగాడిదె ప్రాణమును విడిచెను. కాఁబట్టి పరాధికారము మనము పయిఁ బెట్టుకోరాదు.

అక్కడక్కడఁ బఱరముల డొక్కలు వెదకుట మనకార్యము. అదిమాని యీవిచారమేల? భక్షితావశిష్టమయినమాంసము కావలసినయంత యున్నది. రా రా భక్షింతము.

అనిన దమనకుఁ డిట్లనియె. 'ఇప్పుడు త్వరయేల? మెల్లగాఁ బోయి భక్షింతము. ఎల్లజంతువుల కాహారనిద్రాభయములు సహజధర్మములు. కుక్షింభరిత్వముచే గౌరవము రాఁబోదు. మిత్రామిత్రుల కుపకారాపకారములుచేయ వేఁడి బుద్ధిమంతులు రాజాశ్రయము గోరుదురు. స్వోదరమాత్రము భరియింప నేఁడు లేఁడు? ఏవాఁడు జీవింప ననేకులు జీవింతురు. వానిమనుగడయే

సఫలము. వాఁడొకఁడు జీవించువాఁడు. ఆమిషశూన్యమయి వసా గంధిలమైనశల్యము దొరికినమాత్రాన వేఁపి మిక్కిలి సంతోష పడునుగాని దానిచే దానియంగద గొంతయైన నడంగదు. కేసరి యాసన్నమైన మ్రుక్కడిమృగమును లెక్కింపక నిజఖరనఖర విదారితహస్తిమస్తమస్తిష్కము కోరును. ఎల్లవారు సత్త్వాను రూపమైనఫలమే వాంఛింతురు. శునకము తన కోగిరము పెట్టు వానికడఁజేరి తోఁకాడించును. నేలఁబడి నోరు కడుపు చూపును. ఇన్నిపాట్లు పడుకుక్క కొక్కముద్దవంటకముకంటె మిక్కిలి పెట్టరు. ద్విరదము కరము ధీరముగా విలోకించుచు సారె కాధోరణోపలాలితమై మెల్లగాఁ గబళముఁ గొనియెడిని. హీనుఁ డెంతదీనభావముతో వేఁడినను వాని కెవ్వరును దనియఁబెట్టరు. గారవముగలవానికి వినయవచనములతోఁ గోరికకు మీఱ నిత్తురు. అనవద్య మగువిద్యచే నవక్ర మగువిక్రమముచే నిర పాయ మైనయుపాయముచే నృపాలుర మెచ్చువడిసినవానిమను గడయే మనుగడ. శునకముసయితము కమికెఁడన్నము దినిమన లేదా? గఱువతనము మానక తనకలిమికొలఁదిని లాఁతులకు మేలొనరించువాని జీవన మొక్కనాఁటిది యయినం జాలును. స్వోదరమాత్రపూరక మగుకరటము చిరకాలము మనిన ఫల మేమి? అలఁతిజలముచే మొరపనేల వెల్లివొడిచినట్లు కొలఁది లాభముచే క్షుద్రుసందు హర్షము వొడమును. హితాహిత వివేకములేక విహితకర్మములు మాని స్వోదరమాత్రము పూరింపఁగోరువాఁడు పశుతుల్యుఁడు. అంతియ కాదు. భార వాహియయి తృణమాత్రాశనమయి కృష్యాదికర్మముల కత్యం

తోపకారకమయి పవిత్ర జన్మమయిన వృషభము నరపశువు కంటె మేలుగాదె?'

'అనినఁ గరటకుఁ డిట్లనియె. దమనకా! మనము ప్రధానులము గాము. మన కీవిచారముతో నేమి ప్రయోజనము?' అనిన దమనకుఁ డిట్లనియె.

'ప్రధానుఁడు కావుట కెంతసేపు పట్టును? పురాకృతసుకృతము వలనఁ బ్రజ్ఞావంతుం డౌను. ప్రాజ్ఞుఁడు రాజపూజితుఁ డవును. రాజసమ్మానసచేతఁ బ్రజ్ఞ మిక్కిలి ప్రకాశించును. వానివలనఁ దంత్రావాపములు నడప సమర్థుఁడవును. ఆసామర్థ్యము చేతఁ బ్రధానత్వము బడయును. ఎట్టి ప్రజ్ఞావంతుఁడుగాని వేఁటి కాంతర్గతరత్నముంబోలెనినాలోకయోగములేక ప్రకాశింపఁడు. పురుషుఁడు సాధువర్తనుఁ డయ్యెనేని సర్వలోకపూజ్యుఁడగును. కానిచో గర్హ్యుఁ డగును. మానావమానములు ప్రవర్తనాయత్తము లయియుండును. గుణవంతుఁ డని పేరువడుట దుర్లభము. లాఁతివిధము సులభము. మహాగ్రావమును గ్రావాగ్రము నెక్కించుటం బోలెఁ గ్రిందికిఁ ద్రోచుట దుష్కరముగాదు.'

నావుడుఁ గరటకుఁ డిట్లనియె. రాజసేవవలని ప్రయోజన మెఱుఁగనివాఁడఁగాను. తొల్లి యీతనివలనఁబడ్డపాట్లు తలఁచుకొన్నమాత్రానఁ దల కంటగించుచున్నది. కాఁబట్టి యట్లు వచియించితిని. భృత్యులగుణదోషములయందు వివేకము చాలని రాజును గొలుచుట దుష్కరము. నీవు వివేకివి అన్యుల చేతఁ జెప్పించుకొనవలసిన యర్థము నీ కొకటి లేదు. ఉచితమయినట్లు చేయుము. ఇప్పుడు నీవు చేయఁబూనినకార్య మేమి?' నావుడు దమనకుఁ డిట్లనియె.

'మనరాజు పింగళకుఁడు జలపానార్థము కాళిందికిఁ బోయి యెద్దుఱంకెవిని భయపడి తీర్థావతరణము మాని వెఱఁగుపడియు న్నవాఁడు. పరహృదయము ప్రత్యక్షముగాదు కాఁబట్టి యాతని చిత్తవృత్తి నీవెట్లు తెలిసికొంటివనఁబోకు. ఈయర్థమాతనియా కారముచేతనే నా కవగత మయినది. ధీమంతునకుఁ బరులభావ ము సుగమ మై యుండును. తురంగమాతంగాదులు సహితము చెప్పినయర్థము గ్రహించి వహనాదికార్యములఁ బ్రవర్తిల్లు చున్నవి. పరేంగితావగాహి యయినబుద్ధి యొక్కటియె పండితు నకు విశేషము. అది లేనినాఁడు పండితునకుఁ బామరునికంటె విశేషమేమి? అది యటుండనిమ్ము. కర్తవ్యాంశము వినుము. నే నిప్పుడు రాజుసాలికిఁబోయి తద్భావానురూపముగా ననుసరించి వలసినమాటలాడి యీకార్యము నీవుసేయుమని యాజ్ఞాపింపఁ జేసికొని మనసున కెక్కఁ బ్రవర్తించి యాతనిమన్ననలు వడసెదను.'

అనినఁ గరటకుఁ డిట్లనియె. 'రాజులకొలువుఁగోరువారు మెలఁ కువగలిగి ప్రవర్తింపవలెను. వారిచిత్తవృత్తి యెఱిఁగి మెలఁగుట కడిఁది. అది స్వచ్ఛందవృత్తివంటిదిగాదు.' నావుడు దమనకుఁ డిట్లనియె. 'ఉద్యోగికి దూరభూమియు విద్వాంసునకుఁ బరదేశ మును బ్రియవాదికి శత్రువును లేనియట్లు మధిమంతున కసాధ్య మొకటిలేదు సద్వర్తనముగలిగి నిచ్చలు తమ్ముఁగొలుచువారిని రాజు లాదరింతురు. భృత్యుఁడు జేనికోపప్రసాదముల యంగ మచ్చము లెఱిఁగి మెలఁగెనేనిఁ దదనుగ్రహమునకుఁ బాత్రుఁ డవును.' అనవుడుఁ గరటకుఁ డిట్లనియె. 'తొలుత రాజును జూచి నుడువ దొరకొనునర్థ మేది? నావిని దమనకుఁ డిట్లనియె. ఈ

యర్థము వచియింపవలెనని నియమముగలదా ? ప్రతిభాశాలికిఁ
ప్రభువునెదుర సమయోచితముగా వచియింపవలసినది బహు
విధములుగా నుండును. సేవకుఁ డడఁకువ దోఁపఁ గట్టెదురు పట్టు
దలఁగి యేలికమొగమునన చూపు నిలిపి యాతఁడు తనవలను
జూచునెడఁ దత్కాలోచితముగఁ బౌర్వాపర్యము విచారించి
తెనిభావ మూహించి తక్కుఁగల రాజభృత్యులకు నవిరుద్ధముగ
నేరిమి మీఱఁ బలుకవలసినయర్థము పలుకవలయును.'

అనినఁ గరటకుఁడు నీకుఁ గార్యసిద్ధిఁ గావుత. అదె తేఁడును
మరలి తనయిరవునకుఁ జనుచున్నవాఁడు. అతఁ డిరవుచేరునం
తకు నీవుంబోయి దాఁగొనవచ్చుఁ బొమ్ము. నావుడు దమనకుఁడు
పింగళకునిపాలికిం బోయి అడఁకువతోడ నొదుఁగువాటున
నిలిచి భయభక్తులు పిరిగొనఁ దొట్రుపడుచు జోహారు వొన
రింప మృగేంద్రుఁ డతనిసాదరంబుగ వీక్షించి కూర్చుండ నియ
మించి 'కుశలమా! బహుకాలమునకు నిన్నుఁ జూడఁగలిగె'
నావుడు దమనకుం డిట్లనియె.

'దేవా! తావకం బగునపాంగావలోకంబునకుం బాత్రంబైన
యీవనక్షేత్రంబున జంతుసంతానంబుల కావంతయేనిఁ గొఱంత
కుశలంబునం గలుగదనం దావకసేవకు లగుమావంటివారి
కయ్యది యడుగంబనియేమి ? అవసరంబగుడు సేవకుం డనాకారి
తుండయ్యు రావలయుఁగాదె ? స్వామికిం దటి యెఱిఁగి భృ
త్యుండు హితాహితంబు లెఱిఁగింపవలయు. ఉపేక్షకుం డయినం
బ్రియవాది యయినను స్వామిద్రోహి యగు. స్వామిద్రోహికి
సర్వశ్రేయంబులు చెడును. సదసద్వివేకసంపన్నుం డయిన
ప్రభువునకు మాబోఁటి క్షుద్రులవలన నరయం దగినయర్థం

బొకటి గలదే యని విచారింపఁబనిలేదు. చతుష్కంతునకే దీపం బుగాని యంధునకుం గొఱయగునే? ఒక్కటి విన్నవించెద నవధ రింపుఁడు. బహుదేశాటనంబును బహుశ్రుతులతోడ నిరంతర సాంగత్యంబును గావ్యశాస్త్రవిచారంబును రాజాస్థానంబుల బహుకాలసేవనంబును బురుషున కెట్టివానికేని వివేకంబుపుట్టింప సమర్థంబు లయియుండు. ఈనాలుగింట నొక్కండే నెవ్వానికి లేకుండు వాఁడు కూపస్థమండూకంబుంబోలెం దనముక్కునకుం జక్కనిమీఁదిదె యాకాశంబు తనగొందియ లోకం బని యెంచి స్వజీవనమాత్రంబునకుం దుష్టివొంది లోకవృత్తంబున మూఢుం డయి నశియించును. చిరకాలం బేలినవారిపాదంబుల కొలువు సేయుచున్న మాబోంట్లు త్రొక్కుడులయ్యు విద్యావివేకసంప న్నులగుట సన్నిధానప్రభావంబుచేతంగాదె? స్వామికి క్షేమంబు గాంక్షించు భృత్యుం డప్రాప్తానుయోగుండయ్యుం దఱి యెఱింగి వలయునర్థంబు వచింపవలయును. అయినను స్వామి చిత్తంబునకు వేఱొండుగఁ దోఁచునేమోయని మనంబు తేకువం బొరసెడు' నావిని పింగళకుండు 'దమనకా! నీవు మాకు హిత భృత్యుండవు. నీవచనంబు మాకవశ్యగ్రాహ్యంబు. మేము నీకు గ్రొత్తవారమే? ఏల జంకువడియెదవు? నీయిచ్చవచ్చిన చొప్పునం జెప్పవచ్చును' నావుడు దమనకుండు కరంబున నోరు మూసి కొని యీవచనంబు లాలించి బుద్ధిబుద్ధియని, 'దేవా! యింతకుం గొంతముందు యమునాకచ్ఛంబునకుం బోయి యచ్చట జెచ్చె వడినతెఱంగు దోఁషం గొంతసేపు చిత్రరూపంబుపగిదిం జూపట్టి మనవి యిరవున కరుదెంచితిరి. ఇందులకు నిమిత్తంబుగానక చిత్తం బుత్తలంబు నొందెడు. అయ్యది చెప్పవచ్చునని దేవర

చిత్తంబునకుం దోఁచిన సేవకుండు వేచియున్నవాఁడు. నావిని పింగళకుండు 'దమనకా! విను మాకు నీవు పరమాప్తుండవు. నీకు దాఁపురము చేయునర్థము మాయం దొకటియైనఁ గలుగదు. అఖిలసత్త్వశరణ్యంబయిన యీయరణ్యంబు మదధీనంబు. ఈ దేశంబువ నా యీదేశంబునం గాక యాకయినం గదలవెఱచు వింటివా నేఁడొక్కవిపరీతంబు? పిపాసార్దితుండనయి యమునా తరంగిణి కరుగుచుండ నుఱుము తెఱంగున మొరపంబొక్కటికర్ణ గోచరంబయ్యె. ఆనినదంబు వినినచోటనె విఱాకుపడి నిలిచితిని. ఇసుమంతయయిన నంతరంగంబున భయంబునం బొరయక యిట్లు ఘోరంబయి యారావంబు గావించినజంతు వలంతిగ నుండదని చింతించెద. లోకంబున నుత్తముం డగుశూరునకుం బరప్రకర్షంబు సహ్యంబగునే? అలఁతివానినేనిం బగవాని నొప్పరికింపంజనదన లాఁతివానిఁ జెప్పనేల? ఎట్టివానికేనిం బల దర్పంబునఁ బగతు నొప్పరికించునట్టివాని కశక్తిభీరుత్వంబులు లోకు లారోపింతురు వలదని వాకొనకుండ మూఁకుట నోభులు గ్రమ్మవచ్చునే? ఇట్టిసడివడుకంటె నొడలు విడుచుట మేలు గాదె? ఊరక దొరుకంటెఁ బోర నది శ్రేయోదాయకం బయి యుండు. దైవయోగంబున మారుతుండు దొరెనేనిం గడుమే లయ్యె. కావున నిప్పుడదాయ పయినొండెఁ బోవుదము. అరాతి నిరాసంబ పరమార్థంబుగం గోరితిమేని దదుపాయాన్వేషణం బావశ్యకంబు. బలవంతుం బగతు నుపాయంబుచేతన సాధింప వలయును. కావున నిప్పటికిఁ దొలంగి చని కాలదేశోచితంబుగ వలయునుపాయంబు సముపార్జించికొని విపత్తు శిక్షింత మొండె. ఇందు నీకెయ్యది పోలియున్న యది చెప్పు' మనిన దమనకుండు

కొంతవడి చింతించి తుదముట్టఁ గారణంబు దెలియక తమకింప
రాదు. శబ్దమాత్రంబునకు నివ్వెఱఁ బొరయంజనదు.

తొల్లి యొక జంబుకంబు వనమ్మునం గ్రుమ్మరుచు నెక్కడ నా
హారంబు చేకూఱమిం గరం బుదరం బాఁకట నకనకంబడ డిల్లపడి
వికలాంగంబులయి నేలం గూలిన శతాంగంబులును ఖండిత
శుండాదంతకాండంబు లయి కెడసి కొండలపిండువిడంబించు
వేదండతండంబులును ముంగాళ్లు విఱిగి డొక్కలు పెరిగి మూఱు
మెడలువ్రైచి డాఱుమాఱుగం బడియున్న వాఱువంబులను నెఱ
మగంటిమి మెఱయ వాతెఱం గొఱుకుచుం జూపు జంకెనల
పొంకంబు వదలనిశిరంబులును వాలువోఱంగని కరంబులును
గరంబు మెఱయ వీరశయనంబు నొందిన యోధవారంబుం గలిగి
ఘోరంబయి వివిక్తంబయిన యొక్కపొలికలనిం గని తఱియం
జని యొక్కదారుణారావంబు విని గుండియ లవియ బెండుపడి
మూర్ఛిల్లి కొంతవడికిం దెప్పిరి తెప్పలువిచ్చి యప్పొలంబు నలు
వలంకులు విలోకించి గాలింగదలు ప్రేఁకగొమ్మల తాఁకున మ్రోఁగు
దుందుభిం గని మనంబునం దలం బగుకొంకులంబు మాని దాని
డాయం బోయి యద్దానితోలు ప్రీలం గొఱికి చూరంబడి వెడలి
వచ్చి 'దీనికలరూపు తొలుతం దెలియంజాలనయితి ఇప్పుడుగదా
దీనిచొప్పు నెఱింగితి. ఎద్దియేని సవిమర్శంబుగం బరికింపక కాని
యున్న తెఱం గెఱుఁగంబడదుగదా' యని యెన్నుకొనుచుం దన
చుట్టుఁబట్టునం జూపట్టుశవనివహంబు పాఱంజూచి 'యాహా!
యిట్టియాహారంబు దొఱంగి సురుంగం జూచితింగా' యని వగ
చుచు వలయునంత పలలంబు దిని తనయిచ్చం జనియె. కావున
శబ్దమాత్రంబునకు నివ్వెఱఁ బొరయంజనదని వచించితి.

స్వామిముదల యిచ్చినం జాలును. ఈక్షణంబ యాచప్పు-
డుప్పతిల్లినచాయకుం బోయి తత్కారణం బారసి నీలెంక రాఁగ-
లండు' అనినం బింగళకుం డాతని మొగం బట్టి చూచి కొంత
చింతించి 'యిదియ యిప్పటి కుచితంబని తోఁచుచున్నది. కరంబు
పరికింపక యేకార్యమున కేనిం దమకింప లగ్గుగాదు. ఎదిరిసమ్ముఖం-
బున మాటలాడ సూటివడెనేని బలాబలంబుల కొలఁది యెఱింగి
తత్కాలోచితంబుగ నాపుత్తెంచినమాటలుగ నాడవలసిన
నీకుం బోలినతెఱంగున నాడి యెదిరిని లోఁగొనవచ్చునేని నట్లు
నడపుము. నీ వన్నిటం జతురుండవు. నీకుం జెప్పవలయునే?
పోయి రమ్ము.' నావుడు దమనకుండు గ్రక్కున వెడలి తొల్లి యా-
మ్రోఁత వీతెంచినజాడనపోయి యాపొలంబు నలుఁగెలంకులు
కలయం జూచి యాడుగులచొప్పువట్టి డాయంబోయి సంజీవకుఁ-
గాంచి 'యోయి వృషభేంద్రా! నేను మృగేంద్రునిభృత్యుండను.
అతం డనుప నీపాలికి వచ్చితిని. అతండు దానుగ నీతోడ నాడు
మాటలు నాకుం గఱపి పుత్తెంచినవాఁడు వినుము. "ఈయర-
ణ్యంబు మదధీనంబు దీనంగలసత్త్వంబులన్నియు నాశాసనంబు
వహించి వర్తించుచున్నయవి. నీవును నాయాజ్ఞానువర్తివయి
యుండునది. ఇంతియ కాదు. మదీయానుచరులం గూడి వర్తింప
నీకుఁ బ్రియంబేని ననురూపం బగురాచకార్యం బొసంగెద.
నీయిష్టం బెయ్యది యది యనుసరింపవచ్చు" నని యానతిచ్చె.
ఇంతకుమునుపు నీవు నిశ్శంకంబుగ ఱంకియవైచితివి గాఁబోలు!
దాని విని యేలికకు నీపాలఁకువ విచారణీయంబయ్యె. నీవు
భయంపడకుము. అమ్మహామహుండు కరుణాళుఁడు ధార్మికుండు
గావున సజ్జనులకు గమ్యుండయి యున్నవాఁడు. నీవు శంకిం-

పక యేతెమ్మని నుడివి యొడంబఱచి, ముందు మృగేంద్రుని
పాలికిం జని 'స్వామీ! దేవరయాజ్ఞ చొప్పునం బోయి పరికించితి.
మీవిన్న యారావంబు గావించినవాఁడు మీకనుగ్రాహ్యుండు
గాని నిగ్రాహ్యుండు గాఁడు. తావకం బగునవక్రవిక్రమంబు
విని భయాక్రాంతుండయి యున్నవాఁడు. ప్రభంజనుండు
మహాభూజంబుల భంజించుంగాని వినతంబు లగుతృణవితానం
బులు పెకలింపం గడంగునెట్లు? శక్తిసంపన్నుండు దన్ను మాఱు
కొనువానియందుఁ దనబలంబు వెలయించుఁగాని మ్రుక్కడుల
లెక్కింపఁడు. ఇట్టిగుణంబు లేలినవారికి సహజంబులై యున్న
యవి. అవసరంబగుడు వచియింపవలసెంగాని దేవరకు ముందఱ
వాక్రువ్వవలయునె? ఆతఁడు సంజీవకుం డనువృషభేంద్రుండు.
బుద్ధిమంతుండు. ఏలినవారి యోలగంబున వర్తింపఁజాలిన
వాఁడు. అతని స్వామిపాదంబులచెంతకుం గొనివచ్చెద ముద
లయే' యనం బింగళకుఁడు చిఱునగవుతోడ నంగీకారసూచ
కంబుగ మొగం బెగరవేయ మహాప్రసాదం బనుచు విన మిత
గాత్రుండై యొదుంగుచు వేళంబ చని సంజీవకున కెదురు
వోయి 'నీభాగ్యంబుకతంబున మృగరా జొంటి నున్నవాఁడు.
కానిపించుకొన నిదియె సమయంబు. మసలక యేతెమ్మని వెంటం
దోకొనివచ్చి తేనికట్టెదురు దోలంగించి కొంత చెంత నిలువ
సంజీవకుండు భయవినయసంభ్రమంబులు ముప్పిరిగొన వినమ్రుం
డయి వందనం బాచరింప మృగేంద్రుండు సాదరంబుగం బ్రసాద
మేదురం బగుక్రేగంటిచూ పతనిపయిం బొలయ నిన్ను మా
దమనకుండు పెక్కుతెఱంగుల నుగ్గడింప విని సంతసించినారము.
నీయట్టిధీమంతుండు మాకొలువు నీయకొనుట మాకుం బరమ

లాభం బని యెన్నుచున్నవారము. మంత్రిపదంబు నీకొసంగి నారము. జాగరూకుండవయి యన్నియోగంబులందు మాకు మాఱుగఁ గార్యంబులు నిర్వహించుచుఁ బరివారసంరక్షణాది కార్యంబులు కొఱంత వడకుండ జరుపునది అని యానతిచ్చి యది దొరంకొని తానును మంత్రియు బద్ధసఖ్యంబునసుండి నానాఁటం దక్కుంగల పరివారంబువలన నిరాదరుండై యుండె.

దానం జేసి దమనకుండు తనయిరవున కటుదెంచి చింతాక్రాంతుం డయియుంటఁగాంచి కరటకుండు 'తమ్ముఁడా! నెమ్మొగంబు విన్నఁబోవ ఖిన్నుండవయి యున్నవాఁడవు. కతం బేమి' యని యడిగి యాతనిచేతం దత్కారణం బారసి కొండొకదడవుమిన్నకుండి 'మీఱినపని కూరక విచారంపడ నేమిఫలంబు? మన కేల యీ పెద్దతనంబులని మొదలనె పెక్కువిధంబులం జాటి చెప్పితిని. నీవు నేర్చిననీతులన్నియుఁ బెల్లుగ వల్లించితివిగాని నాపలు కొకటియయినఁ జెవిఁ జొరనిచ్చితివె? తన్నుఁగట్టఁ ద్రాళ్ళు దాఁ దెచ్చుకొన్నట్లు రాఁగలహాని గానక తేనితోడ లేని పెద్దఱికంబులు కొన్ని నోరికసిదీఱ నాయెద్దునకుం గలుగం బలికి చెలికాడంబు చేయించితివి. ఇప్పు డనుభవింపకతీఱునె? అది నీనేరమింగాదె?' నావుడు దమనకుండు నిట్టూర్పునిగిడించి తల పంకించి యుంకించి మొగం బెగనెత్తి "కరటకా! నీవచనంబు సత్యంబు దూరము విచారింపక చేసితిని. ఇంక నేమిచేయవచ్చు? దైవంబు ప్రతికూలంబయినం బురుషకారం బెల్ల వ్యర్థంబయి చను. కావున నన్నూరక దూఱకుము. ఇట్లు నే నొక్కండన కాను. ఆషాఢభూతి యనువానిచే నొక్కసన్న్యాసియు మేషయుద్ధం

బుచే నొక్క జంబుకంబును ధనప్రాణంబులు గోలువోయిరి. ఆకథ వాక్రుచ్చెద నాకర్ణింపుము.

దేవశర్మాభిధానుం డగు పరివ్రాజకబ్రువుం డొక్కరుండు గలఁడు. అతండు లోభాక్రాంతచేతస్కుండయ్యు వీతస్పృహుం డుంబోలె జనంబులకు మనంబులు తనియ నశ్రాంతంబు వేదాం తార్థంబు లుపన్యసించుచుఁ దదాకర్ణనకుతూహలంబున మూఁగి లోకులు భక్తిం దెచ్చి యెదుర నిడినవిత్తంబు లనాదరసూచక మందహాసరోచిరుదంచితసుందరవదనుం డగుచుం గాంచి తదను గ్రహార్థంబుబోలెఁ జూపుల నంగీకరించుచు నట్లు నానాఁట సముపార్జించినవిత్తం బొక్కబొంతం బదిలంబుగ నునిచి కూర్పు వోసియది కప్పికొని క్రుమ్మరుచుండు. అతం డొక్కనాఁడు జను లకుం గర్ణరసాయనంబుగ మోక్షధర్మంబు లుపన్యసించు చుండ నొక్కమాయావి యాయమస్కరిధనంబు తస్కరింపం గోరి పెక్కు దినంబులనుండి వేచియుండి లాఁతివెరవు దొరకమిం జేసి డాయం బోయి సర్వాంగాలింగితభూతలంబుగం బ్రణామంబు గావించి లేచి ముకుళితకరుం డగుచు నాతనికిని మఱువడకుండ నొక్క పక్క కొదిఁగి నిలుచుండి యాతండు వాక్రుచ్చుధర్మంబులు తదేకాగ్రహృదయుండుంబోలె నాలకించుచు విలక్షణుండుం బోలె దూరితతారళ్యవిస్తారితనయనుం డగుచుఁ జిరంత నాత్మీయధర్మసంశయరాకరణచణప్రస్తుత ప్రకరణార్థశ్లాఘనుా నుండుంబోలెం బరివాహితమస్తకుం డగుచు శ్రవణాంత రాయాసహిష్ణుండుంబోలెం దత్రత్యజనసల్లాపంబులు భ్రుకుటిత ముఖుం డయి సీత్కారపూర్వకంబుగ నిక్షిప్తకరసంజ్ఞచే వారిం చుచు నిర్భరానందవివశుండుంబోలె సబాష్పనిమీలితలోచనుం

డగుచుఁ దదుపన్యాసావసానంబున నచ్చటిజనులం గాంచి,
'స్వాములు కడు బడలియున్నవారు. ఇక్కడివారందఱు గొంత
సేపెడగలుగ నుండుఁడు. భిక్షానంతరంబు రండు పొండు' అని
యవ్వాలికనిపి యొక్క తాళవృంతంబు పుచ్చికొని పక్కనిలువం
బడి యల్లన వీచుచుండె. అంత నయ్యోగి యాతని సాదరంబుగం
జూచి 'యోయి నీవెవ్వండవు? మాకు భక్తిసేయుచున్నవాఁడవు.
మావలన నీకు వలయు ప్రయోజనం బేమి? నావుడు 'స్వామీ!
నేనాషాఢభూతి యనువాఁడ. తమయందు గుప్తంబై యనన్య
సాధ్యం బయినయర్థంబు తమకు శుశ్రూష యొనరించి పడయం
గోరినవాఁడ. నన్ను శిష్యుంగాఁ గొని నాయీప్సితార్థం బొసఁగి
యనుగ్రహింపుండు. మఱియొక్కండే నొల్లం. యథార్థంబు విన్న
వించితి.' నావుడు నప్పారాశరి యట్ల కానిమ్ము నావుడు వాఁడు
మహావినయభయభక్తులు కరంబు మెఱయించుచు శుశ్రూష
సేయుచు నాతని వెంబడి దేశాటనంబు సలుపుచుండె. ఒకనాఁ డా
పారాశరి దారింబోవుచుండ నాటక్కదారి సత్వరంబున నాతనిఁ
జేరంజని 'యోస్వామీ! నిన్నరాత్రి మనము నిద్రించిన యింటి
వారిది గడ్డిపరక నాగుడ్డ నంటి వచ్చినది. తృణమ్మైనఁ బరుల
సొమ్ము గొనం జనదు. ద్రుతగతిం బోయి యిది యాయింటివారి
కిచ్చి వచ్చెదనని వాక్రుచ్చి కొంతదవ్వు వెనుకకుం జని యాపర
కం దొరుగవిడిచి కొండొకదడవు దారి మసలి యరుదేరంగాంచి
యాకర్ణంది వెఱఁగంది "యీతండు వీతస్పృహుం డవిగీత
చరిత్రుండు విశ్వాసపాత్రుం" డని యెంచి చిరసంచితధనసంచ
యంబు నించిన తనబొంత మోవం బ్రాలుమాలి వెంటవచ్చు
నా వెచ్చకానిం గాంచి "వార్ధకంబున హీనసత్త్వుండ నగుటం జేసి

యింతమాత్రంబు కప్పుడుబొంత మోవంజాలకున్న వాఁడ దీనిం బదిలమ్ముగం గొనినమ్మా" యని చేతికిచ్చిన వాఁడు సంతోషభ రాక్రాంతస్వాంతుం డగుచు వినమ్రుండయి మహాప్రసాదం బని గైకొని పెచ్చుహెచ్చరికతోడ వహించి తెచ్చుచు వలసినచో నాభిక్షునకుంబఱపుగం జలికప్పుగ విని యోగించుచుండొంటికంటె హెచ్చుగ నచ్చికఁ బుట్టించు వాలలంబుఁ బూని యూడెంబు సేయుచుండెను. ఒక్కనాఁడక్కావితాల్పుమార్గంబునంబోవుచు సమయజామదగ్న్యుండు కరసహస్రంబు ఖండింప రక్తప్రభా భాసమానుండును బ్రతాపహీనుండునయి కృతవీర్యసూనుండుం బోలె భానుండు చూపట్టుఁడు నచ్చోటికిం గుఱంగలి యగు జలాశయంబులకుం బోయి వార్చుచుండె. అప్పుడు కట్టెదురం దత్తీరంబున మేషంబులు రెండు రోషంబు మీఱ నగంబులు ప్రతిఘోషంబు లీనం బెల్లు రేఁగి పెడిల్లన డీకొంచు దారుణం బుగం బ్రవిదారణంబు సలుపుచుండ వానిమధ్యంబున నల్లం దాఁకువడి మూర్ధంబులు వగులం గాఱి పేరినదాని ఫేరవం బొక్కండు గాంచి పలలఖండం బని తలంచి సంతసించి డాయం బోయి యిది యుధ్యన్మేషమధ్యం బని గణింపక దాని భక్షించు చుండ నంతకుముందు డీకొని పిఱిందికి జరిగినయురణంబులు మరలం బఱతెంచి డీకొనుడు నడుమం దగులువడి యావంచ కంబు పంచత్వంబు నొందె. ఆసన్న్యాసి యయ్యది విలోకించి "యాహా! ఆమిషలోభంబు గోమాయువు నిట్టిదశకుం దెచ్చెఁ గాదే? ఏరికేనింగాని గుణంబు లోభంబుకంటె నొక్కండుగలదే?" యని చింతించుచు మరలి తీరం బారోహించి యాదారి శిష్యుం గానక "యొహో యాషాఢభూతి! యొహో యాషాఢభూతి!"

యని యెలుంగెత్తి పిలిచి పిలిచి సంజప్రొద్దు వెలుంగునకుం గరంబు మఱుంగు పెట్టుకొని కనుమేరదూరంబు చూపు సారించి పాఱం జూచుచు యాతాయాతజనంబులం జేరం బోయి వాని యంగమచ్చము చెప్పి యిట్టివాని బొంతమోచుకొని పోవువానిం జూచితిరా యని యడిగి యడిగి నలువలంకులకుం బాఱిపాఱి వెదకి వెదకి వేసఱి కడకుం ద న్నా దురాత్ముండు ప్రతారించెనని యెఱింగి శిరంబు పంకించి నిట్టూర్పు నిగిడించి మేషయుద్ధంబుచే జంబుకంబును నాషాఢభూతిచే నేనును స్వదోషంబువలన చెడితిమి. ఇంక నేమి చేయవచ్చునని చింతించుచుం జనియె."

అనిచెప్పినం గరటకుం 'డెట్టిధీమంతునకే నొక్కొక్క కాలం బునం బ్రమాదంబు వాటిల్లుట స్వాభావికంబు. దానికి వగవం బనిలేదు. నీవింకం జేయందలంచినకార్యం బేమి' యని యడిగిన దమనకుం డిట్లనియె. వినాశోన్ముఖకార్యంబు మేలువఱుచుటకు భావ్యర్థసంగ్రహంబున కనర్థప్రతీకారంబునకు నర్హం బగు మంత్రంబె శ్రేయంబు. కావున నదియ యిపుడు కర్తవ్యంబు. అందు బింగళకసంజీవకులకు భేదంబు పుట్టించునుపాయంబు పరికించుట ముఖ్యంబు. దానంజేసి మనకెల్ల యర్థంబులు సిద్ధించు. మనమిప్పు డుపేక్షించినం బిదపం బింగళకు డాయుట దుష్కరంబు' నావిని కరటకుం డది యెట్లు సాధ్యం బగు ననిన దమనకుం డిట్లనియె. 'ఉపాయంబుచే నేయది శక్యంబగు నాయది పరాక్రమశతంబుచేత నయిన శక్యంబుగాదు. కాకం బొక్కం డుపాయంబుచేఁ దనకు విరోధి యగు సరీసృపంబును దోరించె. అక్కథ వక్కాణించెద నాకర్ణింపుము.

యమునాతీరమందలి వనములో మఱ్ఱిమ్రాఁకుమీఁద గూఁడు కావించుకొని వాయసమిథునము వాసము చేయుచుండెను. ఆమఱ్ఱి క్రిందిపుట్టలో సర్పము వాసముచేయుచుఁ గాకిపెట్టిన గ్రుడ్లు భక్షించి పోవుచుండెను. దానికి వాయసము మిక్కిలి ఖేదపడి తనమిత్రమయిన నక్కపాలికిఁ బోయి త్రాచువలనఁ దనకు మాటిమాటికి వచ్చునుపద్రవము చెప్పుకొని యంగ లార్చెను. అప్పుడు నక్క యిట్లనియె. 'తొల్లి యొకకొలనిలోని మీనముల నెల్ల బలవంతముచేసి భక్షించినకొంగ నొక్క యెండ్రి యుపాయంబుచేతఁ జంపెను. అట్లు నీవును నీశత్రు వును గడముట్టింపుము. నీ కాకథ చెప్పెద వినుము.

బదరికావనమందు సారోదం బనుకాసారంబు గలదు. అక్కడి కొక్కముసలికొక్కెర వచ్చి నయనంబులు నిమీలించి యాహారంబు మాని దుష్కరం బయినతపంబు చేయుదానివలె నొంటికాలితో నిలువంబడి యుండెను. ఒకయెండ్రి యాతెఱంగుఁ జూచి కరము వెఱఁగుపడి డాయం బోయి యిట్లనియె. "ఓయి బకోత్తమా! నీ వనయంబు క్రశిమంబు వహించుచున్నవాఁడవు చేరువఁ బొరలాడుమీనంబులఁ జూడనయిన నొల్లవు. ఈయునికి యేదియే నొక్కమహార్థం బర్థించి పూనినయనశనవ్రతానుష్ఠా నంబు గాఁబోలు. నీవిచిత్రచరిత్రంబు మదీయశ్రోత్రపేయంబు గావింపుము" అనిన విని బకం బల్లన నిట్లనియె. "ఓయి కర్కట కోత్తమా! నీవు మిక్కిలి బుద్ధిమంతుఁడవు. ఆకారంబుచేతన భావంబు భావింప సమర్థుండవు. నిస్సంగులమయి మౌనముద్రా ధారులమగు మాదృశులకు సహితము నీవచనచాతురిమంబు సల్లా పంబునం దుల్లాసంబు పుట్టించెడు. పుట్టువుఁ దొట్టి నాకడుపుఁ

జిచ్చునం బడి మడిసినజంతువు లిన్ని యని యెన్నికకు రావు. ఇట్లు మదీయజాతికి స్వాభావికం బయినభూతహింసాధర్మంబుచే శరీర భరణంబు గావించుచుండుదును. గంగోత్తరతీరమందు మఱ్ఱి వృక్షము కొమ్మమీఁద నేను గూర్చుండియుండఁగా నాక్రాని క్రింద నొక యోగిపుంగవుండు తనశిష్యులకు నానాధర్మంబు లుపదేశించువాఁ డిట్లనియె. 'పురుషార్థం బర్థించువారి కవశ్యా చరణీయంబులగు ధర్మంబులు వినుఁడు. సకలదోషంబులకు మూలంబయినలోభంబు విసర్జింపవలయును. సర్వభూతంబుల యందు సదయుండయి యుండవలయును. ఆలోభంబును భూత దయయును లేనివానికి సర్వధర్మంబు లనుష్ఠితంబులయ్యు నిరర్థ కంబులగు. జీవనంబు క్షణభంగురంబు గావున మోసపోక పురుషుండు కాలంబు పుచ్చక యుత్తమధర్మంబు లనుష్ఠింపవల యును' అని వక్కాణింప విన్నవాఁడను. ఎట్టి సుకృతవిశేషంబు ననో నాఁటంగోలె నామహానుభావుండు వచియించిన ధర్మం బులు మనంబునం బట్టి స్వప్నావస్థయందయిన మఱపునకు రావు. అదిగో నాఁడు మొదలుకొని పురుషార్థంబునంద బుద్ధి నిలిపితిని. హింసాకర్మంబునకు రోసితిని. జలశైవాలాదులతో దేహధార ణంబు చేయుచు ముముక్షుత్వంబుం బూని మునివృత్తి నున్న వాఁడను." నావుడు విని యచ్చో వసియించు మీనంబులు మోదమానంబులయి యాహా యీమహామహుండు నీఱుగప్పి సిననిప్పువలె నున్నవాఁడు. ఈతండు బకమాత్రుండు గాఁడని పరికించి డాయం బోయి యిట్లనియె. "ఓ మహానుభావా! నీకృపావలోకంబు మాపయిం బొలయింపుము, అనావిలభావం బులతో మీసేవఁ గోరివచ్చినవారము" నావుడు నాబకంబు

ప్రసాదభాసురం బగుదరహాసంబు గావించుచు వాని ప్రార్థనంబు కటాక్షంబుల నంగీకరించి నాఁటంగోలె వానితో సఖ్యంబు గావించుచుండె. అంత నొక్కనాఁడు వఱువాత నాఖగంబు శోకశాయనికంబులయి డాయం జనుదెంచిన మీనంబులదీన వదనంబుతో బాష్పవారిపూరితలోచనంబయి నిట్టూర్పు నిగుడ విలోకించి తల పంకించి యుంకించి కొలనియోగంబు మీఱ నేరికి శక్యంబు నావిని మీనంబు లిట్లనియె. "ఓతపోధనా! తడవులంబట్టి నిన్నెఱుంగుదుము. నీవు నిత్యసంతుష్టుండు నానెగడితివి. అట్టినీకు నేఁ డిట్టిఖేదంబు రాఁగతంబేమి?" అనవుఁడు నాటక్కరికొక్కెర యెలుంగురాలుపడ నిట్లనియె. "కాలము చెల్లినవాఁడను గాఁబట్టి యింక నూరకుండరాదని విచారించి ముముక్షుండనయి పుత్త్రాదిబంధంబుచే విడిపించుకొని మంటిని సుఖింపఁ గంటినని యుండఁగాఁ బ్రారబ్ధకర్మవశంబున మీతగులం బొక్కటి ప్రాప్తంబయ్యె. మీకొకయాపద వచ్చుచున్నదుల్లంబు తల్లడిల్లుచున్నది." అనుచు జొటజొటఁ గన్నీరు విడుచుచు నిట్లనియె. "ఇంతకుముందు కొందఱు జాలరులు వచ్చి యీ కొలని జలంబుకొలంది పరికించి యింకఁ గొంతనీ రింకిన వత్తమని పోయిరి. ఆమాట వినఁగానె నాగుండెలు బద్దలయ్యెను. అది మొదలుకొని విషణ్ణుండనయి యున్నవాఁడను" నావుడు మీనంబులు విని భయంపడి యిట్లనియె. "ఎట్లయిన మమ్మీబారివలనఁ దలఁగువెరవు పరికింప నీవొక్కరుండవు వలంతివి. ఖేదంబు పేర్మిని విషాదంబు నొందియున్నవాఁడవు. ఇంతియకాని లెస్స పరికించిన నీకుం దోఁపనియుపాయంబు లేదు. నీవ మాకు శరణంబు" అనిన బకంబు కొంతవడి చింతించి యిట్లనియె. "ఇచ్చ

టికిఁ గొంతదవ్వున నిత్యాపం బను కొలను గలదు. అందులకు మిమ్మందఱ నొక్కనాఁటనె కొంపోవ శక్తుండఁ గాను గాని యోపినంతవట్టు నానాఁటం గొనిపోయి విడిచెద." అని చెప్పి ప్రతిదినము వలసినన్నింటిని ముక్కునం గఱచుకొనిపోయి యొక్కకొండ బండమీఁదం బెట్టుకొని భక్షించుచుం గొన్ని దినంబులలో నాకొలను నిర్మీనంబు గావించె. అంతఁ దొలి మిత్రం బయినయెండ్రి బకముతో నిట్లనియె. "నా ప్రియ మిత్రుఁడా! యిక్కడి మీలను బారివలనఁ దలఁగి రక్షించితివి. అట్లు నన్నును రక్షింపుము." నావుడు బకంబు వల్లె యని యెండ్రిని జంచువుల నిఱికించుకొని మిక్కిలి పొడవున కెగసి తాను మీలఁ దిన్నకొండకొమ్మునకుఁ జక్కఁగా సాగి మింటఁ బోవుచుండెను. ఆపోకడ చూచి యెండ్రి యిట్లు చింతించెను. "ఇప్పు డీబకంబు నన్నుం గొనిపోక యీకొండకొమ్మునకుఁగాని, వేఱొండుచోటికిఁ గాదు. ఈ కొండశిఖరంబున జలంబు లెక్కడివి? ఈగుంటమీఁదఁగాని దీనిచుట్టుఁబట్టునఁగాని జలంబులు లేవని యాప్తులవలన వినియున్నాఁడను. ఈబకంబు కపటంబున మీనంబులం బట్టుకొనివచ్చి యీకొండకొమ్మునఁ బెట్టుకొని తినియెఁ గాఁబోలును. అహా! తెలియక యీఖలుని పలుకులు విని మోసపోయితినిగదా! మాయికులయందు బుద్ధిమంతుండు మాయావియయి ప్రవర్తింపవలెఁగాని ఋజువుగాఁ బ్రవర్తింపఁ గూడదు. కాఁబట్టి యేవిధముచేతనేని దీని వంచించి తప్పించుకొనునుపాయంబు కావింతుఁగాక యని వగచి కర్తవ్యం బాలోచించి లెస్సగా బుద్ధియందుఁ గుదుర్చుకొని యిట్లనియె. "ఓయి బకోత్తమా! నీవు నన్నుఁ గడుదవ్వు దుసికిలకుండఁ బట్టుకొని

పోఁజాలవు. జాతిపడితినా భూమిని సంచరించుజంతువులు నన్నుఁ బొలియించి భక్షించును. ఆవల నీయభిమతంబు సిద్ధింపదు. ఇప్పు డొక యుపాయము చెప్పెద వినుము. నేను నీకంఠంబు కవుఁగిలించి పట్టుకొని వచ్చెదను. గమ్యస్థానంబునకుఁ బోక మునుపు నాపట్టు విడువను. ఇంత చెప్పనేల నారక్షణభారము నీది. చిత్తము వచ్చినట్లు చేయుము." అనిన విని యాకొక్కెర సమ్మతించి యెండ్రిచేతఁ గంఠంబు గౌఁగలింపించికొని కొండ మీఁదికిఁ బోయి కాళ్లూనఁబోవునపుడు కులీరంబు తనగిట్టలతో దానికంఠంబు కఱుక్కునఁ ద్రెంచి నేలఁబడి ప్రాణంబు తప్పించుకొని తనయిచ్చం బోయెను. కాఁబట్టి నీవును సదుపాయము విచారించుకొని నీశత్రువును జంపు మని నక్క చెప్ప విని దాని చేత సెలవుతీసికొని కాకి తనయిరవునకు వచ్చి చేరెను.

యమునదాపున విలాసధామం బను పట్టణంబు గలదు. అందలి రాజాంగనలు క్రీడార్థంబు వనంబునకుం జని కుసుమాపచయం బొనరించి శ్రాంతి యడంగ జలంబు లాడంగోరి యొక్క సరసిం గాంచి యనూనం బగుదాని మానోజ్ఞకంబునకు మానసంబుల నానందంబు నిట్టవొడువం దత్తీరంబుఁ జేరి హారాది పరిష్కారంబు లూడ్చి యచ్చోటనుంచి చనుకట్టులుగట్టి యొండొరులచెట్టలు పట్టుకొని సుందరమందగమనంబుల నొయ్యారంబు మీఱ నీరంబుల డిగి యల్లల్ల నడుగులిడుచు విసారవార పరిస్ఫురణంబులం గాంచి యంతకంతకెం దమమించులు మించుగ మెఱయించుతెఱంగున వెలితభుకుంజాపులు కళవళింప నులు కుచు: గటిద్వయసంబుగ డిగి సలిలవిహారంబు సలుపుచుండ నొక్కలతాంగి దోయంబులు దోయిలించి దోయిలించి యొక్క

తోయజాతీపయిం జల్లి యది మాఱుకొని "యేదేది నిలువక చల్లుమా చూత" మనుచు మీఱం జల్లిన ధారాసారంబునకుఁ దాళంజాలక కేలొడ్డి పెడమొగం బిడి పెఱకేలెత్తి మ్రొక్కుచు 'నమ్మమ్మ చాలుఁ జాలు నీజోలి కింక రాను మాను మన నయ్యది యిస్సిరో యింతపిఱికివె నా మఱియొక్క తెఱవ నెఱజాణవేని నావంక మఱలుము. చిఱుతుకదానితోడనా యింతబింకంబులు ఝాంకించెద వని పురికొలిపి తాను నదియు మలంగక తొలంగక పట్టువదలక నట్టుగదలక పరస్పరకరకమలసమీరితవారిధారల లోఁగక తోఁగుచు నొండొరుల హెచ్చుచు మెచ్చుచు నిది యేఁటిసుమాళంబె చాలుఁజాలు మీయాలంబు చాలింపుఁ డని తోడివారలు వారింప దరహాసాంకూరంబు లాననాంబుజంబుల నలంకరింప నార్ద్రాంశుకోత్తరీయాంతర్గత నిస్తల స్తన స్తబకంబు లుబ్బి నిబ్బరంబుగ నిక్కం గడురోఁజుచు నిలువంబడ మఱి కొందఱు ముద్దియ లుద్దులయి యొండొరులరవణంబులు పణం బుగం బన్నిదంబు సఱచి పారంబుసేర వేగంబుమీఱ నీదుచుం బోవ నేల యూరక కరంబు కలగుండు పఱిచెద రే యని లాఁతి చేడియలాడ మనలం జేరినవారి కతనుక్షోభంబు దుర్వారంబు గాదె? యని చదురులాడుచుం బారంబు ముట్టుచు ముట్టని వారిం గరంబులం జప్పటలు గొట్టి యోడితి రోడితి రని గేలి సేయుచు స్తనగమనసామ్యాసమానత్వంబునంబోలె రథాంగ చక్రాంగంబులం బాఱందోలుచు స్వోపప్లవకారణమార ప్రహార ణంబులను నీరసంబునుంబోలె సారసంబులం దునుముచు జలవిహా రంబు సలుపుచుండ మున్నా తీరంబుచేరువ నునిచిన పరిష్కారం బులం దుదార ప్రభారమణీయం బగుమణిసరం బాకాకంబు

ముక్కునం గఱచికొని పఱచి యల్లంత నొక్కతరుశాఖం గూర్చుం
డం గనుంగొని "యదియేమి విచిత్రంబె. రత్నసరంబు కరటంబు
గొంపోయెం జూచితిరే" యని యొక్క సీమంతినీలలామంబు
వాక్రువ్వ నంద ఱొక్కమొగి వదనారవిందంబు లెత్తి పారిప్ల
వేతరవిస్తారితచారులోచనలై యస్పందమిళింద సుందరవికసిత
కుసుమరాజివిరాజమాన మల్లికావల్లికామతల్లికావిభ్రమాను
కారిణు లగుచు సూచీముఖాలంకృతనాసికాగ్ర లగుచు దూరీ
కృతనిమేషంబుగ దృష్టి సారించి కాంచుచు "నిక్కాకంబు పద్మ
రాగప్రభారించ్ఛోళిం గాంచి యామిషంబని భ్రమియించెఁ
గాఁబోలు ననుచుఁ గాదుగాదు మెడం దగిలించికొని కులుకు
లాడంబోయెడు" నని నవ్వుచు నీయందంబునకు హారం బొక్కటి
తక్కువయని మొగం బడ్డంబుగ సుంకరంబుగం బంకించి
చేయెత్తి జుట్టన నెటిక విఱుచుచుఁ జక్కనిహార మమ్మ యిప్పలు
గాకికాకి యెక్కడనుండి వచ్చెనో యింక నెక్కడం బాఱవై
చెడునో యెవ్వరికిం జేపడునో యనుచు నయినం గొఱంతలేదు.
జలవనాదిదుర్గమస్థానంబులంబడి యేరికిం జేరకపోవుటకంటెం
గొంతమేలుగాదె? యనుచు నండజంబునకు మండనంబుతోడం
బనియేమి? దీనికిం గతంబు పరికింపవలయు ననుచు నెద్దియేనియు
నొక్కనిమిత్తంబు లేక తక్కదు. నిలుకడమీఁదం దెలియనగు
ననుచు నొండొరుల ముచ్చటలాడుచుండఁ దత్పరిచారికలు
కొంద ఱావాయసం బే చాయకుం బోయెడినో యేమఱక కను
గలిగియుండుఁడని యచ్చటివనపాలకుల నియమించి సత్వరంబుగం
బోయియావృత్తాంతంబు రాజపురుషులకు నివేదించి వారిచే బ్రేరి
తులగు జనులం దోకొని వచ్చి కానిపించుడు నాకాకంబు మంద

గమనంబునం జని యాత్మావాసం బగువటకుటంబుకొమ్మం జేరి నేరిమి మీఱం గ్రిందివల్మీకంబునకుం జూటివడ విడువ నాసరంబు మీసరంబుగం గెంపుమెఱుంగులు దుఱంగలింపఁ దత్రత్యకాల వ్యాళవినాశపిశునోల్కాపాతానుకారి యగుచుం గోమక్రంతం బడ రాజభటులు గాంచి గునపంబులు లోనగుసాధనంబులు దెప్పించి దానిం గ్రొప్పించిన నందలిదందశూకంబు విషానలంబు దరికొలుపుటకుం బోలె ఫూత్కారంబులు నిగిడించుచుం బరప్రాణా నిలంబులు గ్రోలుటకుం బోలె నాభీలంబుగ నాలుక లార్చుచు నిర్గమించి పఱుంబడి కఱవం గమకించుడు వారలు చిక్కని పెక్కు బడియలం జవియ నడిచి దాని మడియించి యానేపథ్యంబుం గొంపోయిరి. అదిమొదలుకొని కరటంబు కరంబు సుఖంపడియుండె. కాఁబట్టి యుపాయంబుచే సాధింపరాని కార్యంబులు లేవు.

బుద్ధిబలంబు గలవానికిం దక్కుబలంబు లేకుండినం గొఱంతలేదు. ధీశక్తివిరహితునకుం దక్కంగలబలిమి యెంతగలిగిన నసత్కల్పంబయి చను. తొల్లి యొక్కశశకంబు నేర్పునం జేసి యొకసింగంబుం ద్రుంగించె నక్కథ వక్కాణించెద నవధానంబుతోడ వినుము.

ఒక్కయరణ్యంబున సత్త్వసారం బనుకంఠీరవంబు గలదు. అయ్యది యయ్యడవిం గలజంతుసంతానంబులం బొలియించి భక్షించుచుండు. అందుల కచ్చటిసత్త్వంబు లెల్లం బెల్లు భీతిల్లి యొక్కచక్కటిం జేరి పెక్కుతెఱంగులం బరికించి తమకుం బాటిల్లినబారికిం బ్రతీకారంబు గానక తుదకుం గర్తవ్యాంశం బొక్కండు విచారించి కలియం బలికికొని బెండగిలి మృగనాథు పాలికిం జని మనంబుల ఘనంబుగ దరంబు గదుర నాననంబుల

దీనభావంబు నివ్వటిల్ల చవ్వుదవ్వుల నిలిచి యభివందనం బొన రించి "యోమృగస్వామీ! మేము మీకొక్కచిన్న విన్నపంబు గావింప వచ్చియున్నవారము. మామీఁదం గరుణించి యవ ధరింపుఁడు భవదీయ ప్రతాపానలంబునకు లోకంబులోని వ్యాళజాలంబెల్లఁ దృణప్రాయంబు నా మాయట్టిముక్కడుల లెక్కింప నేల? కొంతదయ గలిగి తెగవుగాని యొక్కనిమిషంబు లోన మమ్మందఱ నిర్మూలింపం జాలవె. అట్టికరుణాఖండ వగుటం జేసి మా ప్రార్థనంబు పోలివోవదని తలంచెదము. దేవరసన్నిధికి వంతుమయిం బ్రతిదినం బొక్కొక్కమృగంబుం దమయాహా రార్థంబు పనుపం దలంచి యున్నవారము. ఇందులకు మేకొని మమ్ము భయమ్మువలనం బాచి రక్షింపవలయును." నావుఁడు సింగం బట్ల కానిండని యభయం బొసంగి మృగంబుల వీడు కొలిపె. అంత నామృగసంతానంబు కొంతవంతఁ దలంగి ప్రత్య హంబు వఱువాత వంతుకొలఁది నొక్కొక్కమృగంబును సింగంబు చెంగటికిం బనుచుచుండు. ఇవ్విధంబునం గొంత కాలంబు కడవ మృగంబులెల్ల యథాసంకేతంబుగ నొక్క చెవులపోతుం బిలిపించి 'యెల్లి మృగవల్లభుపాలికిం బోవలయు వంతు నీపాలంబడియె.' నావుడు శశంబు భృశంబు మూర్ఛిల్లి కొంతవడికిం దెలిసి చెదరినహృదయంబు వదలించికొని యెంత వారికేని విధివిధానం బప్రతివిధానంబుగాదే యని తల పోయుచు దట్టంబుగ వేఁడినిట్టూర్పులు నిగుడ శిరఃకంపంబు గావించి యెడరు దొడరినతఱి యెఱుకబలిమికొలఁది వెరవు పరి కింపవల్లయుఁగాని వెఱంగుపాటు తెఱంగుగాదు. ఎట్లయిన నా బుద్ధిబలంబునం జేసి కేసరిం బ్రతారించి దొరింపం గడం గెద. అట

మీఁద దైవంబు పంచినగతి యయ్యెడుంగాక యని యచ్చటి తనబలంగంబువలన సెలవు గయికొని నడవం గాళ్లాడక యల్లనల్లం బోవుచుఁ జేయంగలయుపాయంబు రోసి మానసం బున కది సరిపఱిచికొని దారిం గొంత మసలి యాహారంబుతఱి దప్పించి డాయం బోయి సవినయంబుగం బ్రణమిల్లుఁడు హార్య క్షంబు సటాజాలంబు నిక్క వెక్కసం బగురోషంబున భీషణం బయి యదరులు చెదరం జూడ్కులు నిగిడించి "యహాహా! యస్మదీయక్షాంతికి ఫలంబు తోడన కలిగె. కుట్టినం దేలం ద్రు కుట్టకున్నం గుమ్మరపురువం డ్రుగాదె? నాకుం దఱి దప్పించి యాహారంబు పనుచుట చూడ నావేఁడిమిచవి యింకొక్క మరి చూడ వేఁడి కాఁబోలు. ఈయడవిమృగంబు లింతలో నన యింత మత్తిల్లునే. నేఁడ యిప్పాలంబునం గల జంతుజాలంబు నెల్లం జమరి సమయించి యెరియుకడుపుఁజిచ్చున ప్రేల్చెద" నని వాలంబు నేల తాడించి లేచుడు శశంబు "దేవా! తావకులగు సేవకులవలన లేశంబయిన దోషంబులేదు. నేఁటిజేపు మా వారలశాసనంబు శిరంబునం బూని యేను సరభసగతిం జనుదేర దారి నొక్కహార్యక్షంబు రూక్షంబుగ వీక్షించి, 'యోరీ శశా ధమా! యెట్టిసత్త్వంబేని మాకట్టెదుర దరవిరహితంబుగం జరింపంగానము. మాయూరే! నీ యుద్ధతింజూడ మాకుం గరంబు వెఱఁగయ్యెడు. మమ్ము జీరికింగొనక యొరసికొని పాఱుపోత రంబు నీకు రాఁగతంబేమి? నిలునిలు మెటకుం బావెద'వని యధి క్షేపించి ప్రతిరోధింప నే నాతనింగాంచి 'మాకెల్లరకు వల్ల భుండు సత్త్వసారాభిధానుండగుసింహరాజు గలండు అమ్మహా మహాునన్నిధికిం జనుచున్నవాఁడ నన్ను మసలింపకుము. అతం

డోకింత గోపగించిన లోకం బాకులం బగు.' నావుడు నతండు మధ్యందినవిద్యోతమానఖద్యోతమండలంబుం బోలె మండుచు 'నహహా! యింతకాలంబున కిట్టివింత వినంబడియె. ఇవ్వనంబు నందలి మృగసందోహంబునకు నే నొక్కరుండ దొరగాని నాకు దొర యొక్కరుండు గలండె! ఎవ్వండేని నెదిరిం దన్నుం గానక యందనిపదవికిం గంతుకొన నుంకించెనేని వానిమదీయ తేజోనలంబున కింధనంబుం గావించెద. నీ విటకు ముందు ప్రభువని పేర్కొనిన వానిం గానిపింపుము. ఇక్కడ కయ్యంబునకుం గడం గెదం జూపవేని నిన్నుం బొలియించెద' నని పలికి యట్లకానిమ్మని నన్నుం బలికించి నీపాలికిం బుత్తెంచె. దానం జేసి యింతమసల వలసె" నావిని మృగనాథుం డప్రతిరోధక్రోధుండయి యీ క్షణంబ యాదుష్టమృగంబుం గానిపింపుము. దండధరునివీటికిఁ మసలక పుత్తెంచెద. నాకు మార్గాభిజ్ఞానార్థంబు మును సనుము. నావుడు శశకంబు వినయసంభ్రమంబులు పెనంగొన వల్లెయని కడువడిం జని యొక్కబావిం గానిపించి యోమృగకులసార్వభౌమా! నీమార్తుం డీవాపికయం దున్నవాఁడు. తొంగిచూడుము మన సింగంబు తొంగిచూచి యుదకంబునందలి తనప్రతిబింబంబు మాఱుసింగం బని భావించి కోపాటోపంబు మీఱ వలంతులు మాఱు సెలంగ గర్జిల్లి గుభుల్లున దుమికి కాలధర్మంబు నొందె. కావున నెంతబలవంతునయిన బుద్ధిబలంబుచే గెలువవచ్చును.

పింగళకుం దొల్లి సేవించుచుండి కాటకపాటకంబు లను రెండు జంబుకంబులు కృతాపరాధంబు లగుటం జేసి నిష్కాసితంబు లయ్యె. అయ్యవి వెండియు తేనియనుగ్రహంబు సంపాదింపం గోరి సంజీవకు ననుసరించుచున్నయవి. ఇదియు మదీయోద్యో

గంబున కనుకూలంబయి కానంబడుచున్నయది. సెలవిమ్ము పోయి వచ్చెద నావిని కరటకుండు "వృక్షమూలంబుం జేరిన పుర్వును మెలపున మూలచ్ఛేదంబు గాకుండ వెలార్చి మాయించుట నేర్పరితనంబు. నీవెఱుంగనియర్థంబు గాదు. నీకుం గార్యంబు సిద్ధించుం గావుత మెడసేయక పొమ్ము." నావుడు దమనకుండు పింగళకునిపాలికింబోయి మ్రొక్కి మొగంబు వ్రేలవయిచుకొని దీనభావంబు భావించికొని నిలుచుండం బింగళకుండు గాంచి "దమనకా! యేల యిట్లు దెలివి దప్పియున్నవాఁడవు. మాకుం బరమాప్తుండవు. లోకంబునం దెవ్వండేని జీవింపంగోరువాఁడు నీకుం గీడు దలంపఁడు. నీఖేదంబునకు నిమిత్తంబు దెలియు నంతకు మాచిత్తం బుత్తలంపడియెడు. కొంకక వాక్రువ్వుము" నావుడు దమనకుండు "స్వామీ! మతివిహీనుండనయి మహాపరాధంబు గావించితిని. నావలనం గరుణింపుఁడు. క్షమియింపుఁడు. భృత్యుండు స్వాపరాధంబు స్వామికి నివేదింపక మొఱంగంజనదు. మొఱంగినవాఁడు రెండులోకంబులకుం గాక చెడు. అది యట్లుండనిమ్ము. పెక్కండ్రు మనుగడకు మూలం బగుపుణ్యపురుషున కొక్కరుండు వాటిల్లిన నది యొక్కటి శోచ్యంబుగాని మాదృశుండు క్షుద్రుం డొక్కరుండు పొలిసినదానం గొఱంతలేదు. దాన లోకం బస్తమింపదు. సమక్షంబున భృత్యులవర్తనంబు లెల్లం గీర్తనీయంబులై యుండుం గాని యందు దోషంబు లేశంబుం గానంబడదు. అట్లగుటం జేసి యధీశ్వరుండు స్వపరోక్షంబునం దత్తద్వర్తనంబులు చారముఖంబునం బరికించి హితాహితుల నిర్ణయించి యనుగ్రహానిగ్రహంబులు మెఱయించుచుం బ్రజావృక్షంబు

నకు మూలం బగుతన్ను రక్షించికొనవలయును. స్వామీ! సేవకుం డేమో విన్నవించెదునని యాలంబు చేయక యాలకింపుఁడు. సంజీవకుని వర్తనంబు పరికింపం దొంటితెఱంగుగాదు. అన్యాయంబు నుడువఁగూడదు. మొదల సంజీవకుని ప్రవర్తనం బనన్యాదృశంబుగ నుండె. ఆతనిచరిత్రంబునకు మే మందఱము మిక్కిలి యాశ్చర్యపడుచుందుము. ఈతండు తొల్లి యెల్ల తఱి మమ్ము నవ్యాజప్రేమంబునం గొలుచుచు మీకార్యంబులందుఁ బ్రమాదంబులేక ప్రవర్తించుచుండు. కార్యంబుతఱి నీరు వట్టని యాఁకలి యని నిద్రయని చూడఁడు. చక్కెరదిని చేఁదన వచ్చునే? తొంటితెఱంగు విచారింప సంజీవకుండు లోకంబులోనివాఁడే! ఏమికాలదోషంబో యిప్పు డీతం డాతండుగాఁడని తోఁచెడు. ఈతఁడు తొల్లి మీగుణంబులు వేనోళ్లం గొనియాడుచుండు. అప్పు డాతని నిష్కపటానందపారవశ్యంబునకుఁ గొలందిలేదు. కొంతకాలంబునకు వెనుక మాబోఁటు లెవ్వరైన మిమ్ముం బ్రశంసించుచో సత్యము సత్య మౌనౌ నని యంగీకారసూచక వచనంబులతోడనే నాలించుచు వచ్చె. అనంతరము దేవర ప్రశంపనంబువచ్చిన మందహాసంబుతో వినుచుండుగాని యట్టిట్టని వచియింపంగానము. ఇటీవల నేమికతంబో యేలిన వారి ప్రసంగంబులం దెచ్చికొలువికాసంబె కాని నిక్కంపుమందహాసంబు లేశం బయినం గానంబడకయున్నయది. ఈతనియనుభావంబు వింతయయి కానంబడుచున్నయది. దీనికిం గతంబే మొకో యని మనంబున రోయుచుండుదు. నేఁడు మదీయాప్తులు కొందఱు మాట వెంబడి స్వామిచే నిగృహీతు లగువారితో సంజీవకుండు చెలికారంబు సేయుచున్న వాఁడు. కాటకపాటకుల

తోడ నిచ్చలు మంత్రంబు నిర్వర్తించుచున్నవాఁడని వినిపించిరి. దీనంజేసి యీతనిభావంబు నిర్ణయించితి. స్వామిహితంబు కాంక్షించువాఁడు స్వప్నావస్థయందయిన స్వామిద్రోహులతోడ సఖ్యంబునకుఁ బాలువడునే?" అని నుడివి పక్క వెనుకలు కలయంజూచి కరంబున నోరు మూసికొని శ్రవణమూలంబు చేర మోరసారించి యల్లన నిట్లనియె. "ఇది దేవరసన్నిధి నున్నభృత్యులకెల్లం దెల్లంబయి యుండవచ్చు. సంజీవకునివలని భీతిం జేసి యిచ్చటివారు బయలు పొంగకున్నవారు కాఁబోలు. ఇంతయేల యొక్కనిం బిలిచి విచారించినం జిత్తంబునకు విశదంబయ్యెడు" నావిని పింగళకుం డద్భుతరోషవిషాదంబులు పెనంగొనం దన సేవకుని నొక్కనిఁ బిలిచి "యిచ్చటికొలువుడుకాండ్రే రేనింగాటక పాటకులతోడనేస్తంబు సేయుచున్నవారె?" నావుడు వాఁడు భయంపడి గుటకలు మ్రింగ "వెఱవకుము సత్యంబు వాక్రువ్వుము. దానం గొఱంతలే" దని తేఁడు వలుక విని వాఁ డిట్లనియె. "సంజీవకుండు వారిచేరికకు మేకొనియున్నట్లు కానంబడుచున్నది" నావుడు విని "మే మడిగినయర్థం బిక్కడస మఱచి పొమ్ము. బయలనుబ్బనీకుము. పొద"మని వానిం బుచ్చి పింగళకుండు ఖిన్నుండయి క్రిందు చూచుచు మిన్నకుండం గాంచి వెండియు దమనకుం డిట్లనియె. "ఇప్పటిచొప్పు పరికింప మనతోడ నింక సంజీవకుండు మనసునం గలిసి వర్తింపఁబోఁడు. అతని తెఱంగు కొంతయెఱింగినవార మగుటం జేసి మనకును దొంటిచందంబున డెందంబు పొందియుండదు. అయిన నీతండు పెద్దకాలంబు దేవరయాస్థానంబునందుండి చిత్తంబున కెక్కం బ్రవర్తించినవాఁడు. చిరకాలసేవి యగుభృత్యుండు తెలిసి తెలి

యములం జేసి యొక్కయపరాధం బొనరించిన క్షమియింప వలయుఁగాని పెఱలంబోలె వానిం ద్రోసిపుచ్చుట ధర్మంబ గాదు. కావున నీతం డింతదనుకం జేసిన దుష్కార్యం బావిష్క రించి యలుకు పుట్టించి క్షమియింప వేడుకొలిపి యిటమీఁద నిట్టికార్యంబు జేయకుమని నాతికఠినంబుగఁ బలికి యొప్పటి చొప్పున నాతనికొలు వీకొనుట సర్వవిధంబుల నుచితంబని తోఁచుచున్నయది.” అనవుడు మృగపుంగవుం డాకర్ణించి మొగం బెగయించి దమనకుని మొగంబునం జూపులు వోలయ నించుక మనంబునం బరికించి “రాజద్రోహుల నెల్లవిధంబుల దండించుట యుచితంబు. అయినను నాహృద యంబు వానివలన బహుకాలంబు స్నిగ్ధం బగుటం జేసి యొక్క తెగువకుం జొరదు. కావున వెలార్తమొండె; నీ చెప్పినచొప్పు గావింతమొండె.” నావుడు నక్కలరాయం డిట్లనియె. “ఇది యిప్పటికిం దోఁచిన తెఱంగు. అయినను సాహసంపడి యొక్క కార్యంబు చేయం జనదు. ‘సహసా విదధీత నక్రియా’ మని నీతి కోవిదులు వక్కాణింతురు. ఇది మఱియెవ్వనితోడ నేని నొక్క ధీమంతునితో దేవరచిత్తంబునకు వచ్చినవానితో విచారిం తము. అప్పటికి దేవర కుచితంబని తోఁచినయర్థంబు మేకొందము. దూరంబు విచారించి చేసినదానం గొఱంతలేదు. ఇంతలోనన మిగిలి చనుకార్యం బేదియుఁ గానము.” నావుడు మృగపతి “యిందలివారందఱు నీవెఱింగినవారుగాని లాఁతులు లేరు. వారి వారి బుద్ధికౌశలంబులు నీ వెఱుంగుదువు. నీయిచ్చకు వచ్చిన వానిం జెప్పుము’ నావిని దమనకుండు కొండొకవడి తెప్పలిడక యుప్పరంబు చూచి మరల మృగరాజుం గాంచి ‘మదగ్రజుండు

కరటకుండు ప్రజ్ఞావంతుండు. దేవరహితంబు గోరువాఁడు. అతండు చిత్తంబునకు వచ్చునే నిప్పుడ రప్పించెద' నని చెప్పి యొప్పించి యొక్కరాజభటునిం బుచ్చి రావింప గరటకుం డన యంబు వినయంబు మెఱయ వందనంబు గావించి మృగస్వామిచే ననుయుక్తస్వాగతుం డయి తదాదిష్టం బయిన యుచితాసనంబునం గూర్చుండ నతండు దమనకుం జూచి 'యావృత్తాంతంబు ససాకల్యంబుగ నీతనికి వినిపింపు' మనవుడు దమనకుండు కరటకునితోడ సంజీవకుని భూతభవంతివర్తనంబులును తేనికిం దనకు నందుల కయిన సల్లాపంబును వినిపించి 'యిం దవసానంబున మదుక్తార్థంబును తేనివచనంబును వింటివిగదా! ఇందు నీకుంబోలిన యది వాక్రువ్వుము.' నావుడుం గరటకుండు కొండొకమనంబునం బరికించి దమనకుం జూచి "తేనిరొఱుంగని యర్థం బొక్కండు లేదు. కార్యాకార్యంబులు నిర్ణయింప మన మెంతవారము? అయిన నమాత్యపదంబున నున్నవార మగుటం జేసి యవసరంబునం దోఁచినయర్థంబు విన్నవింపక మిన్నకుండం జనదు. అంతరం బెఱింగి రాజద్రోహంబు గావించినవానిని సర్వవిధంబుల వెలార్పంజనదు. వెలార్చిన, వాఁడు పగఱంగూడి పగ సాధింపం గోరుఁగాని తనచేసినదోషంబు పరికింపంబోఁడు. మన కప్పుడు గోరం బోవుపని గొడ్డటం దీర్పవలసివచ్చును. కావని యొప్పటిచొప్పునం గలిపికొని వర్తింతుమేని బూర్వం బొక్క మది యొడకు వొందింపఁగడంగి పెఱ లెఱుంగుటవలన విఫల మనోరథుండగువాఁడు వెండియుం జేయునుద్యోగంబు ఫలానుమేయంబై యుండు. అట్టివానిం జేర్చుకంటెం గీడు వేఱొండు గలదె? అధీశుండు తనకు నపాయంబు రోయుభృత్యునుపే

క్షింపంజనదు' నావుడుం బింగళకుండు "కరటకా! నీవు
వాక్రుచ్చినయది సత్యంబు. అయినను జిరకాలసఖ్యంబునం జేసి
వానిం గొండొక కీడునకుఁ జొప్పింప మనం బొప్పదు. నేనేమి
చేయుదు?" నావుడుం గరటకుం డిట్లనియె. "ఆరోగ్యంబు గోరు
వాఁడు చికిత్సకునివలన నౌషధంబుంబోలె శ్రేయంబుగాం
క్షించు నాయకుండు భృత్యునివలన హితం బవశ్యంబు
గ్రహింపవలయు. దేవరకుం దెలియని యర్థం బొక్కండు లేదు.
కొండొకదవ్వు పరికించినం గర్తవ్యంబు చిత్తంబునకుఁ దేటపడి
యెడు. నీతికోవిదుఁ డగు భూవల్లభుం డుపధాశుద్ధుం గొలు
వున కైకొనవలయుఁగాని తక్కు తెఱంగయినం బర్యవసానం
బునఁ దప్పక ముప్పు వాటిల్లు. ముందు మందవిసర్పిణి యను చీర
పోతు డిండిమం బనుమత్కుణంబుతోఁ గొలఁది తెలియక సాహా
సంబున కైకొని హానిం జెందె. అక్కథ వినిపించెద వినుండు.

మందవిసర్పిణి యని యొక్కచీరపోతు గలదు. అది తడ
వులంబట్టి యొక్కనృపాలునిపర్యంకంబుఁ జేరి మెలంకువమీఱ
వసియించి జీవించుచుండు. అంత నొక్కనాఁడు డిండిమం బను
మత్కుణంబు తత్పర్యంకంబున కరుదెంచిన మందవిసర్పిణి
యెదురుసని కొనివచ్చి యాతిథ్యం బొనరించి కుశలం బడిగి
యిచ్చటికి వచ్చినప్రయోజనం బేమని మందలింప మత్కుణం
బిట్లనియె. 'పరమమిత్రంబ వగు నిన్నొకయర్థం బర్థింప వచ్చితి.
నీయనుగ్రహంబు గలిగిన నామనోరథంబు వ్యర్థంబుగాదు'
నావుడు మందవిసర్పిణి యిట్లనియె. 'నాకుం బ్రాణసమానుం
డవు. నీయభీప్సితంబు మదాయత్తం బొకండు గలిగిన దాని కింత
ప్రార్థింపవలయునే? నీ కీరానియర్థం బొక్కండు నాకుం గలు

గదు.' నావిని డిండిమంబు సంతసించి యి ట్లనియె. 'తడవుల నుండి నానామానవసంతానశోణితంబు లానియున్న వాఁడంగాని మానవనాథుమేనిరుధిరం బేనాఁడేని నెఱుఁగ. శాల్యోదనంబును హైయంగవీనంబును మధురసూపంబును సారతరశాకంబులును రుచ్యంబు లగుభక్ష్యంబులును నానాఫలంబులును రసాయనం బులును వివిధమాంసంబులును గోక్షీరంబులును మద్యంబులును నానావిధోపదంశంబులును బిచ్ఛిలదధియును శర్కరయుఁ బుల కండంబును గంధోదకంబులును లోనగు మంచిపదార్థంబు లను భవించుచు నెండకన్నెఱుంగని రాజులమేనిరక్తంబు కరంబు స్వాద్యం బయియుండునని విందు. ఈతలిమంబునందు నాయును కున యీకొంటవేని నాకోరిక నెఱవేఱును.' నావృకుం మంద విసర్పిణి మోమాడి మాటాడక యి ట్లనియె. 'వెరవెఱింగివేగిర పడక మయిమఱచి కూరుకుసమయంబు వేచి ఱేనిమేని మెల్లగం గఱచి నల్లఁ బీలిచికొని మెలంకువతోడం దొలంగి చనవలయు.' నావిని డిండిమంబు 'నీచెప్పినయట్లు మెలంగెద' నని పలికి చీర పేనితో మిక్కిలిమైత్రి యొనరించుచు నాశయ్య వసియించి తను పెల్లిదం బాఁపంజాలక ఱేఁడు పడకం జేరి కూరికి కూరుకక మునుప చేసం బాటి కొఱుకుడుం బుడమిఱేఁ డులికిపడిలేచి సీత్కారంబు గావించుచుం బాదసంవాహనంబు సేయుపరి చారకుం గాంచి 'యోరోరి! తేలు గుట్టినట్లు కరంబు నాశరీరం బెరిసెడు. సత్వరంబుగ దీవియ చేరం దెమ్మ'ని పలికిన దివ్వియ దెచ్చునంతలో మత్కుణంబు దూరంబుగ సురిఁగినం బరిచార కులు శయనంబు నలువలంకులు కలయం బరికించి యొక్కపక్క నెరసువలెం బానుపుం గఱచికొనియున్న చీరపేనిం జూచి

'యిదియె తేనిం గఱచె'నని వారు దానిం బొలియించిరి. కావున స్వరూపం బెరుంగక పరునిం జేకిచినవాని కవశ్యము హాని సంభవించును."

అనిన విని పింగళకుం డిట్లనియె. "నాదువిక్రమంబు జంతు సంతానంబులకు మృత్యుప్రాయం బని లోకవిశ్రుతంబు సంజీవకుండు నాపయి నెత్తుట కాలాగ్నిపై నుఱుకుట గాదె? అయిన ని న్నడిగెద. సంజీవకుండు నాకు నేమెుపునం గీడు రోయం గలండు" నావిని కరటకుం డిట్లనియె. "క్షుద్రుండయ్యుం జిరపరిచయంబుచే జాతమర్మం డగువాం డెంతవానినేనిం దఱి వేచి సాధించుట సుకరంబై యుండును. ఏవారికేని నొకప్పుడు గాకుండిన నొకప్పుడు ప్రమాదంబు వాటిల్ల కుండునే? నీతి కోవిదుండు శాత్రవుని క్షుద్రునే నొప్పరికింపం జనదు" నావిని పింగళకుండు కొంత చింతించి "మన మీమంత్రంబుతోడన కార్యంబు నిశ్చయించి సంజీవకు నొక్కకీడునకు లోపఱచితి మేని లోకంబు మనల నిందించుంగాని లోగుట్టు తెలియంజాలదు. లోకాపవాదంబునకు భయంపడవలయును. ఇంతియ కాదు. ప్రకృతివర్గం బవిమృశ్యకారి యగుతేనియందు విరక్తింబొందు. దానం జేసి సర్వశ్రేయంబులు చెడును. కావునం దుదకుందోంచిన యొక్క యర్థంబు వక్కాణించెద. దమనకుండు సంజీవకుపాలికిం బోయి వానితోడ నిట్లు వాక్రువ్వవలయు. 'నీవు రాజద్రోహులతోడం జెలికారంబు చేయుచుంట తేం డెఱింగిన వాండు. కరంబు కుపితుం డయియున్నవాండు. అయిన నతండు దీనవత్సలుండుగావున నీవు నావెంబడిం జనుదెంచి నిజాపరాధంబు నివేదించి ప్రార్థించితివేనిం బ్రసన్నుం డగు' నని వచియిం

ధ్రువము. మనచే నయినంతదనుకం గలుపుకోలుఁదనంబునక కడం గుదుము. 'నీచాః కలహ మిచ్ఛన్తి సన్ధి మిచ్ఛన్తి సాధవః' యని ధర్మజ్ఞులు వచింతురుగాదె? ఊరక వేఁటిమికయి యాడికొంట కెంతసేపుపట్టు? మనము ఋజుమార్గంబునం బ్రవర్తింతము. సంజీవకుండు నీవచనంబులకు ననుకూలుం డయివచ్చెనేని మే లొందెదు. తక్కినం దత్ఫలం బనుభవించెదును.' అని పలికి దమ నకుం జూచి "నీవు పోయిరమ్ము. మన యిక్కడి తక్కినవచనంబు లేవియుం ద్రవ్వకుము." నావుడు దమనకుండు వల్లెయని యల్లల్లం జని యాననంబున దీనభావంబు గదురం బదంబులు దొట్రిల డాయం బోవ సంజీవకుఁడు గాంచి ప్రత్యుత్థానం బొనరించి యుచితాసనంబునం గూర్చుండంజేసి తదనుభావంబు నకు నిమిత్తంబు మానసంబునం బరికించుచు "మీయందఱకుం గుశలంబె" యనిన దమనకుండు విని "పరాధీనవర్తనులకుం గుశలంబున కెంతయంతరంబు? రాజసేవాపరుండు మృత్యుగ్రస్త తుల్యుండు. తేనిమచ్చిక నచ్చికయిడి పెద్దకాలంబు సుఖియింపం గాంక్షించువాఁడు మృగతృష్ణికాప్రవాహంబుం గాంచి యుద న్యాపనోదనంబునకయి ప్రధావించువాఁడు గాఁడె? ఏకతంబున నేని తేనిసాకతంబునకు మోఱకుతీరున ధీరుండు మోసఁబోం దఁడు." నావిని గోవల్లభుండు "నీవచనభంగి విచారింప నేదియో యొక్కవిశేషంబు గలుగంబోలునని తోఁచెడు" ననుచు నేకాంతకాంక్షాసూచకంబుగం దనయిరుపక్కియలుం బిఱు చక్కియు నాలోకింపఁ బిఱిఁది దెస నున్న కాటకపాటకు లల్లన లేచి యెడగలుగంబోవుడు దమనకుండు వారిదెస యపాంగ వీక్షణంబున సూచించుచు "వీరలఁ జేరుచుటయె నీయిదుమకు

మూలంబయ్యె" నావుడు సంజీవకుండు భయాధీనమానసుం
డయి "యచ్చట జరిగినవృత్తాంతంబేమి" యని యల్లన నడిగిన
దమనకుం డిట్లనియె. "చేలెఱుంగనిపాటు వడియెదవు. కొటక
పాటకులు రాజద్రోహులని యెఱింగియుండియు వారలతోడ
సఖ్యంబు చేయుచున్నవాఁడవు. ప్రభువునకె కా దెవ్వరికయిన
నిది యనుచితం బని తోఁపకుండునా? ఈయర్థంబు పార్థివుం
డెఱింగి దుర్వారక్రోధభీషణుం డయియున్నవాఁడు. తొల్లి నా
వచనంబునందు విశ్వాసం బిడి తేనిపాలం జేసితివి. కావున నున్న
రూపు వచియించెద వినుము. సంజీవకుపక్షం బవలంబించి
మత్సన్ముఖంబున వసియించువారి నెవ్వరి నేనిం దత్క్షణంబ
కృతాంతనిశాంతావేశితులం జేసెద నని హర్యక్షాధ్యక్షుండు
కరంబు క్రూరంబుగ సంగరం బొనరించి యీక్షణంబ సంజీవకుం
దోడ్కొని రమ్మని నన్నుఁ బుచ్చినవాఁడు. మీఁదికార్యంబు నీ
యిచ్చవచ్చినట్లు గావింపుము. ఈయనర్థం బూరక పుట్టదు.
చేరువం జేరి యెవ్వరో చెవిగఱచెదరు. వెండియు నిట్టివి యేమి
పుట్టెడునో యెఱుంగము. నేఁడు నీ కయినయది తేపు మా
కయ్యెడు. అతీతకార్యంబునకు విచారంపడ నయ్యెడుఫలంబేమి?
ఎన్నండు తేనికి బానిసతనంబునకుం బూనికొంటిమి నాఁడె
మృత్యువునోరం జొచ్చితిమి. ఇందులకయి యిప్పుడు వగచుట
గతజలసేతుబంధనంబు." అని నిట్టూర్పు నిగిడించి ఖేదవిషా
దంబు లభినయించువాఁడు క్రిందుచూచుచు మిన్నకుండ సంజీ
వకుం డవ్వచనంబు వజ్రపాతం బహోర్యంబునట్లు ధైర్యసారం
బగలింపం గొంతవడి వెఱపెల్లిదంబున నివ్వెరపడియుండి యెట్ట

కేలకు హృదయంబు పదిలించికొని దమనకుం గనుంగొని యిట్లనియె.

"అనారతంబు తేనికి లగ్గు దలఁతుంగాని యెగ్గు గలయం దయినం దలంచి యెఱుంగ. లాఁతివారికయిన నొకయొప్పము గావింప మనంబు చొప్పడియుండునే! అకారణంబుగ తేని కిట్టి బెట్టిదంపుఁ గ్రోధంబు పుట్టించి సాధువులం జెఱుప నొడిగట్టిన పుణ్యాత్ములా బ్రహ్మకల్పాంతంబు మనియెదరుగాఁబోలు! సర్పంబు లకు విషంబుంబోలె ఖలులకు దోషంబు సహజంబు. వారిం జెప్ప నేల? తేనియవివేకంబ సర్వానర్థంబులకు మూలంబు. పార్థివుం జెడ్డనె ననినం గొట్టంబునం గట్టింపు మనువాఁడయ్యెనేని లెంకలు కొంకుమాని యిచ్చకు వచ్చినట్లు తేని నకార్యంబులకు లోఁచి యశోహానిం బుట్టించి పరలోకదూరుం జేయుదురు. ఇంతకాలంబు పార్థివు ననుగ్రహంబు సంపాదింపఁగోరి నాపడినపాటులెల్లం బొల్ల యయ్యె. వివేకవిరహితుం డగుదొరం గొలుచుట నిష్ఫలంబగుట మాత్రంబుగాదు; ప్రాణహానియు నాపాదించు. మనోవాక్కర్మం బుల నొకప్పుడయిన నీషత్తయిన దోషంబుచేసి యెఱుంగ. సంత తంబు స్వామికి క్షేమంబ కాంక్షింతును. అట్టి నా కిప్పుడు మృత్యువు వక్త్రబిలంబు చొరవలసివచ్చెఁ గాదె? అన్యులకు నెన్నండును గీడురోసి యెఱుంగను. నాకొరుఁడు సెరగువెర కునె యనంజనదు. రాగద్వేషదూషితాత్ములమానసంబులు సాధు వులయందును వికృతిం బొరయును. తొల్లి కాకవ్యాఘ్రజంబుకం బులు పరమసాధు వగులొట్టియం గపటోపాయంబుఁ బన్ని తమ స్వామియగు సింగంబుచేఁ ద్రుంగించె" నన విని దమనకుం డాకథ ససాకల్యంబుగ వినిపింపు మనిన సంజీవకుం డిట్లనియె.

"మలయం బనునుపత్యకావిపినంబున దర్పసారంబను కంఠీరవంబు గలదు. దానిం గాక వ్యాఘ్ర జంబుకంబులు మంత్రులయి కొలుచుచుండును. అవి యొక్కనాఁడు గహనంబున విహరించుచు నొక్కయుష్ట్రంబుం గాంచి 'నీనామం బేమి ? నీ వెక్కడనుండి వచ్చెదవ'ని యడిగిన నాక్రమేలకం బిట్లనియె. 'వర్తకుం డొకండునామీఁద ననారతంబు మహాభారం బెక్కించి మోపించుచుండును. ఇట్లు పెద్దకాలంబు భారవహనక్లేశంబు సహింపం జాలక వానిమొఱంగి యీయరణ్యంబునకు వచ్చి డాగియున్నవాఁడను. ఈశార్దూలవల్లభుండు లోకభీకరుండు. మీరు మహాప్రాజ్ఞులరు. మీయనుగ్రహంబు వడసి త్రాసంబు వాసి మనువాఁడ. నాకు మీరు దక్క వేఱుశరణంబు లేదు. శరణాగతరక్షణంబు సర్వధర్మంబులం దుత్తమంబని ధర్మవిధులు వక్కాణింతురు.' నాఁవుడు జంబుకం బిట్లనియె. 'ఈయరణ్యంబునందు మృగరాజొకరుండు గలఁడు. అతండు ప్రతీపప్రతాపదీపనిర్వాపణమహాబలుం డగుమహాబలుండు. మే మాతనిభృత్యులము. నీవు తద్దర్శనం బవశ్యంబుగం జేయుము. మావలన నయినయంత యుపకారంబు గావించెదము. నీకు సర్వంబు మేలయ్యెడు వెఱవకుము. మావెంట రమ్ము.' నావిని మహాంగం బంతరంగంబునం బొంగి వానిపిఱుందం జనుడు నయ్యవి మృగనాథుపాలికిం బోయి యథాశ్రుతంబుగ దానివృత్తాంతంబు సాంతంబుగం జెప్పి మృగపతికిం దోఁచి మ్రొక్కి మనుడు సవినయంబుగ మ్రొక్కి నిలువంబడియున్న వాసంతంబుఁ గాంచి పంచాస్యంబు కృపాయత్తచిత్తంబయి యభయం బొసంగి కొంతదడవు సల్లాపంబు గావించి 'నీకమాత్యపదం బొసంగితిమి. మాపూర్వ

మంత్రులతోడం గూడి నైకమత్యంబు వడసి యస్మత్కార్యం బులు నిర్వహించుచు సుఖంబుండుము.’ నావుడు సుస్త్రంబు మహాప్రసాదంబని తదుక్తప్రకారంబునం బ్రవర్తించుచుండె. పెద్ద కాలం బివ్విధంబునం బ్రవర్తిల్లుడు నొక్కనాఁడు సింహంబు మంత్రులతో నిట్లనియె. ‘నాకిప్పుడు వ్యాధికతంబునం దేహం బునం బాటవంబులేక యున్నయది. అరణ్యంబున సంచరింపం జాలను. ఆరోగ్యంబుగలిగి కొంత సత్తువవచ్చి నడయాడునంత దనుక నాకాహారంబు సంపాదించి తెచ్చియిండు.’ నావిని వాయ సాదు లిట్లనియె. ‘స్వామీ! మేము క్షుద్రులము. మీకు వలసి నంత యాహారం బొకపూఁటకయినం దెచ్చి యిచ్చునంత వారమె? మీపాదచ్ఛాయనుండి మీరారగింప మిగిలినది భుజి యించి జీవించుచున్నవారము. మాసత్త్వంబుకొలంది దేవరకుం దెలియనిదికాదు.’ అనవుఁడు మృగేంద్రుండు వారిం జూచి దొరకినంతయె కానిండు. తోడెంబుతోడనె ప్రొద్దుపుచ్చికొని యెద నేనేమి చేయుదు? నాపురాకృతకర్మంబు వ్యాధిరూపం బున నన్ను బాధించుచున్నయది కొంతపాటినడయాడుటకు శక్తియుండిన మిమ్ము శ్రమంపఁజుపను. జంపుమాని కానకుం జని యే యెఱచియయిన దొరకినంత కొనిరండు. పొండు.’ అని శాసింప మాఱుపలుక వెఱచి యాజంతువులు వనంబునకుం జని యెల్లప్రదేశములం గ్రుమ్మరి యుఱ వగు నెరదొరకమిం గ రంబు నిర్వేదించి చెఱియొక్కదిక్కునకుం జెదరిచని వెదకుచుండ నండజపుండరీకజంబుకంబు లొక్కచక్కటిం జేరుడు బలి భుక్కు తక్కువానిం గనుంగొని ‘మీ రెంతమాత్రంబేని బల లంబు నేకరించినజాడగానము. మీయంతవారి కసాధ్యం బగు

కార్యంబు క్షుద్రంబగుపక్షికి సాధనం బగునె? మధ్యాహ్నం
బయ్యె. ఇంకం గ్రుమ్మరిన దాన వ్యర్థాయాసంబుకాని ఫలంబు
లేదు. వాఁడు మనరాక వేచియుండును. ఆతనిపాలికిం జెనఁటి
చేతులం జనదు. మన మింతకాలంబు వాఁడు తెచ్చియిచ్చిన
మాంసంబు బరు లుబ్బ భుజియించి కాలు గదలింపక నిశ్చింతంబుగ
నుండితిమి. వాని కొక్కయిక్కట్టు వాటిల్లినతఱి నొక్కపూఁట
కయిన గ్రాసంబు దెచ్చి యీనోపమేని మనభృత్యభావంబు
గాల్పనె? ఇప్పుడొక్కచొప్పునాడెందంబునకుం బొందుపడి కానం
బడియెడి. దాని విని మీకుం బోలినతెఱఁగు గావింపుఁడు' అని
నలువలంకులు కలయ విలోకించి మఱికొంత చెంతకుం జరిగి చెవి
డాసి యిట్లనియె. 'మన మీలొట్టియను సరిపెట్టి నేఁటికి వాని
కార్యంబు జరిపితిమేని వాపుపోలినయట్లు చూచుకొందము.
వాఁడుపయోగింప శేషించిన యామిషంబు మనము కొన్నిదినంబు
లనన్యాపేక్షంబుగ భక్షింపవచ్చును.' అన విని జంబుకం బిట్లనియె.
'మనయధీశ్వరుండాక్రమేలకంబు నమాత్యపదం బొసంగి కరంబు
గారవించుచున్నవాఁడు. మనము దానికొక్కయపాయంబు
గావించితిమేని మానసంబునకు నొవ్వుపుట్టించి దవ్వగుదుము
కావున నీచెప్పినచొప్పు చొప్పడదు' అన బలిభుజం బిట్లనియె.
'క్షుధాబాధితుండు కృత్యాకృత్యంబు లారయంజాలఁడు. స్వజన
హననంబున కయినం బాలుపడుంగాని యిది యకృత్యంబని తలం
పఁడు. వ్యాళియుశార్దూలియు నిజాండశాబకంబులక్షుధాబాధం
జేసికాదె భక్షించెడు?' నావిని వ్యాఘ్రం బిట్లనియె. 'క్షుధితుం
డయ్యుఁ దద్ధననంబునకు మృగనాథుండు పాల్పడినం గానిమ్ము. మన
కది కార్యంబుకాదు. మన మాతనిసమ్ముఖమునకుం జని మొఱఁ

గక మనపడిన తెఱంగు నివేదింతము. తదనంతరకర్తవ్యం బాతం డును మనమును గలిసికొని విచారింతము.' అనిన వల్లెయని లేచి చనిక్రమేలకంబుచనుదేరకమున్న తారు మృగరాజుఁగాంచి 'స్వామీ! యేమి చేయుదుము. తిరుగరాని చోట్లెల్లం దిరిగితిమి. పడరానిపాట్లెల్లం బడితిమి. ఇన్నిపాట్లు పడినదాన ఫలంబేమి? సర్వదా కరుణోదారుండవయి మాభరణరక్షణంబులు స్వకృత్యం బులుగనిర్వర్తించు దేవరకు మావలన నావంతయయినఁ బ్రయో జనంబు లేదయ్యె. అయినను మావిన్నపం బొకండు గాదనక యవధరింపుఁడు. దేవరవా రాఁకలిచే మిక్కిలి వాడంబాఱి యున్నవారు. మాలోపల నొక్కనిం దమగర్భంబుఁ జొప్పించి ధన్యుం గావింపుఁడు.' అనవుడు మృగనాథుండు హరిహరి యని చెవులు మూసికొని 'యెంతమాట వినవలసివచ్చెను! చిరకాలంబు మిమ్ము రక్షించి యిప్పు డొక్కనాఁటి యాహారంబుకయి మీ కొక్కకీడు దలంచితినేని లోకంబునవారు నన్ను నిందింపరే? పర లోకంబునకుం దూలంగనె? ఇట్టిమాటలు తలపెట్టకుఁ' డన జంబు కంబు కాకంబుం గాంచి 'నీవు సైకంబవు. నిన్నుపయోగించుట వలన జేనికిం కడుపుఁజిచ్చుదుగంబోదు తొలంగుము. నామేను జేనికి భోజ్యంబుచేసి కృతార్థుండ నయ్యెద'నన విని శార్దూలం బిట్లనియె. 'కాకంబుకంటె నీవు కొంత పెద్దజంతువవైన నాతని యాఁకలి పోకార్చనీనంజూడుం జాలదు. నేను రాజునకు భోజనం బయ్యెద' ననిన వెండియు జంబుకం బిట్లనియె. 'నీవు లావుగలవాఁ డవు. నేఁడు గాకున్న జేపైన జేనిం బోషింప వలంతివి. నీ యనంతరము మేముండినం గొండొకయేనిం బ్రయోజనంబు లేదు. కావున నీవచనంబు గ్రాహ్యంబుగాదని కుమ్ముసుద్దులాడు

చుండఁ జిత్రవర్ణుండు సను దెంచి తద్వృత్తాంతంబు సాంతంబుగా వారివలన విని 'యూరక యేల పొలువోక పెనంగెదరు ? నే నిక్కార్యంబునకుఁ జాలియున్న వాఁడ. నామనుగడవలన తేని కొక్క ప్రయోజనంబులే' దనిన జంబుకంబు తేనింగాంచి 'యీ కార్యంబు నాకుం బోలియున్న యది. ఇందుల దేవరకు దురితంబు లేదు. శరీరరక్షణంబు పరమధర్మంబు. శరీరంబుగలిగిన నెల్లధర్మంబులు సాధింపవచ్చు. 'శరీరమాద్యం ఖలు ధర్మసాధన' మ్మని ప్రాజ్ఞులు వక్కాణింతురు. భృత్యుండు స్వామికార్యహతప్రాణుం డయ్యెనేని నాకలోకసుఖం బనుభవించును. ఇంతకంటె నొండు శ్రేయంబు గలదె ? మీరొల్లకుండిన మేమెల్లరు ప్రాణంబులు దొఱంగెదము' నావుడు మృగనాథుండు చిత్రవర్ణునియాననం బవలోకింప 'జంబుకరాజు చెప్పినచొప్పు దప్పదు. సంశయింపక నాచెప్పినచొప్పు గావించి నన్ను ధన్యుం జేయుము' నావుడు నెట్టకేలకు క్షుధాబాధ దుస్సహం బగుడు మృగేంద్రంబు లొట్టియం జంపి భక్షించెను.

ఎట్టివానితోడనేని నవీనసేవకునితోడ రాజును దద్భృత్యులును మనంబునం గలసియుండరు. క్షుద్రజనపరివృతుం డగుపరివృఢుండు దంవశూకసందోహపరివేష్టితపటీరవిటపివడువున సమాసన్నజనంబులకు దెప్పరంపుముప్పు పుట్టించును కావున నట్టి నిన్నే వారుం జేర వెఱతురు. దీనికిం దార్కాణంబుగ నొక్కకథ వక్కాణించెద వినుము.

ఒకానొకపట్టణంబునం దొకవడ్లంగి గలఁడు. వాఁడు నానాడు వనంబునకుం జని తనపనికి నుఱవగుతరునికరంబు నఱికి స్తంభాదికంబు లొనరించి పురంబునకుం గొనివచ్చి విక్ర

యించుకొని జీవించుచుండు. వాఁ డొక్కనాఁడు కాననమ్మునం గ్రుమ్మరువాఁడు సుహృద్విలోచనం బనుపంచాస్యంబుం గనుం గొని భీతచేతస్కుండయి నిశ్చేతనుండుంబోలె నిలువంబడియుండ నాహార్యక్షుంబు వీక్షించి కృపాతరంగితాంతరంగంబయి యిట్లని యె. 'హా స్తిమస్తకవిదళనఖరంబులు మన్నఖరంబులు; మ్రొక్కెడువారలగుట దయనీయులగుభవాదృశులపయిం దెగవు. బెగడు వడకుము' నావాఁడు సాఁగిలంబడి మ్రొక్కి పెక్కుభంగుల నా సింగంబుం బ్రస్తుతించి మొదల గొనిచని యదిమొదలు కృతజ్ఞుం డయి నానావిధంబులగు మధురాహారంబులు దెచ్చియిచ్చి తనుపుచుండు. ఇట్లు కొన్ని దివసంబులు సన నొక్కనాఁడు మెగం బులతేఁడు తనయనుచరంబు లగుకాకజంబుకంబులతోడ ముచ్చ టలాడుచుండ నవియిట్లనియె. 'దేవరవారు కొన్ని దినంబులనుండి వేఁటకుఁ బోవం గానము. కారణంబు దెలిసినదికాదు' నావిని మృగనాథుం డిట్లనియె. 'రథకారుం డొక్కరుండు మదీయ భక్తుండు గలఁడు. వాఁడు ప్రతిదివసంబు నా కాహారంబు తెచ్చియిచ్చుచున్నవాఁడు.' నావిని కాకజంబుకంబు లిట్లనిగె. 'మీకిట్టియుపకారం బొనరించు పుణ్యుంపు సజ్జనాగ్రగణ్యుండు గాఁడె? దేవరయనుగ్రహంబు గలిగిన నాతనిసందర్శనంబునం జేసి మానేత్రంబులు సాఫల్యపాత్రంబులు గావించెదము.' నావిని మృగవల్లభుం 'డట్లకానిం డాతండు కొండొకతడవు నకు రాఁగలండు. వేచియుండుం' డని పక్షికి యొక్కయెడ వాని తోడం గూర్చుండియుండ నావడ్లంగి చనుదెంచి కాంచి భీత చేతస్కుండయి సత్వరంబుగ నేదిష్టపాదపంబు నారోహించిన సింగంబు డాయం బోయి 'యోయిచెలికాఁడా! యేల యీ

పాదపంబు నధిరోహించితివి?' నావుడు 'నన్వర్థాభిధానంబు లగునరిష్ట వంచకంబులు భవత్పార్శ్వచరంబు లగుటం జేసి వృక్షంబు నారోహించితి. దుష్టపరివృతుండగు రాజును సర్వదా విశ్వసింపం జన'దని వచియించి యచ్చటం గదలక వేచియుండి యొక్కచనుప చనుదేర దానిం గూడి యయ్యరణ్యంబు వెడలి చనియె.

సజ్జనుండయ్యు దుర్జనులతోడి సంసర్గంబునం జేసి దుర్జనుండు నాఁబడు. బకోటరఘాటంబుతోడ వసియించు హంసంబును బకం బండ్రుగాదె? భూనాథుండు సాధుచరిత్రుం డయ్యేనేఁ బ్రకృతివర్గంబు నట్లగు. 'యథా రాజా తథా ప్రజా' యని నీతికోవిదులు వక్కాణింతురు. తేనిపాల నెవ్వండో ఖలుండు కల్ల నిజంబులు విపరీతంబులుగం బలికి యాతనికి నాయం దప్రతిరోధం బగుక్రోధంబు పుట్టించినవాఁడు. మించినకార్యంబునకుఁ జింతించి ఫలం బేమి? ఊరక మరణంబు నొందనేల? రణంబు గావించి లబ్ధవిజయుండనయి యశోలక్ష్మిలం బడసి యిష్టసుఖంబు లనుభవించెద నొండె, వేఱొండయిన శూరలోకశ్లాఘ్యుండనయి నాకలోకభోగంబు లనుభవించెద నొండె" నావిని దమనకుండు "నీవు చెప్పినయది శూరలోకశ్లాఘనీయంబ. అయిన నుపాయాంతరంబుచేఁ బగఱ సాధింపనొండెఁ దప్పించికొని తొలంగ నొండెఁ గొలంది గాని యెడం గడయుపాయంబు సమాదరణీయంబుగాని సాహసంపడి రణమరణంబు శ్రేయం బని కడింది మార్తురతో నొరసి యుసురుఁదొఱంగుట ధర్మంబు గాదు. 'జీవ న్భద్రాణి పశ్యతి' యనువచనంబుఁ బాటింపవలదె? తనతరంబుం బగఱతరంబు నెఱింగి కరంబుజయంబు నిశ్చయించు

కొని మార్గాన్వలయు. విపరీతంబయినం బరాభవంబు తప్పదు. తొల్లి సముద్రుండు కరం బౌరయక యొక్కటిట్టిభంబుం బరాభవింపంబూని తాన పరాభూతుండయ్యె. అయ్యది సవిస్తరం బుగ వివరించెద నాకర్ణింపుము.

పారావారంబుతీరంబున మహీరుహంబుమీఁదం దీతు వొక్కండు గూఁడు పన్నికొని తనచేడియంగూడి వసించు చుండు. అంతం గొంతకాలంబున కాశకుంతంబు తనకాంత గర్భ శ్రాంతకావుటం గాంచి సంతసించి 'నీయిష్టంబు వేఁడు మది యెట్టి కడిందిదైన నాగట్టికడిమి మెఱసి తెచ్చియిచ్చెద.' నావుడు నా పులుఁగుఁజెలువ తన చెలువునితో నిట్లనియె. 'నాయభిమతం బొక్కండు గలదు. వక్కాణించెద నవధరింపుము. పర్వదివసం బుల సముద్రుండు సముత్తుంగరంగత్తరంగంబులు చెలంగ నింగి ముట్టి పొంగివచ్చును. మనయావాసంబు కరం బాసన్నంబగుటం జేసి నాయిడినయండంబులు కాండాక్రాంతంబులగు. వేఱంబ పోలిన యిరవు పరికించికొని చనవలయు. మసలంజనదు; ప్రసూతి సమయంబు డాసిన దేశాంతరగమనంబు సుకరంబుగాదు.' నావుడు నావిహంగంబు తనయంగనపలుకు లాలంబుచేసి మంద హాససుందరవదనంబుతోఁ గువలయనివహంబునకుఁ దుహిన కిరణుండును బుండరీకషండంబునకుఁ జండభానుండును జాతక వ్రాతంబునకుం జీమూతంబు నెట్లట్లు శకుంతసంతానంబునకు నాగాంతకుండు ప్రభుండు. అతండు నిజపక్షవిక్షేపజాతవాతో ద్ధూతకాండకాండచండబలుండు. తదాశ్రయుల మనల నీజడా శయుండు చెనకి మయిమయిం బోవనోపునే? ఏల ఝాలీల నాతరం బెఱుంగక కొఱమాలినవిచారంబులం జిత్తంబు హత్తిం

చెదు. సమాహితచిత్తంబున నుండుము.' నావుడుం డిట్టిభి యి ట్లనియె. 'ఎట్టివాఁ డయిన భావ్యనర్థంబునకుం బ్రమాణకం బగు సాధనంబు పరికించి కృతనిశ్చయుండయి యుండవలయుఁగాని బలదర్పంబునం బ్రమత్తుండయి కన్నుగానకుండుట నయవిజ్ఞాన సంపన్నులు కరంబు గర్హింతురు. నా నస్మాదృశదుర్బలులం జెప్ప నేల. హితవచనంబులు వినని బాలిశుండు కోలవిడిచి పడిన తాఁబేలుంబోలెఁ గాలధర్మంబు నొందు. ఆకథ సాకల్యంబు మీఁఱ వాక్రుచ్చెద వినుండు.

భువనసారం బనునొక్క కాసారంబు గలదు. అయ్యది చక్రచక్రాంగ ప్రముఖ వివిధజలవిహంగమ సంచారరమ్యంబయి పుండరీక షండ సాంద్ర మరంద ధారాసార సంభ్రమద్భ్రమర ఝుంకారసంకులంబయియుండు. అందుఁ దడవులంబట్టి కంబుగ్రీవం బనుకూర్మంబు వికటసంకటంబు లనుహంసంబులతో బద్ధసఖ్యం బయియుండు. పిదప గొన్ని వాసరంబులకు వఱపునంజేసి కాసా రంబువారిపూరం బిఱ్ఱం బాఱుఁడు నామరాళంబులు దేశాం తరజిగమిషం బూని యాకచ్ఛపంబుకడకు వచ్చి తమయిచ్చం గలయర్థంబు వాక్రుచ్చి వియోగదుఃఖంబు మీఁఱందీఱమి పరి కించి యెలుంగుకుత్తుకం దగుల 'సఖ్యంబు మఱవకు. పోయి వచ్చెదము'. నావిని కమఠంబు కరంబానానంబు దీనభావంబునఁ గదుర నిట్లనియె. 'పెద్దకాలం జేకోదరులంబోలెం జెలిమి సలిపి తిమి. దీని కొక్కదోసంగు పోసంగు నని కలనేనిం దలంచి యెఱుంగ. మీఁతోడంగూడ వచ్చెదనంటినా పక్షంబులబలిమి కలిమిన్లజేసి వలయుసెలవునకుం బోవ వలంతు లగు మీఁకు నాకు నెంతయంతరంబు. నాకోలంది విచారించికో లటుండనిండు.

మిమ్ము నొక్కటి వేఁడెదం జిరకాలకృతం బగుచెలికారంబున కనురూపంబుగ నాప్రార్థితార్థంబు తుదముట్టింపవలయు. వెరవు పరికించి యెట్లయిన మీతోడ నన్నుం గొంపొండు మీవియోగంబు క్షణంబయిన సయిరింపంజాల' నావుడు నాయంచ లించుక చింతించి 'యిది యెట్లయ్యెడు ? ముక్కునం గఱచికొనియుండెడె ఱెక్కల నెక్కించుకొనియుండెం గొంపోవవలయు. విప్రకృష్ట దేశగాములకు మాకది దుస్సాధ్యంబు. సాహసంబు చనదు. ఎటువోయి యెటువచ్చునో యెఱుంగము. వినుము హృదయంబు వదిలించుకొని కుదురు గదలక యుండుము. భాగ్యంబు గలిగినం బునర్దర్శనం బయ్యెడు' నని యెంతదూరంబు చెప్పిన వినక కడుం గక్కసించిన నాయండజంబులు కొండొకడెందంబుల విచారించి యెట్టకేలకుం దామేటిం గాంచి 'యొక్కవెరవు పరికించితిమి. అది కొంతమదికి సరిపడియున్నది. ఒక్కయష్టి సేకరించి దానియగ్రంబులు చెఱియొక్క పక్క ముక్కునఁ గఱచికొని పఱచెదము. దానినడుము ప్రమాదంబుంబొరయక కఱచికొని రానోపుదె?' యనవుడు వల్లెయని తదానీతం బయినకాష్ఠంబు నడుము గఱచికొని ప్రేల నాయంచలు చంచువులం దదంచలంబులు పొంకించి యంబరతలంబున సత్వరంబుగఁ బాఱుచుండ నొక్కపట్టణంబునందలిజనంబులు వీని విలోకించి విస్మయంపడి కావించు సల్లాపంబుల యలబలంబు క్రందుగ వినంబడుడుం గూర్మం 'బీకలకలం బెక్కడిది?' యని హంసంబుల నడుగ నోరి పట్టు వదలి నేలవ్రాలి మాంసలుబ్ధులచే హతంబయ్యె. మతిమంతుఁ డనర్థావహం బగునభిజనంబు మానికొనవలయునొండె వనర్థంబు దలంగునుపాయసంపన్నుండు గావలయునొండెం గాని

దైవపరుండయి యుండం జనదు. దైవపరున కనర్థంబు తప్పదు. ఈయర్థంబు తేటపడ నొక్కకథ చెప్పెద వినుము.

ఒక్కజలాశయంబునం దనాగతవిధాతయుఁ బ్రత్యుత్పన్నమతియు యద్భవిష్యంబు నని మూఁడుమత్స్యంబులు వసించుచుండు. ఒక్కనాఁ డనాగతవిధాత ప్రత్యుత్పన్నమతి యద్భవిష్యంబులం గాంచి 'యీయేఁ డింతవఱకు వాన లేబరం బయ్యె. మీఁదనయినను గురియు ననువాస లేదు. నిమిత్తంబులు ప్రతికూలంబులయి కానంబడియెడు. ఈకొలనిజలంబులు తుద ముట్ట నడుగుఁబట్టకమున్న మెలంకువపడవలయు. మసలిన మోస వాటిల్లు. ఇటకుం గొంతదూరంబున ధుళివోదం బను హ్రదం బన్వర్థాభిధానంబుగలదు. ఇచ్చటికి వరవ యచ్చటినుండి వచ్చు చున్నయది. అదియు వెనుమూయం దోయంబులేక యుండెడు. వడికి రేయిట నల్లల్ల నావరవంబడి యామదువుం జేరి యీబారిం దలంగుదము. ఇంతకుం గొంతముందు కొందఱు మైనికులువచ్చి యిచ్చటిజలంబుకొలంచి పరికించి 'పదిదినంబులకు నివురంబాతెడు అప్పటికి వత్త'మని యొండొరులతో నాడికొనుచుం బోయిరి. అదిమొదలుగ నాయుల్లంబు వెల్లుగ నుడికిల్లెడు' నావిని ప్రత్యు త్పన్నమతి 'దీని కింతయేల ? అంతవచ్చిన నప్పుడు చూచికొంద' మనియె. యద్భవిష్యుండు మిన్నకుండె. అంతట ననాగతవిధాత యారాత్రి జలాశయంబు నిర్గమించి యొయ్యొయ్యం బోయి ధుళివోదంబుం బ్రవేశించె. ఇట నానాఁట నెండలమెండున సలిలం బల్పావశేషంబుగ శోషిల్లుడు రేవుబోయలు వల, ఎత్తెల, కొడమ్మ, గత్తి, మాఁవు లోనగుసాధనంబులు గొనివచ్చి పెచ్చు వేమకం జొచ్చి మీలంబట్టి పట్టి గట్టునకుం జేర్చుచుండ నందు

యద్భవిష్యంబు మిట్టిమిట్టిపడం బడియం గొట్టి కెడయించిరి. ప్రత్యుత్పన్నమతి మృతకల్పంబుగ జలంబులం దేలగిలంబడి యుండం గని నీరంబుచేరువం దీరంబునకుం బాఱంజిమ్మి మీన సంతానంబు నిరవశేషంబుగం బట్టికొని గట్టుచేరెడు నామత్స్యం బల్లల్ల జరిగి వారిం బడి బారిఁ దప్పించుకొని చనియె.'

అనిచెప్పిన విని టిట్టిభంబు నీవిందుల కయినకొందలం పడకుము. 'బూటకపుమాటలమూట యని నన్నుఁ దలంపకుము. కార్యంబుతఱి నానెఱమగంటిమి మెఱయించి నీమెచ్చువడయు వాఁడ. మిన్నకుండు' మనవుడు నావిహంగాంగన తనభర్తకు మాఱుపలుక వెఱచి యూరకుండె. అంతం గొన్నిదినంబులకు నావిహంగి ప్రసవించుడు సముద్రుఁడు టిట్టిభంబుపంతంబు పరి కింతమని కల్లోలమాలాభీలంబుగం బొంగి తదీయాండంబు లన్ని హరించె. అనంతరంబు పులుఁగువెలఁది తన పెనిమిటిం గనుఁగొని 'తొల్లి నావచనంబులు వినరయితిరి. ఇఁక నేమిచేయవచ్చు' నని చొటచొటం గన్నీరు దొరుఁగ నంగలార్చుడు నాఖగంబు దాని మిగుల నూఱడించి పులుంగుబలంగంబులఁగూర్చి తనకు సము ద్రుండు గావించినపరిభావంబు తెలియంబలికి 'యజాండసహితం బుగ నావరణవారిపూరంబు నిశ్శేషంబుగ గండూషింపఁజాలిన చండవిక్రముండు వజ్రతుండుఁడు మనకు రక్షకుండని యీాజ డాత్మం డెఱుంగఁడు గాఁబోలు. ఇప్పు డవశ్యంబుగ నెఱింగింత మెఱింగింపకున్న గర్వంబు మానఁడు. ఇది యల్పంబు దీని కింత యుద్యమం బేల యని యొప్పరికింపరాదు. నేఁడు గోరంతకు వచ్చినది తేపు కొండంతకు వచ్చు. మనమందఱు మనహితచిత్తం బులతో వినతానంతసంతోషాయకుం డగువినతానందనుం బ్రార్థింత

మాఱయాళుం డామహామహుండు మనయనిష్టంబు దలంగి
యిష్టంబు చేయంగలం' డని యొడంబఱిచి యాఖగంబులుం
దానును భక్తితాత్పర్యంబు మీఱ నిరంతరధ్యానం బొన-
రించుచుం బక్షిస్వామి సాక్షాత్కరించి 'హృష్టుండనయితి. మీ
యిష్టం బొసంగెద వేఁడుం' డనవుడు నండజాతంబులు మిగులం
బ్రీతంబులయి తమకు సముద్రుండు గావించినయవజ్ఞ విజ్ఞాపించిన-
నాతండు కుపితచేతస్కుండయి నదీనేతం గాంచి నిజాదేశంబు-
నయ్యండంబులు దెప్పించి యప్పక్షుల కిప్పించి 'యిప్పటికి క్షమి
యించితి. ఇటమీఁద నస్మజ్జనంబులకు నెగ్గుదలంపకు. నీ కది
లగ్గుగా' దని నుడివి యంతర్హితుం డయి చనియె."

నావిని సంజీవకుం డిట్లనియె. "దమనకా వినుము. కలకా-
లంబు బ్రదుకంబోము. చావు నిక్కంబు మనకన్నులముందఱం
బుట్టి గిట్టినవారి నెందఱం గానము. నిన్నయున్నవాఁడు నేఁడు
లేఁడు. నేఁడు పగతుమొగంబునకుం దొలంగిన తేపు మృత్యువు
మొగంబునకుం దొలంగవచ్చునే? దానంజేసి యపయశంబు
దప్పం బ్రయోజనంబు గలదె? పగతుకడిమి దడవక కడఁగిన
వాఁడం గాను. లాతివెరవు లావుగామింజేసి ప్రకృతోద్యమం
బుం బూనవలసె. కడమాట యొక్కటి వినుము. ప్రాణహాని
కయిన నోర్తుంగాని మానహాని కోర్వంజాల. ఇది నిక్కంబు.
నీ వింక నాకడంకకు నడ్డవాట్లు వ్రేయకుము. నే నిదె వచ్చెదఁ
గట్టాయితం బయియుండుమని తేనికిం జెప్పుము. వేగిరింపుము.
లెమ్ము. పొమ్ము." నావుడు దమనకుండు సరభసగమనంబునం
జనువాఁడు తేనియిరవు మోసలం గరటకుంగనుంగొని 'లోనికిం
బోవచ్చునె? యసమయంబు గాదుగద?' నావుడుం 'బోవచ్చును.

సమయంబ జేఁడు నీరాక వేచియున్నవాఁడు. పోయినపని యే మయ్యో' నని కరటకుం డడుగ దమనకుండు మొగంబునం జిఱు నగవు మొలతేర విలోకించి 'యేమో యేలయయ్యెడుఁ గార్యంబు పండించికొని వచ్చితిం బిదపఁ దదముట్టఁ జెప్పెద. నీవు పోయి సన్నిధానంబున నుండుము. వెంబడి నే వచ్చెద' నని కరటకుం బుత్తెంచి కొంతవడికిం దానుం జని జేనిం గనుఁగొని 'యమ్ము కూర్చుండుము వృత్తాంతం బేమి?' యని యాతం డడుగఁ జేరు వకుం జేరి యోరసిలం గూర్చుండి యల్లన నిట్లనియె. "నేను బోయినసమయంబున సంజీవకుఁడు లోనియిరవునం గాటకపాట కులతోడ మాటలాడుచుండి నను గనుంగొని వారితోడి సల్లాపంబు సాలించి ప్రత్యుత్థానంబు గావించి యుచితాసనా సీనుం జేసి కుశలప్రశ్నంబు గావింపఁ దదవసరోచితంబుగం గొన్నిమాటలాడి యేకాంతంబాకాంక్షించు మాజాడ యెఱింగి కాటకపాటకులు లేచి యెడ గలుగం బోవుడు నయభయం బులు దోఁప వచనీయం బశేషంబు వచియించితి. ఆతండును దనకుం బోలినవచనంబులు తెంపరితనంబు దోఁపం బెక్కులు వచియించె. అవియెల్ల నాకు వాకొన మీకు నూఁకొనంబోలవు. ప్రయోజనంబును లేదు. ఆతనియుద్యమంబు సమస్తంబు ప్రతి కూలంబగుట తద్వచనభంగి నెఱింగితి. చిరకాలంబు సంగాతంబు గావించినవాఁడం గావునఁ గానిచేతకు నాతండు చేయునుద్య మంబునకు మనంబునం దాళంజాలక యాతనికి హితంబుగ నాకుం దోఁచినయంత యొత్తిచెప్పితి. ఎంతచెప్పిన నతండు 'తాను బట్టినకుందేటికి మూఁడేకా' ళ్లనుచున్నవాఁడు. 'వినాశ కాలే విపరీతబుద్ధిః' యనువచనం బేల తప్పు? కాలం బాసన్నం

బైన నాతని కిట్టికుబుద్ధి పుట్టెం గాఁబోలు. అతఁడు పర్యవసానంబునం దన యుద్ధోద్యమంబు తెల్లంబుగం బలికి 'యింక నా కడంకకు నడ్డవాట్లు ప్రేయకుము. నే నిదె వచ్చెదం గట్టాయితంబై యుండుమని తేనికిం జెప్పుము. లెమ్ము పొమ్మని దిట్టతనంబు మీఱం బలికె. అతం డింతకుఁ గృతసన్నాహుండై డాయవచ్చుచుండు. కర్తవ్యాంశంబు దేవరచిత్తంబునకె విదితంబు." నావిని "యహాహా సాహసంబు! ప్రలయజ్వాలనంబు పయి శలభంబు విలంఘింపం దలంచె. ఔర! కావరం" బని యధిక్షేపించుచుం గ్రోధదుర్నిరీక్షుండయి హర్యక్షవల్లభుండు విపక్షశిక్షాదీక్షం బూని సముత్థితుండయి నిగ్రమించి ఖురప్రహారంబులదుమారంబు లాకాశంబు నిరవకాశంబుగం దిరోహించి ప్రావృషేణ్యఘారాధరవారంబు విడంబింప ధరాతలం బదుర దురవలోకభీకరాకారంబు మీఱం బొఱదెంచు నుత్పాధ్యక్షు వీక్షించి ధరాధరంబులు మాఱుచెలంగ క్ష్వేళారావంబు గావించి సటాఘాటంబు నిక్కం గర్ణంబులు చిక్కించి పింగళేక్షణంబుల విస్ఫులింగంబు లెగయ నరాళదంష్ట్రాకరాళంబుగ నాస్యగహ్వరంబు దెఱచి జిహ్వాపల్లవం బల్లార్చుచుం గుప్పింపం జొప్పఁదప్పించి వృషభేంద్రుండు సముత్క్షిప్తవాల విక్షేపంబు మీఱం బెల్లుద్రెళ్లి వెనుకటికాళ్లం బయల జాడించుచు భూనభోంతరంబు బూటటిల్ల నుదారారావంబు గావించుచు మస్తకంబు వాంచి యేటవాలుగం గొమ్ము లొడ్డుకొని మెఱుపుమెఱసిన తెఱఁగున నుఱికి యురమ్ము గ్రుమ్మ నమ్మెకమ్ములయొకిమీఁదు పొమ్మషిల్లి తెప్పునం దెప్పిఱి ముప్పిరిగొనుకోపంబు దీపింప నాటోపించి లాఘవంబున లంఘించి వజ్రసఖంబు లగు నఖంబు

లూడుకొన మూఁపురంబు చఱచినం దొరుఁగుకీలాలజాలంబు నగశృంగనిస్సరజ్ఝరీపూరంబు ననుకరింప గోవల్లభుండు తొలంగక. మలంగి శాతశిఖరంబు లగుఖురంబులు కరంబు డిగ నురంబు దాఁచిన నత్త్రాఁపుకంటెం దత్పరాభవంబు గుండియ లవియింప బెండువడి కంఠీరవవల్లభుండు దండతాడితభుజంగంబు భంగి రొఁజుచు నిలువం గరటకుండు దమనకుం జూచి "యవలోకించితే? భవదీయదుర్మంత్రశ్రవణఫలంబు ఱేఁ డనుభవించెడు. ముందు నీవు మృగరాజుతోడ సంజీవకునకు మైత్రి పుట్టించితివి. పిమ్మటఁ జూపోపక యిరువురకు భేదముఁ బుట్టించితివి. మొదల దూరము విచారింపవయితివి. పండితమాని యగు భృత్యుండు తనక కాదు స్వామికి సహితము హాని పుట్టించును. ఆహాహా! మనయధీశ్వరుం డిప్పుడు మహాపదం బొందియున్నవాఁడు. ఇప్పుడియిడుమకు రాజును దలంగువెరవు పరికించితి మేని వలంతులము. పొంకంబుగా బింకంబులు నూఱాడవచ్చును గాని యొక్కపోరామి వచ్చినప్పుడు కార్యంబు పయివ్రేసికొని సంబళించుట సుకరంబుగాదు. రాజును గుణవంతు నేని దుర్జనసేవితుని హ్రదంబును గమలషండమండితంబు నేగ్రాహాక్రాంతంబుం బోలెం బ్రజలు డాయ వెఱతురు. స్వార్థపరుఁడవయి యెట్టి యనర్థంబు పుట్టించి రాజు నేకాకిం జేసితివి. భృత్యుల నేరిం జేరనీవు. ఏవారిం జేరనీక యందఱికార్యంబులు పయివ్రేసికొని తిరుగువాఁడు తాన రాజునకుఁ బగవాఁడగును. అసాధువులకు హితంబు గావించువాఁడుంబోలె సాధువుల కహితంబు గావించువాఁ డవశ్యంబుం గీడునొందును. భృత్యుండు స్వామికి హితాపాదియయి తత్ప్రసాదంబునం బడిసినసంపద యెన్నఁటికి నశింపదు.

అహితంబు గావించి గడియించినది కడువడిం జెడిపోవును. కొందఱ అర్థశాస్త్రానభిజ్ఞులయ్యుం బండితమానులయి తామ కృత్యాకృత్యంబులు నిర్ణయింతురు. ఫలవైపరీత్యంబున దైవ ప్రాతికూల్యంబు నిమిత్తంబుగ వచియింత్రుగాని తమయజ్ఞా నంబు దలంపరు. అట్టిమూర్ఖులకు బుద్ధిఁ జెప్పఁగడంగువాఁడు వానరములకు బుద్ధిఁజెప్పఁబోయిన సూచీముఖమువలె హానిఁ జెందును. నీ కాకథ చెప్పెద వినుము.

హిమవంతంబుప్రాంతంబునం గుసుమఫలసంతానకాంతం బగు కాంతారంబుగలదు. అందలి కపిసందోహం బొక్కనాఁడు శీతంబుచే బాధితంబయి జ్యోతిరింగణసంఘంబుం గనుంగొని యనలంబనుబుద్ధిజేసి డాసి చలిగాంచికొనుచుండ సూచీముఖం బనుపక్షి వీక్షించి 'యోయివెఱ్ఱులారా! యివి నిప్పుకలుగావు. మిడుంగుఱుంబురువులు చూడుం డాచాయ నల్ల మహీ రుహంబు చేరువనింగలంబు గానంబడియెడు. అటకుం జని చలిగాచికొం' డన నం దొక్కమర్కటం బామాటలకు గాటం బగుకోపంబు దీపింప 'నీవా మాకుఁ గర్తవ్యోపదేష్ట' వని నిక్కి వెక్కిరించి గ్రక్కున లంఘించి దానింబట్టి నేలంగొట్టి కాలంబు తుద ముట్టించె.

బుద్ధిహీనునికి బుద్ధిమంతుఁడు చెప్పినవచనము హితంబుగాఁ దోఁపదు. లోకంబునందుఁ బ్రియవాదులు పెక్కండ్రు గలరు. హిత మాడువాఁడు దుర్లభుండు. హితవారికంటె హితశ్రోత కడు దుర్లభుండు. తనకు మేలుగోరి పరులకుఁ గీడుగోయువాఁడు తప్పక చెడిపోవును. తొల్లి నందిగుప్తుం డనువాఁడు సుదర్శన గుప్తుం డనువాని మోసపుచ్చం దలంచి తనతండ్రిని ధనంబును

గోలుపోయెను. ఆకథ నీకు సాకల్యముతో వాక్రుచ్చెద నాకర్ణింపుము.

జనావతి యనుపట్టణంబునందు సుదర్శనగుప్తుండును నందిగుప్తుండును నను బేహారు లిద్దఱు తద్దయు సౌహార్దంబు గలిగి వర్తింతురు. వారు ధనంబు సంపాదింపం దలంపుఁగొని లాఁతి విలాతికిం జని కొంతకాలంబు పాలిబేరంబు గావించి యభిమతం బొడఁగూడుడు నభిజనంబునకు మరలి యరుదేర నందిగుప్తుండు సుదర్శనగుప్తున కిట్లనియె. "మనము ధనం బానయించుట ప్రకటింపజనదు. న్యాయార్జితం బిది యెవ్వరెఱింగినం గొఱంత యేమి యనకుము. సరఘాసముత్కరసమార్జితం బగుమధువుం గరుణఁ దొఱఁగి లోకులు చేకొందురు గాదె? కావున నగరంబు పఱగడ నెక్కడనేనొక్కయెడ మనరొక్కంబుగుప్తంబుగావించి పోవుదము. వలసినతఱి వచ్చిపుచ్చికొందమ'నిన నొడంబడి యాతండు నాతండును ధనంబు సర్వం బొకబింకియం బొందు పఱిచి సాభిజ్ఞానంబుగ నొక్కవటమహీరుహంబుచేరువ లాఁతు లెఱుంగకుండం బాఁతి తమయిరవుల కరిగి యెప్పటిచొప్పునదప్పక చెలిమిగలిగి సుఖంబుండిరి. ఇట్లు కొంతకాలంబు గడచిననొక్క నాఁడు నందిగుప్తుఁడు గుప్తప్రకారంబునం జని యాబింకియం ద్రొచ్చి పుచ్చికొనివచ్చి డాఁపఱికం బొనఱించి పిదపం గొంత కాలంబునకు సుదర్శనగుప్తుం గనుంగొని 'మనము ధనంబు గొని వత్తము. మన కింక శంకింపం బనిలేదు. పెద్దకాలంబు లోకులం గనుమూసితిమి. ఇప్పుడు మనయొద్ద రొక్కంబు లేదని యుల్లం బులం దెల్లరు విశ్వసించియున్నవారు. మెఱ లెఱింగినం గొఱంత లేదు. రాజన్వంతం బగువిషయంబున వసించుచున్నవారము

చనుదెమ్మని తోకొని చని గుఱుతు పరికించి యిచ్చటం ద్రొచ్చి
చూడ ధనంబు గనంబడదయ్యె. అంత నందిగుప్తుండు తనముం
దట విషణ్ణుండయి నిలుచున్న సుదర్శనగుప్తుంజూచి కరంబున
నురం బప్పళించుకొని 'యోరి మిత్రద్రోహీ! యాహా యెంతపని
చేసితివిరా. ఎప్పుడో యొంటివచ్చి ధనం బపహరించి యేదియు
నెఱుంగనివాని తెఱంగున నాకెదుర విషాదం బభినయించి
దక్కించికొనం జూచెదవే. ఇచ్చటం బాఁతినధనంబు మనము
దప్ప నన్యు లెవ్వరయిన నెఱుంగుదురే! అది నీ వెఱుంగకుండం
గాళ్లువచ్చి నడచిపోయెం గాఁబోలు. కానిమ్మురా నిన్నుం బో
నిచ్చెదనే! వారివీరివలె నందిగుప్తుం డలఁతులం బోవువాఁ డని
తలఁపకుము. నాసొమ్ము నీచేతం గ్రక్కింపకున్న నేనొక్కమగ
వాఁడనే' యనుచుం గినుక మెచ్చుగం దెచ్చుకొని గ్రక్కున
బయిరవాసంబు పుచ్చి నడుమున బిగియం జుట్టుకొని సుదర్శన
గుప్తునిం గటివస్త్రంబునం గరంబునం జొప్పించి 'దివాణంబు
నకు రమ్ము. నీవక్కడంగాని చక్కంబడ' వని యాకర్షింప సుద
ర్శనగుప్తుండు మనంబునం దేవగించి 'యూరక యేల నేలవిడిచి
సాముచేసెదవు. తాళుము. నాపలుకులు విని యావల నీకుం
బోలినట్లు చేయుము. పట్టువదలు' మన నందిగుప్తుఁడు 'నాలుక
మిగుల కానీకము. నీకుం దాళిక యుండుంగాని సొమ్ముం గోలు
పోయిన నాకుం దాళికకు నెంతదూరంబు. బళి! యింతచాలక
నీపలుకులు సహితము వినవలయుంగా! నిన్ను విడిచెదనే' యన
సుదర్శనగుప్తుండు 'నీవురమ్మన్న చోటికివచ్చెదం బోదము. చేపట్టు
విడువు' మని విడిపించికొని వెంబడింబోవ నాతండు నృపునిపాలి
కిం బోయి తనవృత్తాంతంబు సమస్తంబు నివేదింప రెండవ

యాతండును 'మహాప్రభూ! అట్లు మేమిద్దఱము ధనంబు గుప్తం బుగావించి యిప్పుడు గ్రొచ్చిచూడం గానంబడదయ్యె. నే నింత యెఱుంగుదు. మఱియొక్కపాపం బెఱుంగ' నావిని పార్థివుండు ధర్మాధికృతుల రావించి వాదిప్రతివాదుల నప్పగించి 'వీరలతగవు దీర్పుం' డని నియోగింప వారు వారివాదం బవధానంబుతోడ నవధరించి వాదిం జూచి 'ప్రతివాది త్రవ్వి ధనము గొనినందు లకు సాక్షు లున్నారా' యని యడిగిరి. 'అయ్యలారా! దొంగ పెఱలెఱుఁగ దొంగలించునా? మేము ధనంబుఁ బాఁతినచోట వటవృక్షం బొక్కండుదక్క నన్యంబు లేదు. కటకటా ! యింక నే నెక్కడనుండి సాక్షిఁ దెత్తు' నని యాననంబు దీనంబు గావించికొని పలికి కొంత చింతించి వెండియు నిట్లనియె. 'ఇదె నాశపథంబు వినుండు. నేను మాతపితలకు భక్తుండ నేని స్వప్నా వస్థయందయినం బరద్రవ్యంబు హరియింపందలంపనేని సత్య శీలుండ నేని నవ్వటవృక్షంబ గుణగణ్యుల రగుమీ రెల్లరు విన సాక్షిభావం బవలంబించి సత్యంబు పలుకుంగావుత' మని యెలుఁ గెత్తిపలుక 'నీతం డెట్టిమహానుభావుండో యిట్టిశపథంబుగా వింప మఱియొక్కనికి శక్యంబె' యనియు 'శపథమాత్రంబున నేమయ్యెఁ జెప్పిన చొప్పు తుదముట్టఁజూడక యిదమిత్థమ్మని నిశ్చయింపరాదు. కల్లనిజంబులు దైవం బెఱుంగు' ననియుం 'బరికింప నీతండె ధనం బపహరించి యాతనిపయి నిందమోపి తాను సత్యశీలుం డనిపించికొనవలయునని యింతగొంతుగావిం చెడుం గాఁబోలు! అంకుటాలికిం గ్రొత్తడిసుద్దులు పెక్కులు గావె? యనియు నచ్చటం జూపఱు పెక్కుతెఱంగుల నాడి కొనుచుండ సభాసదులు కరంబు వెఱంగుపడి యన్యోన్యముఖా

వలోకనంబు గావించి యిట్టిశపథం బశ్రుతచరం బని ముచ్చటిం
చుచు 'నవ్వణిజులంజూచి నేడు మిక్కిలి ప్రొద్దువోయె. తేపు
వలువాత రండు. మీవివాదంబు పరిశీలించెద' మనవుఁడు 'వల్లె'
యని వారలు తమనిలయంబుల కరిగిరి. అంత నందిగుప్తుఁడు
నాఁటిరేయి నిజగృహబహిర్ద్వారంబు కవాటపిహితంబుగావించి
గర్భాగారంబుం జేరి తనజనకుని రావించి యతనితోడ భూగుప్త
ధనాపహరణంబాదిగ స్వకృతంబు సర్వంబు నివేదించి యిట్ల
నియె. 'అర్థంబు సకల పురుషార్థసాధనంబు. ధనంబునకు దుస్సా
ధం బొక్కండులేదు. లోకులు కులవిద్యారూపగుణవిహీను
నేని ధనవంతుని సర్వసంపన్నుఁడని వచియింతురు. సకలదురితం
బులకు దారిద్ర్యంబుంబోలె సకలదురితక్షపణంబునకు నర్థంబు
నిదానంబు తదార్జనంబుకొఱకు చేయుదురితంబు ప్రాచితంబునం
బాచికొనవచ్చుఁగాన నెవ్విధంబున నేనిఁ బురుషుండు ధనం
బార్జింపవలయునని నీతికోవిదులు వక్కాణింతురు. దానంబట్టి
యొక్కనుయి రొక్కంబు సమార్జించితి. హస్తగతం బగు
విత్తంబు దక్కించుకొను తెరవు గలిగియు వీజెంబితనంబున జాఱ
విడువనేల? ఒకసదుపాయంబు చింతించియున్నవాఁడ వినుము.
జాగుసేయక వేగకిమున్నపోయి యామఱ్ఱితొఱ్ఱ నడంగి యదృ
శ్యుండ వయియుండుము. తేపు ధర్మాధికృతులు చనుదెంచి
యావృత్తంబు నడుగుతఱి జంపు గావింపక యిచ్చటిధనంబు
సుదర్శనగుప్తుండు హరియించెనని యొత్తిపలుకుము. ఇంత
మాత్రంబు నాచెప్పినచొప్పు గావించితేని మనపక్షంబుజయించు'
నన విని యాతం డిట్లనియె. "ఉపాయంబు చింతించుచో
రాఁగల యపాయంబుసహితము చింతింపవలయు. లేనిచో

శాబకంబులం గాచికొనంబోయి కోలుపోయిన బకంబుచందం బగు. ఆకథ నీకుం జెప్పెద నాకర్ణింపుము.

ఒకనింబవృక్షంబుమీఁద బకమిథునంబు చేరి వాసంబుచేయుచుండు. అంతం గొంతకాలంబునకు బకాంగన గర్భంబు దాల్చి తనభర్తతోడనేగి యక్కడక్కడం జిదుగులు ముక్కునం గఱచికొని కొనివచ్చి గూఁడు పన్నికొని యండంబు లిడి పొదిగి బోదలంగావించి యేడుచు నొక్కనాఁడు తనపెనిమిటి కిట్లనియె. 'వినరుగా నేఁ డొకవిహంగనాంగన చెప్ప వింటి. తొల్లి యీ వృక్షంబుమీఁదం బకము లనేకంబులు వసించుచుండ వానిపిల్లల నెల్ల యీ క్రిందిపుట్టలోని కాలభుజంగంబు భక్షించిపోవ దాని రాయిడిం బడంజాలక యీపులుఁగులెల్ల వలసపోయెనఁట. ఈ వృత్తాంతంబు విన్నయప్పటంగోలె నామనం బెరియుచున్నయది. ఎఱుంగక యీతరువుం జేరితిమి. అక్కటా! యీనెత్తురుఁగందుల నొక్కయిడుమ దొడరిన నే నెట్లు సయిరింతు' నని చాట చాటం గన్నీరు దొరుఁగ నెలుంగుకుత్తుకం దగుల మాటరామి నూరకున్నదయితం గనుంగొని బకోటంబు దానుం గొంత చింతించి 'యేల యూరక యుమ్మలించెదు. మన యుమ్మలికంబడి కొండొకకార్యంబు సాధింపంబోయెదమె. ఊఱడుము. శత్రువుం బరిమార్చువెరవు మనంబునం దొక్కటి పరికించితి వినుము. ముంగిపొదదొరఁకొని యీపుట్టవనుక నక్కడక్కడ నొక్కొక్క మీనంబును వయిచియుంచెద. అట్లుచేసిన మనయిష్టంబు సిద్ధించు' నని పలికి యాక్షణంబపోయి కొలఁకున మీలంబట్టి యట్లువయిచియుంచుడు ముంగిస పొదరువెడలి యమ్మీనంబులం

దినుచువచ్చి పుట్టపట్టుం జేరి యాయురగంబుం బరిమార్చి యా భూరుహం బారోహించి బకశాబకంబుల భక్షించి చనియె.

కావున నొకండు నేయంబోయిన మతియొక్కండగు. వ్యవహారం బడుసునం బాఁతినకంబంబు. తుదకు నేవదికకు నొఱగునో యెఱుంగంబడదు. కావున నిక్కార్యంబు శ్రేయంబు గాదని నాకుం దోఁచెడు” ననిన నంటిగుప్తుం డిట్లనియె. ‘మొదలందోఁచిన యుపాయంబుం బట్టి పురుషుండు ప్రవర్తింపవలయుం గాని యుపాయంబున. కపాయంబు నపాయంబున కుపాయంబును జింతింపదొరకొనిన నెక్కడికిమందల. సందియంబు నొందకుము. కాదనక నావచనంబు నడపుము. మనకు సమస్తంబు శస్తంబయ్యెడు’ నని బోము గావించి యెట్టకేలకు నీకొన్న పితరుని దొంగరేయిటం గొంపోయి యావ్రాంనిలోని కోటరంబున మాటువఱచి యిరవుల కరుదెంచి కొఱరేయిం బుచ్చి రేపకడ ధర్మాధికృతులకడకుం బోవుడుం బ్రతివాదియు నరుదేర వారు వారిద్దఱం దోకొని దిదృక్షానుయాయిజనకలకలంబు రోదోంతరంబు నిండం బురంబు వెలువడి శ్రుతచరాభిజ్ఞానంబుంబట్టి యవ్వటవృక్షంబు చేరఁబోయినిలిచి ‘యోవృక్షరాజంబ! ఈవాదిప్రతివాదు లిచ్చట ధనంబు గుప్తంబుగావించి యనంతరంబేమి గావించిరి. ఈవు సాక్షివగుటం జేసి యెఱింగినదిసర్వంబు సత్యంబుగం బలుకు’ మనుటయు ‘నిచ్చటఁ బాఁతినధనం బొక్కనాఁడర్ధరాత్రంబున నొక్కరుఁడుసుదర్శనగుప్తుండువచ్చి కొంపోయె’ నని యావృక్షవిటపమధ్యంబునుండి శబ్దంబు వీతేరం దత్రత్యజనంబుల్లు చిత్రంపడి చిత్రప్రతిమలరూపంబునం జూపట సుదర్శనగుప్తుండు కొండొక మనంబున విచారించి ధర్మాధికారులం

గాంచి 'యార్యులారా! ఇది నిక్కం బని తలంపకుఁడు. వృక్షం బన నెక్కడ! సాక్ష్యంబు పలికె నన నెక్కడ! 'పృష్ఠతాడనా ద్దన్తభఙ్గ' యన్నట్లున్నయది. ముదె యిచ్చితిరే నిప్పుడ యీ వృక్షంబు సాక్షిభావంబు మీకెల్లం జెల్లంబుఁ గావించెద' నని వేఁడికొని తదనుజ్ఞాతుండయి యావృక్షం బారోహించి దాని కొమ్మలయుఁ బడుగొమ్మలయు నంతరంబులెల్ల నారసి స్కంధ శాఖ నొక్కంట మహాగుహాయుంబోలె విశాలాంతరాళంబయి తమోమయం బగుకోటరంబుఁగాంచి లోనం జొరవెఱచి యొంటు గాదంబు సందేడు దెప్పించి యందుఁ జొప్పించి యింగలం బిడి దరికొలుపుడు మహాభీలం బగుజ్వాలాజాలంబుచేఁ బొదువం బడి మేను గమర నంతర్వర్తి యగుమునిదగ్గు బెగ్గిలి వెగ్గలంపుఁ దాపంబున కోపక మొఱయిడుచు వెలికుఱికి నేలంబడి 'నీ వెవ్వఁ డవు నీవృత్తాంతంబేమి?' యని ధర్మాధికృతులచేఁ నడుగఁబడి నసుఁడయి 'యేను నందిగుప్తునిపితరుండ. వాఁడు నామాట పెడ చెవింబెట్టి నాకిట్టియాపదం బుట్టించె' నని చెప్పి కరం బాటం పడుచుం బ్రాణంబులు దొఱంగె. ఇంత ధర్మాధికృతులు సువర్ణన గుప్తునకుఁ బాఁతినధనంబెల్లఁ దెప్పించి యిప్పించి నందిగుప్తుం గొఱతవేయించిరి.

అని చెప్పి కరటకుండు వెండియు నిట్లనియె. "మొదల దూరంబు విచారింపక నీపలుకు లీకొంటి నిది యకార్యం బని ముందు దోఁపదయ్యె. సంజీవకుం డెన్నండే నొక్కయపకారంబు మనకుఁ గావించినవాఁడె? నిర్దోషుం డాతని కెడరు పుట్టించితివి. పాపిష్ఠుండ నేనును సహాయుండ నయితిని. ఇది మనకు శ్రేయంబు గాదు. పరుల వంచింపంబోయినవాఁడు తాన వంచితుండగు.

ఇందులకు నిదర్శనంబుగ నొక్కకథ వక్కాణించెద వినుము.

అజస్తుదం బనుపట్టణంబునం దింద్రపాలితుం డనువణిజుండుం గలఁడు. అతనికి ధనగుప్తుం డనుమిత్రుండు గలఁడు. ఇంద్రపాలితుండు తనయింట నున్నయఱువది బారువుల లోహంబు కూలివాండ్రచే నెత్తించికొని తనమిత్రునికడకుం బోయి "యోయన్న! ఉన్నట్టుండి దేశాంతరము పోవలసినపని వచ్చినది. మానసయితిగాదు. ఱేపు పయనము. ఈలోహము నీయొద్ద నుంచుకొనుము. నిరు డీసరకు నీతోఁగూడికొన్నది. వెలయెఱుఁగుదువు గదా? వరహాకు లాభము దుగులము వచ్చినంజాలు. కొను మొదలున కప్పటికై నవడ్డితో నేఁ జెప్పినలాభము వచ్చెనా విక్రయింపుము. పరులవలన నీవు పుచ్చుకొను వాడుకచొప్పున నడితి పుచ్చుకొనుము. నేఁ జెప్పిన చొప్పున వెలరానిపక్షమునకు సరకు కదలింపఁబోకు. లోహము చెడిపోవునది గాదు. నేఁడు దప్పిన ఱేపు నిలుకడమీఁద మంచివెలకు విక్రయించుకోవచ్చు. పయనము దాపుగనుక మిక్కిలి పనియున్నది. క్షణమయిన నిలువఁ దీఱదు. సర కొప్పగించుకొనుము' నావుడు నవ్వర్తకుం డిట్లనియె. నేను నీ కన్యుఁడనా? నా కింతచెప్పవలెనా? నీవిచ్చునట్టియడితికా పనిచూడవలె? గురువుసాక్షిగాఁ జెప్పెద వినుము. నీసొమ్ము నాసొమ్ముగాఁ జూతునుగాని వేఱుగాఁజూడను నమ్ము'మని యిను మొప్పగించుకొనియె. అంత నింద్రపాలితుం 'డన్నా! నావలన నీకు మిక్కిలి శ్రమంబయ్యె. పోయివత్తునా? సెలవిచ్చెదవే?' యని పలికిపోయి 'శీఘ్రము సురక్షితముగా వచ్చి చేరు' మని యాతనిచే నాజ్ఞాతుండయి వీడ్కొని చని మఱునాఁడు వేఁబోక లేచి దేశాంతరము వోయి తనకార్యంబు నెఱవేర్చుకొని కొంత

కాలమునకు మరలి యరుదెంచి యవ్వర్తకునిఁ గానంజని తత్కా-
లోచితంబుగ నాతం డభ్యుత్థానం బొనరించి కుశలప్రశ్నంబు
గావించి ప్రయాణవృత్తాంతం బడుగం దదనురూపసల్లాపంబు
కొంతదడవు గడిపి తాను నాతని వాణిజ్యంబునందలి యోగ
క్షేమంబులు విచారించి 'యిప్పుడు లోహము కొంతవెల హెచ్చి
యున్నదని విన్నాఁడను. మనలోహ మేమయ్యె' నన వాఁడు
మొగంబున విన్నఁదనంబు దెచ్చుకొని యిట్లనియె. 'మునుపు
నీతోఁ గొన్న లోహము నిలువ కొంచెముండఁగా దానితో నీలో
హము గదిలోఁ బెట్టి తలుపుమూసి తాళముఁ బెట్టి పదిలముచేసి
తిని. నిన్న కొందఱువర్తకులువచ్చి లోహము కావలెనని యడి
గిరి. ఆమీఁదట గదితలుపు దీసి చూతుఁగా లోపల లోహమను
పేరు లేదు. నాసొమ్ముపోయినదానికి నా కంతవెతఁబాటులేదు.
మిత్త్రుఁడు విశ్వసించి యిల్లడవెట్టినసర కాతఁడు రాఁగానే
'నాయనా యిదిగో నీసొమ్మనక పోయినదని చెప్పవలసి
వచ్చెఁగా యని యేది తోఁపక రాపడి నిలిచితిని. నాయందు
విశ్వాసముచేత నీవు నష్ట మొప్పుకొంటివిపో లోకులు
మెత్తురా? నానాఁడెము దక్కునా' యని చింతాకులితుండుం
బోలెం గొంతసే పూరకుండి నిట్టూర్పు నిగిడించి యిట్లనియె.
'గదితలుపు మూసిపెట్టిన తాళము పెట్టినట్లుండఁగానే లోని
సరకు మాయమయిపోకకు నిమిత్త మేమని నిపుణముగా
నాలోచించి చూచితిని. మాయింట నెలుకలరాయిడి మెండు.
వసరకుగాని బ్రదుకనీవు. అవి మన లోహమును వాతఁగొట్టు
కొనిపోయెనని నిశ్చయించితిని' నావిని యింద్రపాలితుండు వాని
మోసము తెలిసికొని యిట్లు చింతించెను. 'వీడు నాసొమ్ము

దక్కించుకోవలెనని యీవఱ కిన్ని మాటలు పన్నినాఁడు. మాఱు మోసము చేసి వీనివలన సొమ్ము రాఁబట్టుకోవలెఁగాని లాఁతి యుపాయముచేత రాఁబట్టరాదు' అని తలంచి .. భావవికారం బేమియు మోమునఁ దోఁపనీక యడఁచికొని యిట్లనియె. 'అన్నా! దీని కింతదూరము నీవు చెప్పవలెనా? నేను గ్రొత్తవాఁడనా? నీస్వభావ మెఱుఁగనా? దైవమువలన వచ్చినసేగికి మన మేమి చేయుదము? దీనికి నీవు చింతపడకు పోయివచ్చెదను' అని చెప్పి సెలవుపుచ్చుకొని తనయింటికిఁబోయి యామఱునాఁడు మొదలు కొని యెప్పటివలె మిత్రభావ మెక్కించుకొని యావర్తకుని యింటికి రాకపోకలు చేయుచుండెను. ఒకనాఁ డింద్రపాలితుండు ధనగుప్తునితో ముచ్చటలాడుచుండఁగా వీథియందు గోలుగుఁ బండ్లో గోలుగుఁబండ్లని పండ్లమ్ముశబ్దము వినఁబడెను. అదివిని ధనగుప్తునిబిడ్డఁడు గజ్జెలు గల్లుగల్లన నజ్జలు ద్రొక్కుచుఁ గుసి లించుచు నేడ్చుచుఁ దండ్రిని బట్టుకొని పండ్లు గొనియిమ్మని లాగుచు బొచ్చువెట్టెను. అంతట నింద్రపాలితుం డాబిడ్డనిఁ జంకనెత్తుకొని 'నాతండ్రిగా నాబంగారుగా యేడువ కేడువకు. పండ్లు కొనియిచ్చెద ర'మ్మని పండ్లగంప దూరముపోవుటఁబట్టి వెంబడించునెపమునఁ గొనిపోయి యొక్కయేకాంతస్థానంబున డాఁచి యాననంబున దీనభావంబు దెచ్చుకొని మరలి యరు దెంచుడు ధనగుప్తుండు గనుఁగొని 'బిడ్డఁ డేఁడీ?' నావుడు నాతం డిట్లనియె. చంకబిడ్డని నేలదించి పండ్లు బేరమాడుచుండితిని. ఇంతలో నెక్కడినుండియో యొకపాడుగద్దవచ్చి బిడ్డనిఁ దన్ని కొనిపోయెను.' అనఁగానే ధనగుప్తుఁడు చేత బొమ్మప్పళించు కొనుచు నిట్లనియె. 'ఓరిపాపీ! ఎంతపాతకమున కొడిగట్టితివిరా.

సొమ్మున కాశపడి యింత తెగువకుం బాలువడుదువా ? అనిసువు మొగముచూచి మెడపిఱువ నీకు మనసువచ్చెనా ? నీచేతు లాడెనా? ఓరిద్రోహీ! ఓరిచండాలుఁడా ! బిడ్డని గద్దతన్నుకొని పోవునా? ఈమాట యెవరయిన నమ్ముదురా?' అని శోకక్రోధ పరీతమానసుండయి కన్నులనీరు దేఱం బటపటఁబండ్లుగొఱుకుచు వెండియు నిట్లనియె. 'కానీరా సొమ్మువక్కినదనుకొనకు మిదిగోఁ గ్రక్కించెదఁ జూడు' మని లేచి సత్వరముగాఁ బోయి ధర్మాధి కృతుల కీవృత్తాంతము వినిపించెను. అంత వా రాశ్చర్యపడి యింద్రపాలితుని రావించి యాతనివలన నావృత్తాంతము విని యిట్లనిరి. 'ఓయి యిప్పటి నీ చెప్పినయర్థం బశ్రుతదృష్టచరంబు. మా కాశ్చర్యంబు వొడమించెడు' నావిని యింద్రపాలితుం డి ట్లనియె. 'అఱువదిబారువుల లోహ మీతనియింట దాఁచఁబెట్టి పోయితిని. ఆలోహ మెలుకలు దినిపోయెనఁట. పసిబిడ్డని గద్ద తన్నికొని పోవు టాశ్చర్యమా?' నావిని యధికారులు జరిగిన యర్థం బెఱింగి లోహంబును బాలకునిం దెప్పించి వారి కొప్పించి ధనగుప్తునకుఁ జోరదండంబు గావించిరి.

అనిచెప్పి కరటకుండు మఱియు నానాప్రకారంబుల దమనకు నుపాలంభించుచుండె.

తదవసరంబున మెగంబులరాయుండు వొడవొందిన కాఱాళంబునంగడు నడరి మెడజుంజురులునిక్క బెడిదంపుటుఱు మునుఱునినెఱబొబ్బ యిడి చంగున నెగిరి కోలగగ్గెరకుంబోలె నేలం గూలంద్రోచి ముంగాళ్ల నొత్తిపట్టి కుత్తుకం గఱచి నెత్తురు గుటగుటంద్రావి యాబసవని నుసుఱునకుం బాచి ప్రశాంత

క్రోధుండయి మరలి యిరవున కరిగి యనుతాపపరీతమానసుం డగుచు డాయవచ్చిన కరటకదమనకులం జూచి యిట్లనియె.

'కటకటా! ఎంతదారుణకర్మంబు గావించితిని. భరణ రక్షణంబులం బ్రకృతిరంజనంబు గావించువానికిం జెల్లుంగాని నాకు రాజనామంబు గాల్పనే! దూరము విచారింపక సంజీవకునిం జంపుకొంటిని. విషవృక్షమేని సంవర్ధించి తాన ఛేదింపఁజనదు. ఎఱిఁగియే నెఱుఁగకే నేరమి యొక్కండు వొనరించినభృత్యుని నయంబుభయంబుఁజూపి వాని వేఁడుకోలునం దెలవంబడిన ట్లభి నయించి తొలుత మిన్నక విడువవలయు. ఆవల మఱికావించిన వాని నిజాధికారంబువలనఁ దలంగవలయు. ఇంతకు హెచ్చుఁదీం ద్రంబుగానిపింపంబోలదు. కానిపించినం దక్కుంగల లెంకకూటవు కాయువుం దొఱంగు. దాన జేనికి దోసంగుపాసంగు నిందు సంశయంబు లేదు. ఎట్టికడిందికర్జంబయిన సాధింపవచ్చుఁగాని తగినభృత్యునిగడియించుట సుకరంబుగాదు. అదియట్లుండనిమ్ము. లోకంబునందుఁ గలకాలము దుర్వారంబయినదుర్యశంబు దెచ్చు కొంటి. ఇంకనేమిచేయుదు' ననిన మిన్నక క్రిందుచూచుచుండె. అంత దమనకుం డిట్లనియె. 'స్వామీ! దాయం బరిమార్చి యివ్వడువున నుమ్మలంపడంబోలదు. జేఁడు తను నెరగుపఱుపం గడంగువానినేని నొప్పరికింపక దోరింపవలయునని పాడినెఱినెఱిఁ గినగఱువలు వలుకుదురు. నేరమిం బొనరించినవారియం దోరిమి తాపసులకుంగాని భూపాలునకుం జనదు. రాజ్యలోభంబువలనం గాని హంకారంబువలనంగాని స్వామిపదంబుం గోరువానికి వధంబుదక్క దండంబు లేదు. ఈయర్థంబు సర్వసమ్మతంబు' నావిని పింగళకుండు సంతుష్టుండయి భద్రాసనంబు నధిష్ఠించె.

దమనకుండు ప్రహృష్టుండయి 'మహాస్వామి! దేవరకు లోకంబులకు స్వస్తియగుం గావుత' మని వచియించి తానును సకల పరిజనంబులును సుఖంబుండె.

అని విష్ణుశర్మ సుహృద్భేదంబు సాంతంబుగ వచియించి యిట్టి భేదంబు మీరు మీశత్రువులందుం బ్రయోగించి విజయంబుం బొందుండన రాజపుత్రులు కరంబు హర్షంబు నొందిరి.

పూర్వార్ధము సంపూర్ణము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1954.

# నీతిచంద్రిక : టిప్పణము:

చంద్రిక యనఁగా వెన్నెల. నీతిచంద్రిక యన నీతి యను నెడు వెన్నెల యని యర్థము. వెన్నెల యేవిధముగా చీఁకటిని తొలఁగించి జనుల కాహ్లాదము కలుగఁజేయునో యట్లే బాలురయజ్ఞానమును మాన్పి, వారిని నీతిపరులను గావించి శ్రేయము సంపాదించును గనుక నీతిబోధక మగు నీగ్రంథమునకు నీతిచంద్రిక యను నామ మెంతో సమంజసముగా నున్నది. బాల్యమున కథారూప మున బోధితమైన నీతి కలకాలము మఱపునకు రాదు.

గ్రంథకర్త తనకృతి నిర్విఘ్నముగా కొనసాగుటకై ప్రారంభమున నాచారము ననుసరించి మంగళాచరణము గావించుచున్నాఁడు.

1. శ్రీ=లక్ష్మి, అను=అనునట్టి, మించు మించు=గొప్ప మెఱపు, ఒలయన్=వ్యాపింపఁగా, సేవక...సంధాయకుఁడై-సేవక=భక్తు లనఁబడు-చాతకలోక=చాతకపక్షులసమూహమునకు - మోద = సంతోషమును-సంధాయకుఁడు = కూర్చువాఁడు, ఐ=అయి, ఉదార...వృష్టిన్-ఉదార=అధికమైన-కరుణారస=దయయనెడు నీటియొక్క-వృష్టిన్=వర్షము చేత, దుర్వార తాపముల్=సహింప రాని తాపత్రయము (ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము) అను సంతాపమును, పాయఁగన్= తొలఁగునట్లు, చేయుచున్, సకల+వాంఛిత+సస్యములు = ఎల్లకోర్కులు అను పైరులను, ఉల్లసిల్లఁగాన్ = పెరుఁగునట్లు, చేయుచున్, వేంకటాద్రిన్ = వేంకటాచలమునందు, నివసించుఘనుండు = ఉండునట్టిదేవుఁడు అను మేఘము, భద్రముల్ = మంగళములను, ఇడున్ కాతన్=ఇచ్చుఁగాక.

తా. శ్రీ లక్ష్మీదేవితోఁ గూడినవాఁ డయి, కరుణచే భక్తులసంసార తాపములన్నీ పోఁగొట్టుచు, సమస్తకోర్కులను దీర్చి వారికి సంతోషమును గలిగించునట్టి వేంకటేశుఁడు మంగళము లిచ్చుఁగాక.

మేఘములు తమవృష్టిచేత చాతకపక్షులకు అవి కోరెడు నిర్మలజలము నొసఁగి యెట్లు సంతసింపఁజేయునో, భగవంతుఁడును తనకరుణచేత భక్తుల కోర్కెలను అట్లే తీర్చి సంతసింపఁజేయును అని భావము.

ఇందు భగవంతుని మేఘముగాను, శ్రీదేవిని మెఱపుగాను, భగవంతుని కరుణను వర్షముగాను, భక్తులను వాననీటికై యెదురుచూచు చాతకములు గాను, భక్తులకోరికలను పైరులుగాను రూపించియుండుటచే రూపకా లంకారము.

ఘనుఁడు: నానా. గొప్పవాఁడు, మేఘుఁడు.

కాతన్ - ఆశీరర్థమునందు తద్ధర్మార్థకక్రియల కనుప్రయుక్తమగు శబ్దము.

2. కరుణ తెఱంగునన్ = దయవలె హరియెదన్ = విష్ణుదేవునిఱొమ్ము నందును (హృదయమునందును), ఇరవుకొని=నిలిచి, అఘ ఆళిన్ = పాపముల సమూహమును, అరయన్ ఈక=విచారింపనీయక, అశనిచేన్, నిరతమున్ = ఎల్లప్పుడును, సంశ్రితజనులన్=భక్తజనులను, పరిరక్షింపించు తల్లిన్=రక్షింపఁ జేయునట్టితల్లిని, (లక్ష్మీదేవిని). మదిన్ = మనస్సునందు, భజియింతున్ = సేవించెదను.

తా. విష్ణువుమనస్సున కరుణ నెలకొనియుండునట్లుగా ఆయనఱొమ్ము నందు నివసించి, యాయన భక్తులపాపములను తలఁప కుండునట్లు చేసి, వారిని రక్షింపించునట్టి తల్లియగులక్ష్మీదేవిని సేవించెదను.

రక్షింపించు - రక్షించుధాతువునకు ప్రేరణరూపము.

3. వనజభవ అండభాండములు=కుండలవంటి బ్రహ్మాండములు, అవారిగన్= అధికముగా, ఎవ్వని తుంద కందరమునన్ = ఏవిష్ణువుయొక్క కడుపుయొక్క రంధ్రమునందు, ఒక మేలన్ = ప్రక్కలయందు (మూలలయందు అనియు; ఇట ఒకశబ్దము వాక్యాలంకారము.) ఇంటరము = ఇఱుకును, పొద్దక, పొందుగన్=చక్కఁగా, పొల్చును=ప్రకాశించునో, అమ్మహాత్మునిన్ = అవిష్ణువును,

నిజభోగశయ్యన్ = తనదేహము అను పాన్పునందు, ఇడి = ఉంచుకొని, పొత్తుల కందువునట్లు = పసిపాపనువలె, లాలనంబు = బుజ్జగింతను, ఒనరుచు నయ్యనంతున్ = చేయుచున్నట్టి యాయాదిశేషుని, మహిమ నున్నతునిన్ = ప్రభావము చేతగొప్పవానిని, నిచ్చలున్ = ఎల్లప్పుడును, నుతియింతున్ = పొగడుదును.

తా. బ్రహ్మాండములన్నియు నెవనికడుపునందు నిముడుకొనియుండునో, ఆవిష్ణుమూర్తిని తనయొడలిపై బరుండఁబెట్టుకొని, పసిబిడ్డను బుజ్జగించునట్లు లాలించుచున్న ఆదిశేషుని స్తుతించెదను.

వనము = నీరు, వనజము = నీటఁబుట్టినది - తామర.

వనజభవుఁడు = బ్రహ్మ; భోగము = పాముపడగ, పాముశరీరము.

కందువునట్లు = కందువు + అట్లు - ఉపమేయము ప్రథమాంతమగునపుడు అట్లు పరమగుచో ఉపమానమగు నామవాచకమునకు షష్ఠీవిభక్తి యగును. మహాత్ముఁడు - ఉపమేయము; కందువు - ఉపమానము.

కందువు(యొక్క) + అట్లు — కర్మార్థ ఉదంతషష్ఠీసమాససంధి (చూ. బాలవ్యా. సం. 34) ఒనరుచు + అయ్యనంతున్ - ఒనరుచు నయ్యనంతున్ ఉదంతతద్ధర్మార్థకవిశేషణసంధి. (చూ. బాలవ్యా. సం. 33)

ఆదికవిస్తుతి.

4. ఘనున్ = గొప్పవాఁడగు, నన్నయభట్టును, తిక్కనన్, ఎఱ్ఱాప్రెగడన్, పొగడి = స్తుతించి, అలికంబున అక్షిని = నొసటికంటిని, డాఁచినట్టి = డాఁచిపెట్టిన, సర్వజ్ఞుని = శివుని, నాచనసోమనాథున్, స్తుతి ఒనరింతున్ = స్తుతించెదను.

తా. కవిత్రయము (నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగడ)ను, నాచనసోమనాథుని స్తుతించెదను. అలికంబున అక్షినిడాఁచినట్టి సర్వజ్ఞునిన్ - ఇది నాచనసోమనాథునకు విశేషణము. సర్వజ్ఞుఁడన శివుఁడు. ఈనాచనసోమనాథుఁడు మూఁడవకంటిని డాఁచి రెండుకన్నులతో నవతరించిన శివుఁ డనిభావము.

అళికంబున అక్షి=అళికంబు+అక్షి-సమాసమందు ము(ంబు)వర్ణాంతము లకు నవర్ణమాగమమగుటయుఁగలదు. (ఆం. భా. 52)

## ప్రతిజ్ఞాదికము.

**5.** ఒనరఁగాన్ = ఒప్పునట్లుగా, పంచతంత్రహితోపదేశములను, పరికించి = పరిశీలించి, వానిలోన్, వలయునంశములను = అవశ్యకములయిన విషయములను, కొని = గ్రహించి, కొంత, అభినవంబుగను = (కామందకీయనీతిసారము మహాభారతము మున్నగు గ్రంథములనుండి) క్రొత్తగాన్, కూర్చి, నీతిచంద్రిక, అనంగన్ = అను పేరు గల, కృతి = గ్రంథమును, ఒనర్చెదన్ = చేసెదను.

తా. పంచతంత్రమును హితోపదేశమును జూచి, వానినుండి ముఖ్యాంశములను గ్రహించి, కొంత క్రొత్తగాఁ గూడఁ జేర్చి నీతిచంద్రిక యను పేర నొక గ్రంథము రచించెదను.

పంచతంత్రము : క్రీ. పూ. మూఁడవశతాబ్దాంతమున విష్ణుశర్మచే సంస్కృతభాషయందు రచింపఁబడిన చంపూగ్రంథము. ఇందు మిత్రభేదము, మిత్రలాభము, కాకోలూకీయము, లబ్ధప్రణాశము, అపరీక్షితకారకము అను నైదుతంత్రములు గలవు.

హితోపదేశము : పంచతంత్రము నాధారముగాఁ గొని నారాయణకవి యనునాతఁడు క్రొత్తవిషయములనుగూడఁగూర్చి నాలుగేతంత్రములు-మిత్రలాభము, సుహృద్భేదము, విగ్రహము, సంధి అనునవి-గల గ్రంథమును సంస్కృతమున చంపువుగ రచించెను. ఇది పంచతంత్రమునకు బహుకాలమునకుతర్వాత పుట్టినట్టిది.

**6.** ఈకబ్బము = ఈకావ్యమును, ముదముట్టఁగన్ = కడవఱకును, వదిలముగాన్ = శ్రద్ధగా, చదివినట్టి బాలురకున్, ఓలిన్ = క్రమముగా, భాషాజ్ఞానము, పొదలును = కలుగును; కొద = కొఱఁత, లేక, నీతికుశలత్వంబున్ = నీతియందు నేర్పును, కుదురున్.

తా. ఈనీతిచంద్రికను కడవఱకును శ్రద్ధతోఁ జదువుబాలురకు భాషాజ్ఞానమును, నీతిశాస్త్రజ్ఞానమును కలుగును.

7. విద్య, వినయంబుక్ = అడఁకువను, ఒసఁగును = ఇచ్చును; వినయమునను = అడఁకువచేత, పాత్రతక్ = యోగ్యతను, పడయంక్ = పొందును; పాత్రతవలనక్=యోగ్యతచేత, ధనమును, ధనమువలనను, ధర్మంబును, దానివలనక్, ఐహిక ఆముష్మిక సుఖంబులు = ఇహలోక పరలోకసుఖములను, నరుఁడు = మనుష్యుఁడు, అందుక్=పొందును.

తా. మనుష్యునకు విద్యవలన వినయము, వినయమువలన యోగ్యత, యోగ్యతవలన ధనము, ధనమువలన ధర్మమును, దానివలన ఇహపరసుఖములును కలుగును.

ఉత్తరోత్తరములకు పూర్వపూర్వము కారణములుగాఁ జెప్పఁబడుటచే కారణమాలాలంకారము.

8. ప్రాజ్ఞుండు = విద్వాంసుఁడు, జరయుంక్ = ముసలితనమును, మృతియుంక్ = చావును, లేని జనునట్లు = లేని మానవునివలె, ధనముక్, విద్యక్, కూర్పక్ = సంపాదించుటకు, తలఁపవలయును. మృత్యుచేక్ = మృత్యుదేవతచేత, తలపట్టి = తలపట్టుకొని, ఈడ్వఁబడినవాఁడుక్ బోలెక్=ఈడువఁబడినవానివిధమున, ధర్మము. ఆచరింపఁదగుక్ = ధర్మముచేయవలెను.

తా. పండితుఁడు తనను ముసలితనముగాని మరణముగాని లేదన్నభావముతో ధనమును విద్యను సంపాదింపవలెను. తర్వాత మృత్యువుచే బట్టుపడ్డవానివలె నెంచుకొని ధర్మమును చేయవలెను.

జనునట్లు - చూ. కందువునట్లు - ప. 3, మృత్యుచేక్ - వువర్ణలోపము-రాహుబాహుశబ్దములలోవలె వువర్ణలోపము వైకల్పికము. ఉపమాలంకారము.

ఈడ్వఁబడినవాఁడుంబోలెక్ - పోలె పరముగునపుడు ఉపమానశబ్దము

నకు ప్రథమమై కల్పికము. పోలెకు పూర్వము ద్రుతమువిభాష నగు. (ప్రౌఢ. సమాస. 38, 39).

9. లోకులు, నీతిలేనివానిన్, నిందింతు = దూషింతురు, లాతి = ఇతరము, లేక ఉన్నన్ = లేకపోయినను, నేగి = కీడు, లేదు. కానన్ = కాఁబట్టి, మానవుండు, పూనికన్ = పట్టుదలతో, మొదలన్ = ప్రారంభమున నే, నయవిద్యన్ = నీతివిద్యను, గడనచేయన్ = సంపాదించుటకు, కడఁగవలయున్ = ప్రయత్నము చేయవలయును.

తా. నీతిలేనివానిని లోకులు దూషింపఁగా నతఁడపకీర్తిపాలగును. తక్కినగుణములు లేకపోయినను దోషము లేదు. కనుక మానవుఁడు మొదట నీతివిద్యను సంపాదింపవలెను.

నిందింతు: రూ. నిందింతురు. (చూ. బాలవ్యా. క్రి. 62.)

10. నవభాజనమునన్ = క్రొత్తవస్తువునందు, లగ్నంబు = అంటినట్టిది, అవు = అగు, సంస్కారంబు = క్రొత్తగుణము, పొలియదు = నశింపదు; అటుకావునన్; మాణవులకున్ = బాలురకు, కథాచ్ఛలంబునన్ = కథయను నెపము చేత, చవి = ఆసక్తి, ఉట్టఁగన్ = అతిశయించునట్లు, వచనసరణిన్ = వచనముమూలముగా, నీతిన్, తెలిపెదన్.

తా. క్రొత్తవస్త్రమునకు వేయురంగు ఎట్లునశింపదో యట్లే బాలురకు చిన్నతనమున నేర్పఁబడినవిద్య చెడదు. కావున బాలురకు రుచిపుట్టునట్లు కథలమూలముగా నీతిశాస్త్రమును వచనరూపమునఁ దెల్పెదను.

అవు – రూ. అగు. (బాలవ్యా. అచ్ఛి. 27)

## కథా పీఠిక.

పు. 5. పాటలిపుత్రము: రూ. పాటలీపుత్రము. పాటలి యనునది పుత్రకుఁడనువానిభార్య. ఆదంపతులచే నియమింపఁబడిన నగరము గనుక దానికి పాటలీపుత్రమను పేరుకలిగెను, ఈనగరము మగధదేశమున గంగాశోణనదుల

పంగమస్థానమున నుండెను. అది క్రీ. శ. ఎనిమిదవశతాబ్దమున నేటివెల్లువచే నాశ మొందగా, నాస్థానముననే యిప్పటిపాట్నానగరము నిర్మింపఁబడెను.

వినోదార్థము = వేడుకకొఱకు, సల్లాపములు = ముచ్చటలను,

(చూ. బా. కార. 24)

పరువము = ప్రాయము, కలిమి = సంపద, దొరతనము = ప్రభుత్వము, అరయమి = అవివేకము, అనునట్టి, వీనియందుఁ = అనిచెప్పఁబడు నీనాల్గింటిలో, ఒకఁడు ఒకఁడు ఏ = ఒకటొకటియే, అనర్థము = కీడు (మదకారణము)ను, ఘొరయించుఁ = కలిగించును. నాఁ = అనఁగా, నాల్గుఁ = ఆ నాలుగుకారణములును, ఒరఁగినచోఁ = ఒప్పియుండిన, చెప్పవలయునె = అనర్థమగు నని వేఱుగా చెప్పవలెనా? చెపుమా,

తా. యౌవనము, సంపద, దొరతనము, అవివేకము అనునాలుగింటిలో ఒకటి యున్నను కీడు తప్పక కలుగును. ఇఁక నాలుగును ఒకచోటనే యున్న చేటు కలుగు ననుట కేవిధమయిన సంశయమును లేదు.

ఒకయర్థము సిద్ధింపఁగనే దానిచే తుల్యకారణమువలన నిస్సంశయముగను సహజముగను ఇంకొకయర్థము స్ఫురించిన నదికావ్యార్థాపత్త్యలంకారము.

పలుసందియములఁ = అనేకసందేహములను, తొలఁచును = పోఁగొట్టును; అగోచర అర్థవిజ్ఞానముఁ = కన్నులకు తెలియనివస్తువులతెలివిని, వెలయించుఁ = ప్రకాశింపఁజేయును. లోకులకుఁ = జనులకు, అక్షి = కన్ను, శాస్త్రము, అయ్యది = అశాస్త్రమనెడుకన్ను, ఎవనికిఁ, అలవడదు = లభింపదో, వాఁడె, జగతిఁ = లోకమునందు, అంధుఁడు = గ్రుడ్డివాఁడు.

తా. శాస్త్ర మనెడు కన్ను జనులకుఁ గల సందేహములను దీర్చుటయే గాక, పరోక్షములగు వస్తువులనుగూడ ప్రకాశింపఁజేయును. అట్టిశాస్త్రరూపమయినకన్నులేనివాఁడే యీలోకమున నిజమైన గ్రుడ్డివాఁడు.

ప్రస్తావవశముగాఁ = మాటలసందర్భమున, సదా = ఎల్లప్పుడు,

క్రీడాపరాయణులు=ఆటలయందాసక్తికలవారు(సప్తమీతత్పు.), తల్లిదండ్రులు (బాలవ్యా. సం. 15) బిడ్డఁడా-ఆ-ప్రశ్నార్థకము.

పుట. 6. కలకాలము=బ్రతికినంతకాలము (ఎల్లకాలము), చచ్చెనా = చచ్చెను+ఆ-ఆపత్కాంతరమును దెలిపెడి అవ్యయము. తల్లికడుపు చెఱుపఁ బుట్టుట - ఇదియొకజాతీయము. నిష్ప్రయోజకుఁడు అనియర్థము. గుణవంతులలోఁ = మంచిగుణములుగలవారిలో, ప్రథమగణ్యుఁడు = మొట్టమొదట లెక్కింపఁ దగినవాఁడు. పుత్త్రుఁడుకాని - కాని - వికల్పమును దెల్పునవ్యయము. కానికొడుకును - కాని: అగుధాతువు వ్యతిరేకార్థకవిశేషణము. గొడ్రాలు = రూ. గొడ్డురాలు = గొడ్డు+ఆలు (రుగాగమము. బాల. సంధి 30) = బిడ్డలుకననియాఁడుది. రాలు - బ. వ. రాయి-ఏకవ. గంపెఁడు = గంప+ఎఁడు-ఎఁడువర్ణకము పరిమాణార్థకము. (బాల. సం. 11). సంపద = భాగ్యము. చింతించి, ఊంకించి, పంకించి - ఈమూఁడుకార్యము లోకానేకవిషయమున దీర్ఘాలోచనముసల్పి కార్యవిధాన మిట్టిదని యూహించి, అటులే చేయఁదగు ననునిశ్చయమును మనస్సున స్థిరపఱచుకొనునపుడు చేయుచేష్టలు- పరామరిక మాలి (= Laying aside negligence) = ఉపేక్షవదలి చేయింపమి = చేయించు+అమి - చేయు ధాతువు ప్రేరణార్థకవ్యతిరేకభావార్థకము. అభ్యాసము (నామవా.) అభ్యసించు (క్రియ.); శిక్షితుఁడు = నేర్పఁబడినవాఁడు (Taught, trained), పురుషకారము చేతఁ = పురుషప్రయత్నము చేత, 1. పురుషకారము చేత...సిద్ధింపవు. 2. నిద్రించు...చొరవు. ఈరెండువాక్యములలో సామ్యము గమ్యముగా చెప్పఁబడినందున ప్రతివస్తూపమాలంకారము. నోరను - నోరుశబ్దము ఔపవిభక్తికము అనౌపవిభక్తికము కూడ. 'అను'సప్తమీవిభక్తియందాదేశమైన ప్రత్యయము. తమంతఁ=తమ+అంతఁ-ఇచట అంతఁ స్వేచ్ఛను దెలుపును. చొరవు - చొచ్చుధాతువు వ్యతిరేకార్థకరూపము (చూ. బాల. క్రియా. 95) సింహము మృగములకు రాజై నప్పటికి నది నిద్రించునప్పుడు దానిదగ్గఱకుఁ దమ్ము తినుమని మృగములు

తా మైరానియట్లు ప్రయత్నము లేనివానికిఁ గార్యములు నెఱవేఱవని భావము. (పండితుఁడుచదివినపద్యము విన్నది మొదలు తానువిద్వాంసులనుపలుకరించుసంత వఱకు రాజు మనస్సున చెలరేఁగినభావప్రవాహమును గుర్తించునది.) క్రీడా ఆసక్తులు = ఆటలయందు కోరికగలవారు; ఎంతపాటిపని - ఇదియొకగొప్ప పని కాదు అనునర్థమున వాడెడు జాతీయము. దేవరపుత్త్రులు = ప్రభువులతో మాటలాడునపుడు 'మీరు' అనుటకు పర్యాయముగా వాడునట్టి గౌరవవాచ కము. మహావంశ...దుష్కరము గాదు - ప్రతివస్తూపమాలంకారము.

పు. 7. గుణహీనుఁడు = గుణములచే విడువఁబడినవాఁడు. పద్మరాగ ములు = కెంపులు (రత్నములలో నొక్కటి). పుట్టునా - ఆ-ప్రశ్నార్థకము వ్యతిరేకార్థబోధకము. గురుజనశిక్ష = గురువులయుపదేశము (Instruction) ఎట్లి...ప్రకాశింపఁడు - ఉపమాలంకారము. నీతికోవిదులు = నీతియందుఁ బండితులు. సావాసించు = సహవాసముచేయు; సాజము = సహజము. సాధు సాంగత్యము=సత్పురుషులతోడి సహవాసము. సర్వశ్రేయములకున్ = అన్ని విధములయిన మేలులకును; మూలము = కారణము. సాదరముగాన్ = స+ ఆదరము+కాన్ = ఆదరముతోఁగూడినట్లుగా; వచియించి - రూ. వచించి (చూ. బాల. క్రి. 50); పసదనము=బహుమానము, రప్పించి-వచ్చుధాతువు ప్రేరణ క్త్వార్థకము-చూపి-చూచు ధా. ప్రే. క్త్వా. విద్యాగంధము = విద్యయొక్క లేశముకూడ; జనుపాంథులవలెన్ = పుట్టుగుడ్డువలె; రమణీయసౌధమునకున్- చదువుటకు రమణీయ మగు స్థలమత్యంత మనుకూలము. మిత్త్రలాభము = స్నే హితులను సంపాదించుకొనుట తెల్పునది; మిత్త్రభేదము=స్నేహితులను వేఱుపఱు చుటను దెలుపునది. విగ్రహము = యుద్ధమును గూర్చి చెప్పునది; సంధి = స్నేహ మును గూర్చి చెప్పునది. నాలుగు అంశముల చేతన్ = నాలుగుభాగముల చేతను.

క థ.

ధనసాధన...సాధించుకొందురు - ఇవి యీతంత్రమున కెల్ల మూల వాక్యము. ధనసాధన సంపత్తి = ధనముయొక్కయు సాధనములయొక్కయు

సంపద. అయ్యుఁ—అయి+ఉను-సముచ్చయము. క్త్వార్థక క్రియతోఁ గలిసి పక్షాంతరమును బోధించును. పరస్పరమైత్రి = ఒండొరుల స్నేహమును, కాక కూర్మమృగమూషికములవలెన్-కాకము (లఘుపతనకము), కూర్మము = తాఁ బేలు (మంథరుఁడు), మృగము=జింక(చిత్రాంగుఁడు), మూషికము = ఎలుక (హిరణ్యకుఁడు) :

కాకి మొదలగునవి ధనము మొదలగు వస్తువులు లేనివైనను ఒండొంటి చెలిమిచేతఁ దమ పనులను సాధించుకొన్నట్లు బుద్ధిమంతులు ధనము లేని వారైనను నప్పటి కొకరితో నొకరు స్నేహము చేసి తమపనులను నెఱవేర్చు కొందురు, అని తాత్పర్యము. మీఁదికథ యీవిషయమును విపులముగా చర్చించి ధ్రువపఱుచును.

ఈకథ మొదట గోదావరీతీరమున, తర్వాత గండకీతీరమందలి విచిత్ర వనమున, పిదప దండకారణ్యమునఁ గర్పూరగౌర మను సరోవరపరిసరమున జరిగినట్లు వర్ణింపబడినది.

పుట: 8. పక్షులు రాత్రివసించుచుండును - 'రాత్రి' కాలవాచకము గనుక ప్రథమావిభక్తిలో నున్నది. వాయసము = కాకి, కిరాతునిన్ = వేఁట గానిని, వఱువాతన్=ప్రాతఃకాలమందు, (వఱువాయి శబ్దము సప్తమీవిభక్తి ఏకవచనము), మేలుకొని - శబ్దపల్లవక్రియ (బా. క్రి. 118). చిత్రాంగుఁడు: పావురములరాజు. నింగిని=ఆకాశమునందు,తనతోడికపోతములతోన్= తనతోడన్+కపోతములతోన్-సమాసమందు తోడవర్ణకమునకు ఇకారాదేశము, ఈనిర్జనవనమందున్ = జనులులేని యీయడవిలో, రాన్ = వచ్చుటకు (వచ్చుధాతువు తుమున్నర్థకము), నిమిత్తము = కారణము, వినుండి-వినుండు+ ఇ ప్రార్థనార్థక క్రియలకు అదాదు లనుప్రయుక్త మగు. (బాల. క్రి. 33).

దర్పు - దీనికి మువర్ణకలోపము నిత్యము, పయిఁడి = బంగారము, రూ. పసిఁడి, పాంథుఁడు = బాటసారి (అరిమతుబర్థక ప్రత్యయము), సందేహపడు- సందేహము+పడు (బా. సం. 46).ఏదీ-ఏది+ఈ-ఏది అనుసర్వనామము -

ఈఅనునవ్యయముతోఁ జేరి "ఎక్కడ నున్నది" అనునర్థము కలిగినది. హేమ
కంకణము = బంగారు కడియము.

పుట: 9. బోసినోరు = పండ్లు లేనినోరు; నీవు దరిద్రుఁడవు—
అనుపకారియైన పేదకు, దేశకాలపాత్రములకు సమ్మతముగ నిచ్చునట్టిదే సరి
యైన సాత్వికదాన మని పెద్దలు పలుకుదురు. కనుక దరిద్రునకు నీ కీకంక
ణము దానము చేసెదను అనిభావము. (బాల. కార. 33) పేరాస =
పేరు+ఆస = పెద్ద ఆశ = లోభము. రూ. పేరుటాస, మొలబంటి = మొల
లోఁతుగలది, విధి=కాలము, భాగ్యము. వగచి=దుఃఖించి. వధింపకు - మూవర్ణ
లోపము: చూ. బా. సం. 48.

హాని=కీడు, కపోతవృద్ధము=పావురములయందు పెద్దది (విశేష్యపూర్వ
పదకర్మధారయము.) ఆ - ఇది యాశ్చర్యార్థకము. ఇక్కట్టు = సంకటము,
స్థాన అస్థానములు = యుక్తాయుక్తములు, కొఱమాలిన శంకలు = పనికి
మాలిన సందేహములను.

పుట: 10. ఈర్ష్యాళువు=అసూయగలవాఁడు, జుగుప్సావంతుఁడు =
రోఁతగలవాఁడు. నిస్సంతోషి = సంతోషము లేనివాఁడు, క్రోధనుఁడు =
కోపముగలవాఁడు, నిత్యశంకితుఁడు = ఎల్లప్పుడు సందేహముగలవాఁడు, పర
భాగ్యోపజీవి = ఇతరుల సంపదచే బ్రదుకువాఁడు, దుఃఖభాగులు = దుఃఖ
మును పొందువారు, ఇది యనుభవైకవేద్యము. నీతికోవిదులు = నీతిశాస్త్ర
పండితులు.

మిక్కిలి వినికి=ఎక్కువ శ్రవణము, పరుల = ఇతరులయొక్క, వారిం
పన్ = తీర్చుటకు, లోభమువల్లన్ = ఆశవలన, వివేకము = తెలివిని, క్లేశ
పడియెదరు = కష్టపడెదరు, ఇడుమలకున్ = కష్టములకు.

* ఎవ్వఁడు బుద్ధిమంతుఁడో ......... వృద్ధుఁడు - వృద్ధత్వమునకు
జ్ఞానము ప్రధానము కాని వయసు ప్రధానము కాదు. (ఇటు పలుకుటకు

కారణము, చూ. పు. 9. ఒకయిక్కట్టు......చెప్పుదురు.) రాఁగలప్పుడు = రావలసినప్పుడు, సాధనము = ఉపాయమును, విస్మయము = వెఱఁగుపాటు, ఏమిచేయుటకును తోఁచకపోవుట, కాపురుషలక్షణము = నీచపురుషుల లక్షణము (Cowardice, base wretchedness), ప్రతీకారము=మాఱుసేఁత, ఉపాయచింతనము (Remedy), సంఘీభవించి = గుంపుగాఁ గూడి.

పుట. 11. మదపుటేనుఁగు = మదము+ఏనుఁగు - కర్మధారయసమాసమునందు అచ్చుపరమైనపుడు ముువర్ణమునకు పువర్ణాదేశమును టుగాగమమును వచ్చినవి. సంఘీభవించి...బంధించుచున్నవి - అర్థాంతరన్యాసాలంకారము!

గగనమార్గమునకున్ = ఆకాశమార్గమునకు, వెఱఁగుపడి = ఆశ్చర్యపడి, చూపుమేరదూరము = కంటికి కనఁబడునంతదూరము, మాతాపితలు = తల్లిదండ్రులు, వాసస్థానము = ఉనికిపట్టు; సద్దు = శబ్దము.

పుట: 12. సవ్వడి = జాడ, లాఁగ వెలుపలికిన్ = లాఁగ యొక్క బయటికి, నేత్రోత్సవము = కనుల పండువును. విధి, కర్మ, పూర్వజన్మ మున్నగు శబ్దములచే సనాతనమత ప్రధానసిద్ధాంతము సూచితము.

బంధము = కట్టును, ఛేదించుటకయి=కొఱుకుటకై, బలిమి = బలము; నాఆశ్రితులబంధము=నన్నాశ్రయించియున్నవారి (సేవకుల) కట్టును, కోమలములు = మృదువులు, యథాశక్తి = శక్తికొలఁది, నిర్బంధము = కట్టును, తన్నుమాని......నీతిగాదు = తనరక్షణమును వదలుకొని యితరులను రక్షింపవలెననుట మంచిది కాదు. తన్నుమాలిన......కలదా = తనకు లేనప్పుడు ఉన్న కొంచెమును దానముచేయుట అసలుకు నష్టము వచ్చునట్లు చేసికొన్న బేరమువంటి దని యీసామెతతాత్పర్యము. లోకోక్తి = లోక+ఉక్తి=సామెత, సమస్త పురుషార్థములు = ధర్మము, అర్థము, కామము, మోక్షము మనునవి నాల్గు పురుషార్థములు; ధర్మము-శ్రుత్యుక్తధర్మాచరణమును వైదికక్రియా

నిర్వహణమును; అర్థము: న్యాయమార్గమున నైశ్వర్యసంపాదనము. కామము: ఇహలోక సౌఖ్యానుభవము. ధర్మవిరుద్ధములేని వాంఛాపూర్తి. మోక్షము: సంసారబంధవిముక్తి.

పుట: 13. ప్రాజ్ఞుఁడు = బుద్ధిమంతుఁడు, ధనజీవితములన్ = ధనమును ప్రాణమును, నావంటి... నేను - అన్నివిషయముల సమానులము అని భావము. ప్రభుత యొక్కటే భేదము. ఇప్పటికిన్ = ఈయపాయసమయమందు, నాప్రభుత్వమువలనన్ = నాదొరతనమువలన, హేయమై=విడువఁదగినదై, వినశ్వరము=మిక్కిలి నశించుస్వభావము కలది, ఈ కళేబరమందున్ = ఈశరీరమందు, ఆస్థ=అభిమానమును, యశము = కీర్తిని, హేయమై...సంపాదింపుము—క్షణమున నశించుశరీరమున నభిమాన ముంచకుము, శాశ్వత మగు కీర్తిని కోరుము అని భావము. (చూ. శరీరము క్షణ......స్థాయులు), జీతము = ధనరూపము, బత్తెము = ధాన్యరూపము అని భేదము. (జీతము - నియతకాలమున కొకపర్యాయ మిచ్చునట్టిది (Allowance of money or food paid monthly or at long fixed intervals), బత్తెము= ప్రతిదినము నిచ్చుకూలి (Daily allowance of money or food).

చూడకు - చూడకుము = వ్యతిరేకార్థక క్రియ గావున మువర్ణకమునకు ఎల్లయెడల లోపము వైకల్పికము. రక్షించితే = రక్షించితివి+ఏన్ - భూతార్థకమున మధ్యమపురుష 'వి' వర్ణకమునకును, ఏని-లోని 'ని' వర్ణకమునకును లోపము; అనిత్యము ఐ = నిత్యము కానిదై, మలినము= మురికి కలది, కాయముచేతన్ = శరీరముచేత, నిత్యము = శాశ్వతమైనది, అంతరము = భేదము, క్షణభంగురము=క్షణకాలములో నశించునట్టిది, కల్పాంతస్థాయులు= కల్పము తుదవఱకు నుండునవి. కల్ప మనఁగా బ్రహ్మదేవుని దినము, వేయి మహాయుగముల కాలము; ఒక మహాయుగమునకు 43 లక్షల 20 వేల సంవత్సరములు. ఆకల్పాంతమున భూమి ప్రళయ మందును అని పురాణము. పులకితుఁడై = గగుర్పుకలవాఁడై, మేలుమేలు - ఆమ్రేడితము, అవ్యయము.

ప్రశంసనార్థకము. ఆశ్రితవాత్సల్యము = ఆశ్రయించినవారియందు ప్రీతి, పాటి: విశేషము, కొలఁది - ఈయర్థమున నిది ఆ, ఈ, ఏశబ్దపూర్వకముగానే యుండును. త్రిలోకాధిపత్యమునకున్ = ముల్లోకముల నేలుటకు (స్వర్గలోక, భూలోక, పాతాళము లనెడు మూఁడులోకములను పాలించుటకు - అనఁగా నింద్రపదవికి అనియర్థము). తగులుకొలునకున్=తగులుకొన్నందులకు.

పుట. 14. బలగంబుతోన్ = పరివారముతోఁ గూడ, ఆతిథ్యము= విందు, వీడుకొలిపెను = సెలవిచ్చి పంపెను, నిజ+ఇచ్ఛన్ = తన యిచ్చ చొప్పున. మిత్రలాభము...కానము - చూ. పుట. 34. మిత్రలాభ మను లాభమువదరీ అను వాక్యముతో పోల్చునది. నీతో నా-ఈ ప్రశ్నలో ధ్వనించు నర్థమును గమనించునది. కారణము వెనుక తెలుపఁబడినది. భోగ్యమను = తినఁదగినవాఁడను (బా. కార. 33), భోక్తవు = తినువాఁడవు. జంబుకమును = నక్కను, పాశములోన్ = వలలో.

పుట. 15. మందారవతి = వ్యు. మందారవృక్షములు గలది. విచ్చలవిడిన్ = స్వేచ్ఛగా, పోతరించి = మదించి, బలిసి, ఒంటిఁ జేసిపోయిరి = తనొంటరిగ విడిచి వనాంతరముల కరిగిరి అనిభావమైనను, బంధువులందఱు చావఁగా నే నొక్కఁడనే మిగిలియున్నాఁడ ననిభావమైనను, మృతకల్పుఁడను = చచ్చినవానితో సమానుఁడను, దైవము = అదృష్ట మనియర్థము. తెనుఁగుకవులు దీనిని వేలుపు అనునర్థమున వాడుదురు. దైవముతో చెప్పుచున్నాను—నేను చెప్పునది సత్య మని భావము. దైవముతోఁ జెప్పుమాటలలో నసత్యమే యుండదనిభావము, సజ్జనదర్శనము = మంచివారిని చూచుట, తార్కాణము=దృష్టాంతము. నక్క తనభావము నేవిధముగాఁ బ్రకటించినదో చూడుఁడు. జంబుక+ఉత్తముఁడు = నక్కలలో శ్రేష్ఠుఁడు, కులశీలములను = కులమును స్వభావమును, కులమునకు శీలమునకును సన్నిహితసంబంధము కలదు.

పుట. 16. మార్జారమునకున్=మార్జాలమునకున్ = పిల్లికి, జరద్గవము- వ్యు. పోయిన కన్నులుకలది. (కన్నులుపోయినది.)

భాగీరథీతీరమందున్ = గంగానదియొడ్డున - భగీరథుఁ డను సూర్య వంశపురాజు తనతండ్రులకు మోక్షమిప్పించుటనిమిత్తము తపస్సుచేసి గంగను స్వర్గముండి భూలోకమునకు తెప్పించెను. గనుక గంగకు భాగీరథి యని పేరు కలిగినది. చీఁకు = గ్రుడ్డి. ఈశబ్దమున అరసున్న యుండవలెను. అట్లున్న చే చీఁకటి యనుశబ్దమునకు వ్యుత్పత్తికల్పించుటకు అనుకూలముగ నుండును. ఎరలోన్ = ఆహారములో, దీర్ఘకర్ణము - పొడవైనచెవులు కలది. కోలాహలము = కలకలము (అల్లరి), బిడాలము=పిల్లి, కడుదాపునకున్ = మిక్కిలి సమీపమునకు, సురిఁగిపోన్ = చుఱఁగి (పాఱి) పోవుటకు, అయితి=శక్యము, వల్ల; ఉపాయ+అంతరము = వేఱొకయుపాయము. ఱోటిలోఁ దలఁదూర్చి రోఁకటిపోటునకు వెఱవఁ దీఱునా?—ఇది యొకసామెత. ధాన్యము దంచు సమయమున ఱోటిలో తలదూర్చిన రోఁకటిదెబ్బ తగులక మానదు. ఆపద కలుగు నని తెలిసియుండియుం బ్రవేశించినవెనుక భయపడుటవలన లాభము లేదు. అనుభవించియే తీరవలయును అని భావము. ఎట్టయెదురన్ - చూ. బా. సం. 40. దెబ్బ=శక్తి.

పుట: 17. వధ్యుఁడు=చంపఁ దగినవాఁడు, పూజ్యాపూజ్యతలకు జాతివివక్షత గాక గుణములే ప్రధానము లని సూచితము. మాంసాశనము = మాంసాహారము, బ్రహ్మచారి - బ్రహ్మము = విద్య, వేదము. దానిని అభ్యసించువాఁడు బ్రహ్మచారి, చాంద్రాయణ వ్రతము = చాంద్రాయణ మనునట్టి వ్రతమును; చంద్రుని వృద్ధిక్షయముల ననుసరించి చేయునట్టి వ్రతము, చంద్రుని వృద్ధిక్షయముల ననుసరించి యన్నకబళములను హెచ్చించుచు చేయునట్టియొక వ్రతము. శుక్లపక్ష ప్రథమ మొదలు దినదినమున కొక్కొక్క కబళము వంతున హెచ్చించుచుఁ బున్నమనాఁడు పదునైదుకబళములు భుజించి బహుళ ప్రథమ మొదలు దినదినమున కొక్కొక్క కబళమువంతున తగ్గించుచు వచ్చి యమావాస్యనాఁడు నిరుపవాస ముండునట్టి వ్రతవిశేషము. దీని నమావాస్యనాఁడారంభించి కూడఁ జేయుదురు. ఇది కొన్నిపాతకములకు

ప్రాయశ్చిత్తముగా నొనర్చునట్టిది, ధర్మజ్ఞులు=ధర్మము తెలిసినవారు, ప్రశంసింపఁగాన్ = పొగడుచుండఁగా, విద్యా వయఃవృద్ధులు=విద్యచేతను వయస్సుచేతను పెద్దవారు, (బాలవ్యా. కారక. 33,34) మనసు = ఇష్టము, ఇల్లు త్రొక్కికొనివచ్చినవాఁడు = అతిథి (ఇదియొకజాతీయము.) మిక్కుటము = అధికము, కృష్ణకృష్ణ - సంతాపార్థకము - వినరానిమాట విన్నపుడు పాపపరిహారమునకు భగవన్నామస్మరణము చేయుట శిష్టాచారము. ఎంతమాట = ఎంతపాపము పుట్టించుమాట, నిష్కాముఁడను = ఆశలు లేనివాఁడను, నే నిట్టి పాపము చేయుదునా?-చేయకుండుటకు హేతువు "ధర్మశాస్త్రములు, విని నిష్కాముఁడై చాంద్రాయణవ్రతము చేయుచుండుట." పరస్పరవిరుద్ధములు= ఒకదాని కొకటి విరోధము గలవి. అహింసా...ధర్మః—అహింసా = హింస చేయకుండుట - పరమః =ఉత్తమమైన-ధర్మః=ధర్మము, ధర్మః+అనుచోన్= ధర్మయనుచో - అనుకరణమందు విసర్గము లోపించి, యడాగము వచ్చినది.- జంతుహింస చేయకుండుటయే మేలైన ధర్మమని యభిప్రాయము, ఐకమత్యము =ఒకటే యభిప్రాయము కలిగియుండుట.

పుట. 18 భూతములు = ప్రాణులు, కరస్థము = చేతిలోనిది - మిక్కిలి సులభ మనుట. ధర్మములు=పుణ్యములు, కడపట......రాఁబోదు- జీవితాంతమున మరణించునపుడు తనతో తానుచేసిన పుణ్యపాపకార్యములు దప్ప తక్కిన వేవియు రావని మన్వాదిశాస్త్రము లుద్ఘోషించును. Cp. "వెళ్లిపోయేనాఁడు వెంటరావు." స్వేచ్ఛగముగాన్=యథేచ్ఛగా, శోకముతోన్= దూరతో, క్షుధన్=ఆఁకలిని, పాడుపొట్ట=నీచమయిన పొట్ట. (దేనిని తిన్నను ఆఁకలి యణఁగును గనుక), పాలుపడును = పూనుకొనును, నడికిరేయి = నడిమికిన్+రేయి=రూ. నడిరేయి = అర్ధరాత్రమునందు, (సప్తమ్యర్థమున ప్రథమావిభక్తి), అక్కి = చీల్చి, పంచువులతోన్ = ముక్కులతో.

పుట. 19. ప్రథమదర్శన దినంబుననే = మొదటఁ జూచినట్టి దినము కాదు, నీకు మాఱులేదు గనుకన్ - నీ కెదురాడువారు లేనందువల్ల, వదరు

చున్నావు = ప్రేలుచున్నావు. (ఉపయోగము లేనిమాట లూరక మాటలాడు చున్నావు); మ్రానులేని...కదా?—లోకోక్తి. స్వల్పబుద్ధియున్ = కొంచెము బుద్ధిగలవాఁడును, ఎన్నిక = తలంపు, ఆముదపుఁజెట్టు (బా. సం. 32, 34) లఘుబుద్ధులకున్ = అల్పబుద్ధిగలవారికి, కుటుంబము = సంసారము, మహాత్ములకు ......కుటుంబము = మహాత్ములు లోకమంతయుం సమానముగా తలంతురు. కాలుఁడు = యముఁడు, విషబుద్ధి = కుచ్చితపు తలంపు, వీఁడుమిత్రము - వీఁడు మిత్రుఁడు అనియుం నుండఁదగును. చూ. బా. తత్స. 18. నేస్తము = స్నేహము, క్షేత్రము = పంటపొలము.

పుట. 20. క్షేత్రస్వామి = పొలముకాఁపు, మరగినది = వాడుకపడినది, గూఢముగాన్ = రహస్యముగా, ఈ కాలపాశమువలనన్ = యముని యొక్క యీ పాశాయుధమునుండి, మరణకాలమున యముఁడు జీవునితన పాశముచే దేహమునుండి లాగునని పురాణము. దిక్కు = శరణము, ఈ విపత్తు మానుపఁగలఁడు - మిత్రుని స్వభావము కష్టకాలమున వెలిపడును.

లోపల సంతోషపడి = తాను పన్నినమాయచేత తనకోరిక ఫలించుచున్నదికదా యని. కదియఁబోయి - ఇట్లు పోవుట కాపాడుటకుఁ గాదు, వల గట్టిదై మృగము తప్పించుకొనుటకు వీలులేదు గదా యని నిశ్చయించుకొనుటకు, నులినరములతోన్ = సన్నని నరములతో, భట్టారకవారము = ఆదివారము. తలతోన్ = పూనికతో, తలతోఁ జేయుచున్నాను—తలయందు ధరించి తప్పక చేసెదను. జాతీయము. హరిణము = జింక.

పుట. 21. దాపించినవాఁడు = సమీపించినవాఁడు, చేటుఁగాలము. బాల. సం. 35. ఇక్కడనే యెక్కడనో-సమీపముననే యనుట, మంచి వారికి సహితము దుష్టులవలన భయము గలదు - చూ. భర్తృహరి వాక్యము:
గీ. కారణములేని కలహంబు గరుణలేమి, పరవధూ పరధనవాంఛ బంధు సాధు - జనములం దసహిష్ణుత్వ మనఁగ జగతిఁ, బ్రకృతి సిద్ధంబు లివి దుష్ట నికరమునకు॥ చేఁగాలము = ఆయువు ముగియుకాలము, దీపనిర్వాణ గంధ

ముఁగా = దీప మాఱిపోవునట్టి వాసనను, అరుంధతిని=అరుంధతి యను నక్ష త్రమును, అరుంధతి వసిష్ఠమహర్షి భార్య: మహాపతివ్రత. (సప్తర్షి మండల ములో వసిష్ఠ నక్షత్రమునకు దగ్గఱనుండు చిన్న చుక్క), మిత్రవాక్యమును= స్నేహితుని మాటను, మూర్కొనరు = వాసన చూడరు, కనరు = చూడరు, ఆ సంధ్యాకాలము తీఱినవాఁడు (చావు సమీపించినవాఁడు) దీప మాఱినప్పుడు కలుగు వాసనను మూర్కొనఁ డనియు, అరుంధతీనక్షత్రమును చూడఁ డనియు, మిత్రవాక్యము వినఁ డనియు క్రమాలంకారము. ప్రత్యక్షమందుఁగా =ఎదుట, ఇచ్చకములు = ప్రియవచనములు (flattery), పరోక్షమందుఁగా= మఱుఁగునందు, సంగాతకాఁడు = సంగాతము+కాఁడు = చెలికాఁడు, (Companion); పయోముఖ విషకుంభమువంటివాఁడు = పాలుపైనిగల విషకలశమువంటివాఁడు. (అనఁగా, పైభాగమున పాలును అడుగున విషమును గలిగిన కుండతో సమానుఁడు అని భావము.) ప్రత్యక్ష...వాఁడు...ఎదుట ముఖస్తుతి చేసి మఱుఁగున కార్యమును చెడఁగొట్టువాఁడు మోసము చేసి చంపు నని యర్థము. సాంగత్యము = స్నేహము.

నిట్టూర్పు = నిడు+ఊర్పు = పెద్దయూర్పు. సజ్జన సాంగత్యము వలన......ప్రాప్తించును = సత్పురుషుల సహవాసమువలన అన్నివిధములయిన మంగళములును, దుష్టుల సహవాసమువలన నెల్ల కీడులును కలుగును. జిత్తుల మారి మృగము=మోసమే స్వభావముగాఁ గల నక్క, తేనెమాటలు = తేనె వంటి మాటలు, నాలిక తీపు లోన విష మని యెఱుఁగుదునా!—ఇది యొక సామెత-రూ. అంగిట బెల్లము, ఆత్మలో విషము. మనసులోఁ జెడుతలంపు పెట్టు కొని పైకి మంచిమాటలాడుట యన్న విషయము నాకుఁ దెలియదు. వెరవు = ఉపాయము, మసలరాదు = ఆలస్యము చేయరాదు, బూరటించి = ఉబ్బించి, బిట్టుబిగిసికొని—బిట్టుబిగియు=బిగియు+బిగియు = మిక్కిలి బిగిసికొని - (బా. సం. 42) ఆమ్రేడితము.

పుట. 22. నేను...యుండెదను—ఈరెండును సామాన్యముగా మృగముల మరణలక్షణములు. మాయలమారి = మోసముగలది:మారి-తాచ్ఛీల్యమునవచ్చు ప్రత్యయము. ఒడియ = చిన్నదుడ్డుఃకఱ్ఱను, దైవికముగాన్ = విధివశమున, తాఁకు = దెబ్బ, హాని = కీడు మోసపుచ్చు-మోసము+పుచ్చు; ముపర్ణలోపము.

మిత్రభావము = మైత్రి, నీసౌజన్యమే...కొలుపుచున్నది—నీ మంచితనముచేతనే నేను నిన్నింతగా వేఁడుకొనుచున్నాఁడను. మాత్రానన్ = మాత్రము+నన్=బా. తత్స. 43. సౌఖ్యము-సుఖమేసౌఖ్యము-స్వార్థమునతద్ధితరూపము.

చపలుఁడవు = చంచలమైన స్వభావము కలవాఁడవు, సర్వథా = అన్నివిధములచేతను, (సర్వదాయనుపాఠమున అన్నిసమయములందును అని యర్థము.) దాయతో=శత్రువుతో, సాంగత్యము=కూడిక.

పుట. 23. అశక్యము = అసాధ్యమైనది, శక్యము = సాధ్యమైనది, అసాధ్యమును సాధించుట కష్టము అని భావము. అట్టు = మెడ, వెగటుమాటలు=విరసమైన పలుకులు, లోక+శ్రేష్ఠుఁడవు = లోకమునందు శ్రేష్ఠుఁడవు, సౌహార్దసౌఖ్యము = మంచిస్నేహముచేఁ గలుగు సౌఖ్యమును, సంగతము=చెలిమి, ప్రాయోపవేశము = మరణముకు కోరిచేయు నుపవాసవ్రతము, ప్రాయము=మరణార్థము సర్వకర్మపరిత్యాగపూర్వకమైన ఉపవాసము. దానికై ఉపవేశము = కూర్చుండుట. కాఁగా ప్రాయోపవేశము. మృద్ఘటము = మట్టికుండ, భేదింపవచ్చును = వేఱుపఱుపవచ్చును, పగులఁ గొట్టవచ్చును, సంధింపన్ = స్నేహముచేయుటకు, అతుకుటకు, హేమఘటమందువలెన్ = బంగారుకుండయందువలె, విపరీతము+ఐ = తలక్రిందై, మృద్ఘటము...యుండును—మట్టికుండను సులభముగా పగులఁగొట్టవచ్చునుగాని అతుకుటకు సాధ్యముగాదు. అట్లే దుర్జనునితో స్నేహమును చాల సులభముగా చెడఁగొట్ట.

వచ్చును గాని మరల కూర్చుట కష్టము. బంగారుకుండ నడుకవచ్చునుగాని పగులఁగొట్టుట మిక్కిలికష్టము. అట్లే సత్పురుషునితో సులభముగా స్నేహము చేయవచ్చునుగాని స్నేహమైనతరువాత నాస్నేహ మెన్నఁటికిని చెడదు. ద్రవత్వమువలనన్ = కరఁగుటవలన, నిమిత్తమువలనన్ = కారణమువలన, భయలోభములవలనన్ = భయమువలనను, ఆశవలనను; ద్రవత్వ...గలసికొందురు—లోహములు కరఁగుటచేత నొకటితో నొకటి కలసికొనును. మృగములును పక్షులును ఒకానొక కారణము చేత కలసికొనును. మూర్ఖులు భయముచేతఁగాని యాశచేతఁగాని కలయుదురు. సత్పురుషులు ఒకరినొకరు చూచిన మాత్రాననే కలసికొందురు. శుచిత్వము = కపటములేమి, త్యాగము = దానశీలత, శౌర్యము=శత్రుసంహారసామర్థ్యము, సుఖదుఃఖములయందు సామాన్యము = సుఖము కలిగినప్పుడును దుఃఖము కలిగినప్పుడును సమానభావము. సుహృద్గుణములు = స్నేహితునియొక్క గుణములు..

వచన+అమృతము చేన్ = మాట లనెడు అమృతము చేత.

పుట. 24. ప్రీతిపూర్వకము = ప్రీతి సంబంధముగలది, సజ్జనసల్లాపము= సత్పురుషులతోడి ముచ్చట, గంధసారము = మంచిగంధము; హిమ+అంబు+పూరము = పన్నీటిప్రవాహము, వారిజాత+వారము = కమలములసమూహము, గంధసార...వారము - ఈమూఁడును శైత్యోపచారమునందు ప్రసిద్ధికెక్కినవస్తువులు. ఒకటి = అన్యము; దుర్జనుఁడు...యొకటి - దుర్జనుఁడే కార్యమును త్రికరణశుద్ధిగఁ జేయఁడు, ఒకటి = ఏకము, సజ్జనుఁడు...యుండును - సత్పురుషుని కార్యము త్రికరణశుద్ధి యైనది. నీవలన=నీయొక్క+వలనన్ = నీయందు, నీ యభిమతమే = నీయిష్టమే, యథోచితసత్కారములు = తగినపూజలను, వివరము = కలుఁగు, నాఁటఁగోలెన్ = నాఁడు మొదలుకొని, కుశలప్రశ్నములచేతన్ = ఒకరిక్షేమము నింకొక రడుగుటచేత, అన్యోన్యాహారదానములచేతన్ = అన్యః+అన్య+ఆహారదానములచేతన్ =

ఒండొరుల కాహారము లిచ్చుకొనుటచేతను, విస్రంభ ఆలాపములచేతన్ =నమ్మక
ముగా మాటలాడుకొనుటచేతను, కష్టతరలభ్యము = మిక్కిలి కష్టముచేతఁ
బొందఁదగినది, తర-ప్రత్యయము. తగినయెడకున్ = తగినచోటికి, కేశములు
=వెండ్రుకలు, నఖములు = గోళ్లు, నరులు=మనుష్యులు, స్థానభ్రంశమును =
తానున్నచోటనుండి పడుట, రాణింపరు=శోభింపరు, మతిమంతుఁడు = బుద్ధి
గలవాఁడు, ఈయర్థము = ఈవిషయము, వచనము = మాట, దుర్బలవిష
యము=బలములేనివారి సంగతి, విచ్చలవిడిన్ = విడి+విడిన్ = విచ్చలవిడిన్
=స్వేచ్ఛగా, కాపురుషులు = కుచ్ఛితపు పురుషులు.

పుట. 25. పాదము=అడుగును, మోపి = ఉంచి, స్థానాంతరము =
వేఱొకచోటు, పూర్వస్థానము=మొదటి చోటును, గంతవ్యస్థానము = పోవల
సిన చోటును, నిరూపించుకొనక = ఏర్పఱుచుకొనక, కర్పూరగౌరము =
కర్పూరమువలెఁ దెల్లనిది, సరోవరము = మేలయిన కొలను, కూర్మరాజు =
తాఁబేటి రాజు, సహజధార్మికుఁడు=స్వభావముచేతనే ధర్మము చేయువాఁడు,
నడచుకోలు=నడచుకొనుట, కోలు-కొను అనుబంధ మగుచో భావార్థకమున
దాని కాదేశముగ వచ్చురూపము. దుష్కరము=కష్టము - [పరులకు......
గాదా - నేఁటి సంఘమున పరోపదేశ పాండిత్యము ప్రబలి బహునాయ
కత్వము వెలయుంట చింతింపఁదగిన విషయము.] తామేటిమేటి = తాఁబేళ్ల
రాజు. మీన+ఆది+ఆహారదానములచేతన్ = చేఁపలు మొదలుగాఁ గల యా
హార మిచ్చుటలచేత, భరింపన్ = పోషించుటకు, సమ్మానము = గౌర
వము, జీవనము=బ్రతుకు తెరువు, విద్యాగమము = విద్యాలాభము, వల్లె అని=
అట్లే యని, అంగీకారసూచకము - అవ్యయము, సరస+ఆలాపములు = రసు
వంతములయిన మాటలను, కతిపయ దినంబులన్=కొన్ని దినములకు.

పుణ్యకర్ములలోపలన్=పుణ్యకార్యములు చేయువారిలో, ధురీణుఁడు
= మొదటివాఁడు, శ్రేష్ఠుఁడు, గుణరత్నాకరుఁడు = గుణములకు సముద్రుని

వంటివాఁడు, శేషుఁడు సహితము = ఆదిశేషుఁడుగూడ, (వేయినోళ్లు గలవాఁడు కనుక వర్ణింప నశక్య మని తెలుపుట కితనిని నిదర్శనముగాఁ జెప్పుటవాడుక), ఈతనిగుణములు... పాటివాఁడను: కావ్యార్థాపత్త్యలంకారము.

పుట. 26. చంపకవతి=సంపెఁగ వృక్షములు కలది, పాటి=కొల్లఁదిది. (ఈ యర్థమున నిది ఆ, ఈ, ఏ అను విశేషణముల తరువాత నే వచ్చును.)

పరివ్రాజకుఁడు = సన్న్యాసి, వంటకము = అన్నమును, చిలుకకొయ్య=ఒంకె (వస్త్రములు మొదలైనవి యుంచుటకుఁగాను గోడయందు కొట్టినచిలుకవంటి యాకారము గలకొయ్య), మీఁదు-విశేష్యము. గిలుకకఱ్ఱ=గిలుక కట్టినకఱ్ఱ ('గిలక' సరియైన రూపము) (గిలగిల మ్రోఁగునట్టిది). ఎక్కడి... కొయ్య - విషమాలంకారము. భిక్షార్థము = భిక్షకొఱకు. భోజ్యపదార్థములు = భుజింపఁదగిన వస్తువులు, బ్రాహ్మణి = బ్రాహ్మణస్త్రీ, సేకరించి = సంగ్రహించి, వలసిన పనులకుఁ = ఆవశ్యకమైన కార్యములకు, విస్తరించి = అధికముగా, పదార్థసంగ్రహము = వస్తువుల చేర్చుట; తేని-'తెచ్చు'నకు వ్యతిరేకార్థకవిశేషణము. (చూ. బాల. క్రి. 50)

పుట. 27. తిలలు = నువ్వులను, చల్లులాడెను = చల్లెను, అంటుఇడ్డవి = మైలపొందినవి, లోఁగిటికిఁ - ప్రథమావిభక్తిలోఁగిలి. ఇంటిలోపలిభాగము. పాఱుత = బ్రాహ్మణి, చేరుడు నూవులు—చేరుడు = తెల్లఁగా దంచని బియ్యములో నగునది. (వృత్తియందు ఏకవచనాంతము). దంచిననూవులు = దంపుడు నువ్వులు, పుచ్చుకొను—బా. క్రి. 60. బలిమి = బలము, సదావాసము = ఎడతెగనియునికి. తడవులఁబట్టి = చాలకాలము నుండి.

పుట. 28. వివరము = కలుఁగు. చిరకాల+ఉపార్జితము = చాలకాలమునుండి సంపాదింపఁబడినది, సత్త్వ ఉత్సాహములు = బలమును తెగువయును, కృశించి = చిక్కి, సర్వ శ్రేయములకు = ఎల్ల మంగళములకును

నిదానము = మొదటికారణము, జీవనము = బ్రదుకు, కోలుపోయి = పోఁగొట్టుకొని, తొంటి = మునుపటి, జవసత్త్వములు = వేగమును బలమును, ఉడిగి = తగ్గి, స్వజాతిసామ్యము=తనజాతితో సమానమైన ధర్మమును;

అర్థపరిహీనునకున్ = ధనముచే విడువఁబడినవానికి (ధనము లేనివానికి), నిరంతరము=ఎల్లప్పుడు, ఖేదము=దుఃఖము, బుద్ధిహీనత్వము = బుద్ధిలేనితనము, నిదాఘనదీపూరములు = ఎండకాలమునందలి నదుల ప్రవాహము, పౌరుషము = పురుషవ్యాపారము, మేధాసంపత్తి = బుద్ధియొక్కబలము, పుత్త్రమిత్త్రవిరహితునిగృహము = బిడ్డలచేతను స్నేహితులచేతను విడువఁబడినవాని యిల్లు, పుత్త్రమిత్త్ర...సర్వశూన్యము = కొడుకులు లేనివాని కిల్లుమాత్రమే శూన్యమైనది, మూర్ఖునకు తెలివిమాత్రము శూన్యము, దరిద్రునకు సమస్తమును శూన్యముగా నుండును. ఆపాతయాతనావహము = అప్పుడుమాత్రమే వేదనను కల్గించునది, యావజ్జీవము = బ్రతికియున్నంతకాలము, తీవ్రవేదనాకరము = గొప్పబాధను చేయునది, ఇంద్రియములన్ = అవయవములచేతను, నామమునన్ = పేరుచేతను, వచః ధోరణిన్ = మాటల ధోరణిచేతను, లాఁతివాఁడు = ఇతరుఁడు, ఇంద్రియ...దగును - ధనము పోయినపిమ్మట పురుషునకు బుద్ధిరూపాదులు పూర్వ మున్న వేయైనను మునుపటియుత్సాహము, గౌరవము నుండ దనిభావము. ఖిన్నుఁడను=దుఃఖము గలవాఁడను, చెప్పికోలు =చెప్పికొనుట, అర్థనాశము = ధనముయొక్కపోకడ, మనస్తాపము = మనోదుఃఖము, దుశ్చరితము=చెడ్డనడత, వంచనము = మోసము, పరాభవము=అవమానము.

పుట. 29. పౌరుషము = పురుషప్రయత్నము, కుసుమస్తబకము = పూలగుత్తి, మూర్ధముమీఁదనయినను = తలమీఁదనైనను, నమసిపోవలెన్ = నశించిపోవలెను-పూలగుత్తి యందఱిచేతను తలయందు ధరింపఁబడును, లేదా, అడవియందు రాలియైనను పోవును, అట్లే మానముకలవాఁడు అందఱిచేగౌరవ

మును పొందవలయును, లేదా, యడవికిఁ బోయి యొకరికంటఁబడక యచ్చట నశించియైనను బోవలయును. గర్హితము = నిందింపఁబడినది, మ్రుక్కడిని = నీచుని, తొలఁగుట = విడుచుట, మౌనము = నోరుమూసికొనియుండుట, పరధన అపహారణము = ఇతరులధనమును దొంగలించుట, తిరియుట = తిరిప మెత్తుట = బిచ్చమెత్తుట, శ్రేయము = మేలు, సేవావృత్తి...హరించును— సేవావృత్తిచే మానముపోవును, యాచనావృత్తిచే గౌరవము నశించును, పెట్టు వోఁతలకున్ = పెట్టు+పోఁతలకున్ = అన్నము పెట్టుటకును నీళ్లుపోయుట కును, దోసిలి ఒగ్గి = చేతులు చాఁచి, లోభము త్రిప్పులకున్ = ఆశయొక్క తిరుగఁజేయుటలకు – లోభము...లోనయి = ఆశ త్రిప్పినట్లెల్లఁ దిరుగును.

అర్థసంగ్రహము=ధనము సంపాదించుకొనుట, మోహము=అజ్ఞానము, ఉత్పాదించును = పుట్టించును, జ్వలనమువలెన్ = అగ్నివలె, స్వాశ్రయమునకున్ = తన కాధారమైన వస్తువునకు, దుఃఖము ..పుట్టించును = అగ్ని తనయాధారమును కాల్చివేయును, అట్లే దుఃఖమును తన కాధారమైన పురుషుని నాశముచేయును. లోభము మోహమును...పుట్టించును...కారణ మాలాలంకారము. తగిలియుండెనా...యుండనా?...ఆ దెబ్బ దైవవశమువలన తప్పుటవల్ల బ్రదికితిని గాని ఆ దెబ్బతగిలియేయుండినయెడల నేను తప్పక మృతి పొంది యుందును. తత్+వర్జనముకంటెన్ = ఆధనాశనువదలి పెట్టుటకంటె ఉదరముకయి = కడుపునకై, గోఁడక = పీడింపక, ప్రాప్తలాభంబునకున్ = పొందఁబడిన లాభమునకు.

పుట. 30. సుఖి = సుఖపడువాఁడు; తత్ తత్ కర్మానుసారముగాన్ = వానివాని కర్మములకుఁ దగినట్లుగా, దేహికిన్ = ప్రాణికి, ప్రయాసపాటు = కష్టపడుట (బా. సం. 46), నిరర్థకము = ప్రయోజనములేనిది. కాణాచి = రూ. కాణయాచి=చిరకాలవాసస్థానము, ఈ చెడగరపు బోడకత్తి మోఁదులు= ఈ దుష్టుఁడయిన సన్న్యాసియొక్క కత్తిదెబ్బలు. చెడగరము = క్రూరము;

బోడ = సన్న్యాసి. విజనప్రదేశము = జనులులేనిచోటు, శిలా అంతరాళ మందలి = రాతిలోపలనున్న, భరించుదయామయుఁడు = పోషించునట్టి దయచే నిండినవాఁడు (భగవంతుఁడు), నీ ఆశ్రయము = నీయండ, కాయగసరులు - కాయయును కసరును కాయగసరులు - ద్వంద్వసమా. కసరు=లేఁత కాయ. సంసారవిషవృక్షమునకున్ = సంసారము అనెడు విషపుచెట్టునకు, అమృతతుల్యములు=అమృతమువంటివి, కావ్య అమృత రసపానము = కావ్యమనునట్టి యమృతరసముయొక్క త్రాగుట, సజ్జనసంగతి = సత్పురుష సహవాసము. సంసారవిష... పాన మొకటి-రూప కాలంకారము.

అర్థములు = ధనములు, యౌవనము = వయస్సు, ఝరీవేగతుల్యము= ప్రవాహముయొక్క వేగముతో సమానము, బుద్బుదప్రాయము = నీటిబుడగ వంటిది, సత్వరముగాన్ = త్వరతోఁ గూడినట్టుగా, శోకఅగ్నిన్ = దుఃఖము అనునిప్పుచేత, అతిసంచయము = మిక్కిలి కూడఁబెట్టుట, తటాక+ఉదర+జలములకున్ = చెఱువులోని నీటికి, పరీవాహమువలెన్ = కలుఁజు (చెఱువులోనగువానినీరు పోవుటకు జాతితోఁగట్టినమార్గము)వలె.

పుట. 31. సమార్జితవిత్తములకున్ = సంపాదింపఁబడిన ధనములకు, తటాకోదర...రక్షణము = చెఱువులోని నీరు కలుఁజులు పాఱుటచే నిలుచునట్లు సంపాదించిన ధనమును దానముచేసినయెడల నది నిలుచు ననిభావము. దాఁపఱికము చేయుట = దాఁచిపెట్టుట, వాయికట్టి కడుపుకట్టి = నోటికి కావలసిదానిని తినక కడుపునిండ భుజింపక, గడించువాఁడు=చేర్చునట్టివాఁడు, క్లేశమునకున్ = కష్టమునకు, పాత్రము = చోటు, భోగత్యాగములకున్ = అనుభవించుటకును ఇచ్చుటకును; వినియోగింపని ధనము = ఉపయోగింపని ద్రవ్యము, హాని = తక్కువ. భోగత్యాగ......యేమి? = తన కుపయోగింపనిధనమున్నను పోయినను ఒక్కటే. భోగవిరహముచేన్ = అనుభవము యొక్క లేమిచేత (అనుభవమునకు లేకపోవుట చేత), ధనార్జన...యందున్-

ధనముయొక్క సంపాదనమందును, కాపుదలయందును నాశనమునందును, విశే-షము = అధికము, లోభి...విశేషము - లోభి యెంత ధనము కలవాఁడైనను అనుభవము లేనివాఁడగుటచే దరిద్రునితో సమానుఁడేయైనను ధనమును కాపాడునట్టి కష్టమొక్కటి దరిద్రునికంటె నతనికి హెచ్చుగా నున్నది. Cp. విత్తము గడనయం...పుట్టించుచున్నది. (పుట, 34) ప్రియవచనములతోడి దానము = మంచిమాటలు చెప్పుచు నిచ్చునట్టి దానము (బా. సం. 43). గర్వసహితము = గర్వముతోఁ గూడినది, క్షమాసహితము=ఓర్పుతోఁగూడినది, త్యాగయుక్తము= ఈవితోఁగూడినది, ప్రియవచన...దుర్లభములు-దానము చేసి మంచి మాటలాడుటయు, విద్యకలిగియుం గర్వము లేకుండుటయు, పరాక్రమముండియుం నోర్పుకలిగియుండుటయు, ధనికుఁడై దాత యగుటయుం మిక్కిలి గొప్ప లక్షణములు. అతిసంచయేచ్ఛ = మిక్కిలి చేర్చుటయం దాశ. మిక్కిలి వస్తువులు - మిక్కిలివిశేషణము.

కల్యాణకటకము = మంగళకరమైన రాజధాని, వ్యాధుఁడు = బోయవాఁడు, సింగాణి=విల్లు, తూపులు = బాణములు, వల = మృగములు పక్షులు మొదలగువానిఁ బట్టెడు వాగుర, ఉరులు=ఉచ్చులు, చిక్కము=సంచి, లోనగు సాధనములు = మొదలుగాఁ గల పరికరములను;

పది = మాటును - (Ambush), మచ్చు = వలలో పెట్టునాహారము, అఱకడన్ = అఱ+కడన్ = మూఁపుమీఁద, నడగొండవలెన్=నడచుచున్న పర్వతమో యనునట్లు, ఆమృగయుండు = ఆ వేఁటకాఁడు.

పుట. 32. ఎక్కుపెట్టి = నారి తగిలించి, సంధించి=తొడిగి, సూకరమున్ = పందిని, ఏటు = దెబ్బ, వరాహము = పంది, క్రోధచోదితము = కోపముచేఁ బ్రేరేపింపఁబడినది, శరవేగమునన్ = బాణముయొక్క వేగముం వంటి వేగముచేత, కొమ్ము = పందికోఱ, మొదలు = వేరు, కిరాత వరాహముల త్రొక్కుడులన్ = బోయవానియొక్కయుం పందియొక్కయుం నడుగుల

యదుముద్దులచేత, త్రొక్కుడి-ఏకవ. దీర్ఘరావము = నిడుపయిన ధ్వనిగలది, పుష్కలముగాన్ = సమృద్ధిగా, గ్రాసము = ఆహారము, సారి = ఆర్తిత్రాడు, చేరువకున్ = దగ్గఱకు, గొనయము = వింటినారి, నొక్కు = గట్టిగాపట్టి-బెట్టు=బిగువు, గనయము పెట్టు=వింటికొనయొక్క దెబ్బ (గొనయము వేఱు, గనయము వేఱు. గొనయము పెట్టు అనుట పొరపాటు), ఆఁలుచున్ = బాధచే నఱచుచు. విలవిల - తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము.

భుజించినదే = అనుభవించినదే, తనసొత్తు = వాస్తవమున తనకు సంబంధించినసొమ్ము, ఈక = ఈయక, (Cp. కడపట.....రాఁబోదు. చూ. పు. 18), మిగిలిపోయినది = అతిక్రమించిన దానిని, మించిపోయిన వెనుకటి గాథను, (What is now too late, What has gone by), త్రవ్వుకోన్ = ప్రస్తావమునకు తెచ్చుకొనుట (జరిగిన దానిని కలియఁబెట్టుకొనుటలో ప్రయోజన మేమియు లేదని భావము.)

పుట. 33. వగవరు = దుఃఖపడరు, వితాకుపడరు = పరవశత్వము నొందరు, క్రియావంతుఁడు = పనిచేయుంట కలవాఁడు (కార్యకారుఁ డని భావము.) పురుషుఁ...విద్వాంసుఁడు—ఎవఁడు శాస్త్రములు నుడివిన ప్రకారము కార్యము లాచరించునో వాఁడు విద్వాంసుఁడు, శాస్త్రములు చదివినంత మాత్రాననే విద్వాంసుఁడు కాఁడు. రోగశాంతి = రోగములతీఱుట, స్వహస్త దీపమువలెన్ = తనచేత నున్న దీపమువలె, వివేకహీనునికి...నిష్ఫలము = కన్నులు లేనప్పుడు దీప ముపయోగపడనియట్లు వివేకము లేనప్పుడు శాస్త్రము లుపయోగింపవు. మోదము = సంతోషము, పర్యాయమునన్ = వరుసగా, రాకడ = వచ్చుట, ఎఱుక = జ్ఞానము, తత్ శాసనమునకున్ = దానిపోకడకు, ధీరునకున్ = వికారమునొందని మనస్సు కలవానికి (పండితునకు), మాన్యత = గౌరవము, క్షుద్రునకున్ = అల్పునకు, పుష్కలముగాన్ = సమృద్ధిగా, నైసర్గికతేజము = స్వభావముచేఁగల్గిన పరాక్రమము, ఆయాసంపాటు = ఆయాసము + పాటు=శ్రమపడుట.

నీవచన అమృతమున్ = నీమాట యనెడు వచనమును, నామనంత + తాపమున్ = నాయొక్క కడలేని దుఃఖమును, నివారించితివి = పోఁగొట్టితివి.

పుట. 34. మిత్రలాభమను లాభసంపదః - లాభసంపదః = లాభము యొక్క కలుములు, మిత్రలాభమ్ అను = స్నేహితులయొక్క దొరకుట ననుస రించి నట్టివి-లక్ష్య సమన్వితము = ఉదాహరణముతోఁగూడినది, మిత్రలాభము ననుసరించియే తక్కినలాభములన్నియు నుండును, అనఁగా. మిత్రుని పడసిన తర్వాతనే యన్నిలాభములును చేకూరు నని భావము. శుకములను = చిలుకలను, మయూరములను = నెమిళ్లను, శుక్ల హరిత చిత్రములన్ = తెల్లనివిగను, పచ్చనివి గను, చిత్రవర్ణము కలవిగను; తత్ తత్ అనురూపమైన = వానివానికిఁదగిన, ఆయయి జంతువులకున్ = ఆయాప్రాణులకు, వృత్తిని = జీవనమును, ఈఅర్థము = ఈ విషయము, పడరానిపాట్లు = అనుభవింపరాని కష్టములను, విత్తము గడన యం...పుట్టించుచున్నది-Cp. ధనార్జనరక్షణహానులయందు (మా. పు. 31), దుఃఖ వీక మూలము = దుఃఖమునకు ముఖ్యమయిన కారణము, ధర్మార్థము = ధర్మ + అర్థము = ధర్మముకొఱకు, నిస్పృహత్వము = ఆశ లేనివాఁడగుట-అడుసు త్రొక్క నేల కాలు కడుగనేల? - ఈసామెతను పంక ప్రక్షాళనన్యాయ మందురు. ధర్మార్థ... నేల?—అడుసు త్రొక్కినపిమ్మట కాల్గడుగుకొనుటకంటె అడుసు త్రొక్కకయే యుండుట యెట్లు యుక్తమో అట్లే యాచించి ధర్మము చేయుట కంటె యాచింపకుండుటయే మేలు. (ధర్మమునకనియే యాచించినను అధనము కూడ వానికి మేలు చేయదు. ధనాశ యేదోయొకరూపమున సంకురింపఁగా తర్వాత దానికి దోహద మిచ్చినట్లు పెంపొందును గాన నసలే దానికి తా వీయకుండుట శ్రేయ మనిభావము.) Cp. Prevention is better than cure, వ్యాళములచేతన్ = క్రూరజంతువులచేత, మీలచేతన్ = చేఁపలచేతను, సర్వత్ర ... బడియెదును—ఎల్లప్పుడును ధనికునిచుట్టును యాచకులు మూఁగి యతనిని ధనమునకై పీడింతు రనిభావము. ధనతృష్ణ = ధనమునందలి యాశ, దాస్యమునకున్ = సేవకు, సింహాసనము = ముఖ్యస్థానము, రాజులు కూర్చుండి

ప్రభుత్వము కెలుపునట్టి యాసనమునకు సింహాసన మని పేరు. దాస్యము తృష్ణగల వానితలపై కూర్చుండి తనయధికారమును చలాయించును. అనఁగా, తృష్ణకు లోఁబడినవాఁడు సదా దానికి సేవకుఁడై యుండవలసివచ్చు నని తాత్పర్యము. నీసన్నికర్ష ప్రభావముచేతన్ = నీ సమీపమం దుండుటయొక్క మహిమచేత, సర్వమున్=అంతయును, నివర్తించినది=తొలఁగినది, కృత అర్థుఁడను=చేయఁబడిన ప్రయోజనములు కలవాఁడను (కోరిక లీడేఱినవాఁడను), నీతోడిసంగతి కంటెన్=నీతో సహవాసముకంటెను, నీతోడి ప్రణయమునకున్=నీతోస్నేహమునకు, ఒక్కకొఱఁతయుఁన్ = కొంచెము లోపమైనను, ఆమరణాంతములు =చావుయొక్క తుది యెల్లఁగాఁగలవి-చచ్చువఱకు నుండునవి, తత్ క్షణభంగురములు=ఆక్షణముననే నశించునవి. (చిరకాలము ఉండనివి అనిభావము. క్షణము=నాలుగు నిమిషముల కాలము), నిశ్శంకములు = సందేహములేనివి, మహాత్ములకున్=మహాత్+ఆత్ములకున్, = గొప్పమనస్సుకలవారికి, సహజము = స్వభావసిద్ధము, ప్రణయము... సహజము—గొప్పవారు స్నేహము చేసినయెడల నాస్నేహము మరణించువఱకు నుండును. వారికి కోపమువచ్చిన చిరకాలముండక త్వరగా నశించును, వారు దానము చేయునెడ నెట్టిసందేహములకు పాలుగాక తెగువతో నిత్తురు. ఇట్లుండుట వారిస్వభావమని తాత్పర్యము. పలికినన్-ఈక్రియకు కర్త "పుట. 33 "మంధరా"... మొదలు 'పు. 34, మహాత్ములకు సహజము" అనునంతవఱకు. హిరణ్యకలఘుపతనకులుం దానును... నుండెను—క్రియ యేకవచన మగుటకు చూ. బా. క్రి. 120.

పుట. 35. మూవురు=ముగ్గురు, సల్లాపములు = ముచ్చటలను, సలుపుచున్=చేయుచు, మహావేగముతోన్ = మహాత్+వేగముతోన్ = మిక్కిలి వడితో, పాఱి=పరుగెత్తి, వృక్షాగ్రము = చెట్టుకొనను. నిక్కి = పొడవై, చూపుమేరదూరములోన్=కనులకు అగపడునంతదూరమునందు, భయహేతువు =భయముపుట్టుటకు కారణము, నాకంటఁబడలేదు = నాకగపడలేదు, కచ్ఛపమూషికములు = తాఁబేలును మూషికమును మంథరహిరణ్యకులు, జలబిల

ములు=నీటినుండియు, కలఁగునుండియు (పంచమ్యర్థమునఁ బ్రథమ), పడంతు, పక్కలు=పార్శ్వములు, ఎగయన్=ఎగరునట్లు, రోఁజుచున్=నిట్టూర్పువిడుచుచు, ఇట్లు చేయుట ప్రాణరక్షణార్థము అతివేగముగ బహుదూరముపాఱి వచ్చుటం దెల్పును. చిత్ర అంగుఁడు=చిత్రమైన అంగములు కలవాఁడు, పట్టజాలక=అనుసరింపలేక, శరణాగతుఁడను=శరణము చొచ్చినవాఁడను, సర్వదానములు...సరికావు=సమస్తవిధములయిన దానములను ఎల్లనోములును అన్నియజ్ఞములును శరణుచొచ్చినవానిని రక్షించుటతో సాటి కావు. శరణాగతరక్షణము ధర్మము లన్నిట నుత్తమమైన దని స్మృత్యాదులు. దురితము = పాపము, ధర్మజ్ఞులు=ధర్మము నెఱిఁగినవారు, సకలధర్మవేత్తలు=సమస్తధర్మములను తెలిసినవారు, కలఁతపడి=కలఁగి, చెప్పెడు పాటివాఁడను = చెప్పఁగల్గిన సామర్థ్యముకలవాఁడను, వాగ్దోషమును=వాక్+దోషము=నోటితప్పిదమును = (మాటలాడుటలోఁ గల్గుతప్పును).

పుట. 36. కడపవలెను=పుచ్చవలెను, మీభారము=మీయిష్టము (నిశ్చయింపవలసిన బరువు మీమీఁద నున్నది), పాల...భారము=నన్ను కాపాడెదరో విడిచిపెట్టెదరో మీయిష్టము. చక్కనిజాతీయము. సాధువవు=సత్పురుషుఁడవు, అవశ్యము=తప్పక, ముఖ్యముగా, అపేక్షణీయము = కోరఁదగినది, యథేచ్ఛముగాన్=ఇచ్చవచ్చినట్లు, వర్తించుచున్=తిరుగుచు ఏమో=ఏమి+ఓ—'ఓ'ఊహను తెలుపును. ఈతావునీయిల్లుగా నెంచుకొని - ఆదరసూచక వాక్యము.

లేఁబచ్చికజొంపములు=లేఁతపచ్చికగుబురులు (బా. సం. 36, 37,) చిరకాలము = చాలకాలము; చేరమికిన్ = చేరకుండుటకు, ఇంత మసలుటకున్=ఇంత యాలస్యము చేయుటకు, ఇంతతడవు=ఇంత సేపు, శకుంత సంతానములు=పక్షుల గుంపులు, కొఱఁకులు = పక్షు లెరయేఱితినుచోట్లను, మాని = వదలి, ఇరవులకున్=ఉనికిపట్టులకు, వ్రేలు=గొల్లవాండ్రు, పసులకదుపులను=

పశువులమందలను, పల్లియలకున్=పల్లెలకు (ఊళ్లకు), ప్రతీచీముఖమునందున్=పడమటిదిక్కనెడు స్త్రీముఖమునందు, సిందూరతిలకమునందము=సిందూరపు (ఎఱ్ఱని) బొట్టుయొక్క చక్కఁదనమువంటి చక్కఁదనమును, (బా. సం. 34) వహించుచున్నవాఁడు=పొందుచున్నాఁడు, సూర్యుఁడు పడమటి దిక్కునప్రాలి యస్తమించు సమయము కావచ్చినదని తాత్పర్యము. తరణి+కిరణ+వారము=సూర్యునియొక్క కిరణములయొక్కసమూహము, ఆరాటము = వేదన, పెల్లు మీఱుచున్నది=మిక్కిలి యతిశయించుచున్నది. గమనవేగము = నడకయందు వడి, మీఁదు మిక్కిలి=కడుమిక్కిలి (విశేషణము), నాకంటఁబడునందాఁకన్=నాకగపడువఱకు, చిత్తము=మనస్సు, తత్తఱపడుచుండును=పరితపించును.

పుట. 37. నించి=నిండించి, జవాతిశయము=వేగముయొక్క యాధిక్యము, బహుయోజనములు=పెక్కు ఆమడలు, రాన్-ఓపుదును = రాఁగలుగుదును, అన్వర్థసంజ్ఞ=అర్థము ననుసరించిన (పొసఁగిన) పేరు, కొందలపడకుము=దుఃఖింపకుము, నిమిషమాత్రాన్=ఱెప్పపాటుకాలములోపల; నానాప్రదేశములు=పలువిధములైనచోట్లు, ఉరులలోన్ = ఉచ్చులలో, పడియనీరు=పల్లములో నిలిచియున్ననీటిని;

కీఁడుఁజేఁత=కీడు+చేఁత=చెడుగుచేయుట, దైవము=విధి, అలంఘ్యము=దాఁటఁగూడనిది, ప్రాప్తించిన వ్యసనమునకు = కలిగినకష్టమునకు, వ్యసనము=కష్టము. ప్రతీకారము=మాఱుసేఁత, ఆచెచ్చపడియుండఁదగదు = చేష్టలు దక్కియుండరాదు, కర్తవ్యము = చేయవలసినదానిని, నామార్గము = నేను వచ్చినదారిని (నారాకను అని యర్థము), హెచ్చరికపడి = జాగ్రత్తపడి, సదుపాయము=మంచి యుపాయమును, చేసితిరా = చేసితిరి+ఆ - 'ఆ'పక్షాంతరముం దెల్పు నవ్యయము. నా ఆశ=నామీఁది ఆశను, మనోవేగముతోన్ = మనస్వేగముతోన్=మనస్సుయొక్క వేగమువంటి వేగముతో.

పుట. 38. అనుసరించి=వెంబాడించి, మూఁడునో = కలుగునో, (ఈ శబ్దము అరసున్నతో నేయుండవలెను) తెలియుము=ఎఱుఁగుము (సకర్మకక్రి.)

ఒడంబఱిచి=ఒప్పించి, మ్రోఁతతోన్ = ధ్వనితో, తే లెండు = లెండు+లెండు, అమ్రేడితము పరమగునపుడు కృతహ్రాస్వమునకు దీర్ఘమగు. ప్రా. సం. 23 బుద్ధిహీనునకున్ = తెలివిచేత విడువఁబడినవానికి, సామాన్యముగా బుద్ధిమంతుఁడు సుఖించుటయు,బుద్ధిహీనుఁడు దుఃఖించుటయు సాజము. తద్వ్యతిరిక్తము కర్మాను భావము. ప్రాణులకున్ = జంతువులకు, సహజములు=తోడఁబుట్టినవి, నాపూర్వ కర్మము=నేను ముందు చేసినకర్మము, పలుమాఱు = మాటిమాటికి, పాలయితిని= వశమైతిని.

మచ్చు=వేఁటకాండ్రు మృగముల నాకర్షించుటకై యుంచునట్టి యాహారము. పన్ని=ఒడ్డి, బాల్యచాపలముచేతన్ = పిల్లతనముచేఁ గలుగు చప లత్వముచేత, పదువు=మంద. పేరెము వాఱుచున్ = పరుగెత్తుచు, చివుకచివు క్కనన్-దాఁటుటయం దగుననుకరణము. చవుకళించి=ఎగిరి, మాపదువు మృగ ములు=మా మందలోని జింకలు, ఆఁకిక్కించి=నిక్కించి.

పుట. 39. చట్రాతి మీఁదన్=చట్టు బండమీఁద, పెంచికలవలెన్= పెంకులవలె, నలువలంకులకున్ = నాలుగు దిక్కులకును, పాసితిని = వదలితిని, ముక్కాలుమ్మువీసమును=ముక్కాలును మువీసమును. సమాహారద్వంద్వము- బా. సమా. 17. పూర్వపదాంత నకారమునకు మకారాదేశము. పోయినది అను=పోయినది అని తలంచుము, నొవ్వక యుండన్=నొప్పి యెత్తకుండునట్లుగా, ఉరి=ఉచ్చును, కడఁగినవాఁడు=ప్రయత్నించినవాఁడు, అఱకిదన్ = మూఁపు నందు, ఏలుచున్న=పాలించుచున్న, రాజు కొమారునికిన్=రాచ కొమరునకు, మూఁడిదగాన్=కానుకగా, సాహిణమునకున్=గుఱ్ఱపుశాలకు, ఎదురు+కొట్టము లోన్=ఎదురుఁ గొట్టములోన్, పంచి=ఆజ్ఞాపించి, ఆహారదాన+ఆది+కార్య ములను=మేఁత వేయుట మొదలు గాఁగల కార్యములను, తఱితప్పక=వేళ యతి క్రమింపక, కట్టడచేసి=ఆజ్ఞాపించి, ముద్దుచేతన్=ప్రీతితో, నానాఁడున్=నాఁడు నాఁడు ఆమ్రేడితసంధి. దినక్రమమునన్ = దినముల వరుసచేత, బెదరు =

భయము, మచ్చికపడితిని=మరఁగితిని, కాచువాండ్రు = కావలియుండువారు' అనుమతిని=సమ్మతిచేత, బంగారు జంగెలు = బంగారుతోఁ జేసిన చిఱుగంటలు, కొలఁకు నీరు=కొలనియందలి నీరు; కొంతవడి=కొంచెము సేపు.

పుట. 40. కట్టుఁబట్టునకున్=కట్టెదుచోటికి, కూఁకలు+పెట్టుచున్ = అఱచుచు, ప్రమదవనము=అంతఃపురస్త్రీలు విహరించునట్టి యింటి యావరణమున చుట్టునుండు నుద్యానవనము, రూ. ప్రమదావనము. అంతిపురములోన్ = స్త్రీలుండునట్టి గృహభాగమునందు, శయనగృహమునకున్ = పడుకటింటికి, మిఱుమిట్లుగొలుపు = కన్నులుచెదరునట్లుచేయు, శ్రవణకుహరములు = చెవుల రంధ్రములను, విదారించు = చీల్చు, నిరంతర ధారమైన్ = ఎడలేని ధారలతో, కడవలతోన్ = కుండలతో, మిన్ను మన్ను ఏకమగునట్లు = ఆకాశమును నేలయు నొకటి యగునట్లు, కారుక్రమ్మి = నలుపు వ్యాపించి (వర్షకాలమున ఆకాశము నలుపెక్కునట్లు మబ్బు వ్యాపించిన రీతిని). కుతూహలపడి=ఆశగొని, పొలయఁగాన్ = వీవఁగా, దువాళించుచున్=(వేగమున అంతమేరయు సమముగా) పరుగెత్తుచు, సద్యస్‌జాతము = అప్పుడేపుట్టినది, కదంబ ముకుళజాతము = కడిమిమొగ్గలసమూహమును, వెండియున్=మఱల, ఆచమనము=కాళ్లుచేతులు కడుగుట మొదలయిన కార్యములు చేసినపుడు వెంటనే మంత్రములు చెప్పి ముమ్మాఱునీళ్లు త్రాగుట, చేయను = చేయుటకు, లంపటావానిన్ = దాసీపుత్రుని (Slave), వింతవారు = క్రొత్తవాండ్రు. (Strangers), లోఁగిటన్=లోఁగిలి+అన్=ఇంటియందు, మానిసికిన్=మనుష్యునకు, వఱువాతన్ = ప్రాతఃకాలమునందు, మనవిన్నమాటలు= మనము విన్నమాటలు-కర్తృపద ప్రథమకుషష్ఠి (ప్రౌఢ. కార. 15, 16).

పుట. 41. జ్యోతిశ్శాస్త్రపారంగతునిన్ = జ్యోతిశ్శాస్త్రముయొక్క తుదను ఎఱిఁగినవానిని, మృగము = నాలుగుకాళ్లజంతువు, మానుషభాషన్ = మనుష్యులమాటలచేత, భాషించుట = మాటలాడుట, అరిష్టసూచకము =

మరణమును సూచించునట్టిని. అప్పుడు కలిగినకష్టమును, కడ తేఱితిమి=కృతార్థులమైతిమి, పడ్డయిడుములు = అనుభవించినకష్టములు, విధి త్రిప్పులకున్ = దైవముయొక్క తిరుగఁజేయుటలకు (విధిపెట్టెడు త్రిప్పట్లకు), కుదుటన్ = నెమ్మదియందు, తడసితి = ఆలస్యము చేసితి, నిరంతరాయముగాన్ = ఆటంకములులేక, సాఁగెనేన్ = సాగెను + ఏన్ = జరిగినయెడల, తడవు = ఆలస్యము.

పుట. 42. పాపపుమాట = అనర్థమునుసూచించుమాట. నాకడుపుచఁ బాలువోసితివి-నామనసులోని వేదనను చల్లార్చితివి. జాతీయము. అయ్యారా—'అర' సంబోధన బహువచనప్రత్యయము! ఇట్టిసాహసము = ఇట్టితెగువను, ఇక్కట్టు = కష్టము, మెట్టులోన్ = నేలమీఁద, గమనవేగము = నడకయందువడి, నీరాక = నీవువచ్చుట, శుభఉదర్కముగాన్ = మంచియుత్తరఫలముగలదిగా (మంచిఫల మిచ్చునట్టిదిగా), మీఁదు మిక్కిలిగాన్ = కడుమిక్కిలిగా, తత్తఱింపన్ తొడఁగెను = పరితపింపసాఁగెను, వెనుకన్+కా = తర్వాతఁ గదా! నాగుండె కుదిరినది = నాగుండె నెమ్మదిపడినది, ఊరులు ఒడ్డినచోటికిన్ = ఉచ్చుపన్నిచియున్నస్థలమునకు, ఉఱికినది = పాఱిపోయినది. విల్లు ఎక్కుపెట్టి = వింటిని మోపెట్టి, అడుగులజాడ = అడుగులగుఱుతు, మాటలపరాకునన్ = మాటలయందలి తప్పరతచేత (Being off our guard), పెండ్లినడక = తిన్ననినడక, పొంచికొని = కనుపెట్టుకొని, ఎడఁ=సందు, సత్వరముగాన్ = వేగముగా, ఉఱికిపోఁడు = పాఱిపోండు.

పుట. 43. గనయమునన్ = వింటికొప్పునందు. వ్యసనమునకున్ = ఆపదకు, నిస్తరించితిమి = దాఁటితిమి, క్షణమునకున్ ముందు = కొంచెము సేపటికి ముందు, విషాదపడరాదు = దుఃఖపడరాదు. అనువు = తగినది, యుక్తము, అభిమతము = ఇష్టము, దుష్కరము = చేయ నశక్యమైనది,

మేను = శరీరము, ఎరియుచున్నది=మండుచున్నది, స్వాయత్తము = స్వాధీనమైనది, కర్తవ్యము = చేయఁదగినది, బుద్ధిశాలివి = బుద్ధిచే నొప్పువాఁడవు, తోఁపని యుపాయము = తెలియనియుపాయము. విపత్సముద్రముదరి = ఆపద యనుసముద్రముయొక్క గట్టును, శోకసముద్రముదరిన్ = శోకమనెడు సముద్రముయొక్క గట్టును, తరివలెన్ = ఓడవలె, చెలికానిని...జేర్పుము - ఉపమారూపకములు. తక్కన్ = తప్ప, అన్యము = వేఱు, శరణము = దిక్కు, నీమంపు = నీయాజ్ఞను, శిరసావహించి = తలతో మోచి, పాలివారము = భాగస్థులము, అందఱమును అనుభవింపవలసినవార మనిభావము. ప్రతీకారగవేషణము = బదులు వెదకుట.

పుట. 44. ఆవశ్యకము = ముఖ్యము. సర్వసమ్మతము అయినపక్షము= అందరికిని ఇష్టమైన విషయమును, అవలంబింతము = ఆశ్రయింతము. జలాశయముతీరమందున్ = మడుఁగునొడ్డున, ఒదికిలి = ఒరగి, ప్రాఁగన్ను = సోలినకంటిని, మోరసారించి = ముఖమును చాఁచి (మోర = పశ్వాదుల దీర్ఘముఖము) మెదలక = కొంచెమైనను చలింపక, అభినయించుచున్ = నటించుచు, చేరువకున్ = సమీపమునకు, (చూ. పుట. 21-22, ఊపిరి బిగియ...పాఱిపొమ్ము). బొఱియన్ = కలుఁగును. తత్ ఉక్తప్రకారంబునన్=వారిచేఁ జెప్పఁబడినరీతిని, నిర్వర్తింపన్ = నెఱవేర్పఁగా, తన పాలి కార్యము=తనవంతుపనిని,మనోరథసిద్ధిన్=కోరిక యీడేఱుటను, మృగయుఁడు =వేఁటకాఁడు, వగన్ బొంది=చింతపొంది, అల్లల్లన్=మెల్లమెల్లగా (అల్లన+అల్లన=అల్లల్లన, అల్లనల్లన), ఉనికిపట్టునకున్ = వాసస్థానమునకు, తమ యిరవునకున్ = తమయునికిపట్టునకు, తొంటియట్లు = మునుపటివిధమున (ఈ యాపదలు ప్రాప్తించుటకు ముందున్నట్లుగా), సుఖము+ఉండిరి =సుఖముతో నుండిరి. (తృతీయార్థమునఁ బ్రథమ. బా. కార. 21.)

# మిత్రభేదము

పుట. 45. అనంతరము=పిదప, రాజపుత్రులు=సుదర్శన రాజు కొడుకులు, విష్ణుశర్మ-ఇందలి శర్మ-బ్రాహ్మణుని తెలుపు బిరుదపదము - ఇటులే క్షత్రియులకు-వర్మ ; వైశ్యులకు-గుప్త ; శూద్రులకు - దాస యను సంకేతము లున్నవి. మిత్రలాభము = స్నేహితులను పొంది సుఖించుటను తెలుపు తంత్రము; మిత్రభేదము=(విరోధులలోని) స్నేహమును భేదించుట ; సింహవృషభములు=సింగమును ఎద్దును-ద్వంద్వ. చెలిమిగలిగి=స్నేహముగలిగి, మాయావి=జిత్తులమారి, గోమాయువు=నక్క, వ్యు. గోవులను బోవునట్లు చేయునది. విద్వేషము=విరోధము, సవిస్తరముగాఁ=విపులముగా, సావధానముగాఁ=చెవియొగ్గి, దక్షిణాపథమందుఁ = దక్షిణదేశమున, సార్థవాహుఁడు = వర్తకుఁడు, వ్యు. బేరులగుంపును (దేశాంతరము) పొందించువాఁడు. పురుషార్థములలోఁ = ధర్మము, అర్థము, కామము, మోక్షము-అను నాల్గింట, అర్థము = ధనము, అర్థవంతునకుఁ = ధనికునకు, ఉపాయముచేతఁ = తంత్రముచేత ; ద్రవ్యము = ధనము, తనియరాదు = తృప్తిచెందరాదు. జరామరణములు = ముసలితనమును చావును, ద్వంద్వం-స. గడియింపవలెను = ఆర్జింపవలెను. ధన+ఆర్జనమునకుఁ = ధనము సంపాదించుటకును, సాధనములు = పరికరములు, వాణిజ్యము = వర్తకము, సర్వప్రకారములచేఁ = అన్నివిధముల చేతను, విచారించి=ఆలోచించి, సేకరించుకొని=కూడఁబెట్టుకొని, వేసడములమీఁదఁ = కంచరపుగాడిదలపై.

పు. 46. భారవాహులఁ = మోఁతమోయువారిని, కంచరము = బండి, నట్టులను = ఎడ్లను, సముచితపరివారముతోఁ = తగినపరిజనులతో,

పయనము - ప్ర. ప్రయాణము. కాంతారమందున్ = అడవియందు, కాఁడికట్టు = కాఁడికోలకుఁగట్టిన మెడకట్టును, కంచరపుటెద్దులు - ఇందు పువర్ణమునకు టుగాగమము. చికిత్స = వైద్యము, మహారణ్యమధ్యము = గొప్ప యడవిలో నడిమిచోటు; పౌరుషము = పురుషుని ప్రయత్నము, విపరీతము = వ్యత్యస్తము, ఇమ్మునవ్వు = బోఁగామి, వెనుఁబడరాదు = వెనుఁదీయరాదు. సాధ్యము = సాధింపఁబడునది; బళకరము=కావలి, పోతరించి= బలిసి, లావు = బలము,విలిచి=కొని, ఆకాటియందున్ = కాడుశబ్దము-ఔప. ఆ యడవియందు, భాగ్యము=అదృష్టము, క్రూరసత్త్వములబారికిన్ = దుష్ట మృగముల వాత, నడయాడన్ సాగెను = తిరుగసాగెను.

పు. 47. వేల్పులయినన్=దేవతలయినను, విచ్చలవిడిగాన్ = (విడి+విడికాన్-ఆమ్రే.) స్వేచ్ఛగా, నానాఁడు=(ఆమ్రేడితము) దినదినము. కడుపు+ఆరన్ = పొట్టనిండుగా, మాఱుచెలఁగన్ = ప్రతిధ్వనించునట్లు, గణిల్లని - ధ్వన్యను కరణపదము. కాననమందున్=అడవియందు, పుండరీకములన్ = పులులను - సలుగులన్ = ఏదుపందులను, నలుగులంబడన్ = నలిగిపోవునట్లు, కాసరములన్=ఎనుఁబోతులను, మీసరముగాన్=క్రూరముగా, ఋక్షములన్= ఎలుఁగుగొడ్డులను - మ్రుక్కిడి మృగములన్ = క్షుద్రమృగములను, విహరించుచున్=తిరుగుచు, డప్పివడి = డస్సిపోయి, పిపాసితమై=దాహముగలదై, కచ్ఛము = గట్టు, ప్రళయ...ఘోషణము ప్రళయకాలమందలి-మేఘధ్వనిని పోలునట్టి - సంజీవకముయొక్క-భయంకరమైన - ఱంకెను. వెఱఁగుచేన్ = భీతిచేత, రాపడి = (రాయి+పడి) చేష్టలుడిగి, జంబుకములు = నక్కలు, రావమున్ = ధ్వనిని, కొంతవడికిన్ = కొంతసేపటికి, సంబళించుకొని = తెప్పిరి, ఆవలనికిన్ = ఆవైపునకు, క్రేఁగంటిచూపు = (క్రేవ - కన్ను) కడగంటిచూపు; ఆలించి = విని.

పు. 48. బెట్టిదపు = (ప్ర. భీతిదపు) భయమిచ్చునట్టి, ఊలివు=ధ్వని. "అంత...వారము"—విషమాలంకారము. కానము=చూడము, నిన్నమాపో=

నిన్నసాయంకాలమో - మాయుంధాతు. కృ. మాఁపు. నేఁడు రేపో = నేటి యుందయమో; (రేఁగుధా. కృదం. రేఁపు) ఇడుమపాటు = కష్టము. మాన్యక్షేత్రము = పన్నుకట్టనిపొలము ; లాఁతి = ఇతరమైన, అభిజనము = పెద్దలుండుచోటు, దుస్త్యజమే = విడువరానిదే. వలసదీయు = ఉన్నచోటువిడిచి పాఱిపోవు, "పిట్టకొంచెము కూఁతఘనము"—సామెత. క్షుద్రజంతువు×మహాజంతువు, పెద్దనోరు = గొప్పధ్వని, కలగుండు = కలఁత, క్షోభము = కలఁత, అలబలము=కలకలము, ఆకళింతకుఁ = గ్రహించుటకు, స్మరణకుఁ = జ్ఞప్తికి, ఈడిగిలఁబడిన = ఎత్తుపడిన.

పు. 49. చియ్యఁబట్టి = చేవయెక్కి, అట్టాడఁగాఁ = నడయాడు చుండఁగా, మనకంటెకూరుఁడు=మనకంటెఁ బిఱికి అని యిచట గ్రహించునది. వ్యతిరేకలక్షణ. ఒప్పరికింపరాదు = అలక్ష్యము సేయరాదు. కొలువు=ఉద్యోగము, అనుగ్రహము=దయ. నిగ్రహము=త్రోసిపెట్టుటను, మోఱకుఁదనము= మూర్ఖత్వము, ఎత్తువారిచేతిబిడ్డ = ఎవరేమి సెప్పినను వినువాఁడు. తెన్ను = త్రోవ. ఉదరపోషణము = పొట్టనించుకొనుట, హేయము = నింద్యము, పరాయత్తవర్తనుఁడు = ఇతరులకు లొంగిన నడవడిఁగలవాఁడు, మృతకల్పుఁడు=చచ్చినవానితో సమానుఁడు. ఇందలి కల్పప్రత్యయము కొంతహెచ్చుతక్కువ సమానుఁడనుట దెలుపును. నిస్తరించును = తొలఁగును. ఉపేక్షితుఁడు=అశ్రద్ధచేయఁబడినవాఁడు, పరాభూతుఁడు=అవమానితుఁడు, స్వచ్ఛంద వృత్తి = స్వేచ్ఛతోడి జీవనము, ప్రాప్తలాభముచేఁ = దొరకిన లాభముచే.

పు. 50. జోలి = పని, ముప్పు=ఆపద, మహాత్+విభవసంపన్నుఁడు = గొప్పవిభవమనెడి సంపదగలవాఁడు, వైశ్యుఁడు = కోమటి, సంతానము = సంతతి—ఆరామతటాక+ఆదిప్రతిష్ఠలఁ=తోఁటవేయించుట, చెఱువు త్రవ్వించుట మున్నగు కార్యములందు, వెచ్చించుచుఁ = వ్యయపెట్టుచు. దేవళము = గుడి, జీర్ణమై = శిథిలమై, కారుష్ణలను = పద్రఁగులను,

రావించి = రప్పించి, వేతనములు = జీతములు, నియోగించెను = ఆజ్ఞాపించెను. సుకరముగాఁ = సులభముగా, సూత్రధారుఁడు = దారముతో మ్రాఁకుపై గీఱలువేయువాఁడు, పరిసరతరువులందుఁ = సమీపమునందున్న చెట్లులందు, మహీరుహములు=చెట్లు, కుప్పించి=దూఁకి, ఉఱుగొట్టి=గుబ్బుమని, తుఱువు = తొడ, కిలకిలారావములు = కిలకిలమనుధ్వనులు.

పు. 51. ముష్కము=బీజము, నెఱియ=చీలిక, కాలధర్మమునొందెను=చచ్చెను. భృత్యపదమందుఁ=సేవకపదవిని, స్వామిహితాహితముల విచారము=ప్రభువు మేలుకీళ్లనుగూర్చిన యాలోచన, పర+అధికారము = ఇతరుల యధికారము, ఓంద్ర = గాడిదకూఁత, వారణాసి = వారాణసి, వరణ అసి అనెడి నదులు పాఱుటచేత నీ పేరుగలిగెను. మెయిమఱచి=ఒడలు తెలియక, గుఱువెట్టి = గుఱకపెట్టి, కాలిబందము = కాలికట్టు, ఒండొంటితోఁ = ఒకటిమఱి యొకటితో, దొర = యజమానుఁడు, దొద్దవోఁగాఁ = కొల్లపోఁగా, ఉప్పరికింపవచ్చునా = ఉపేక్షింపవచ్చునా? రాత్రిందివము = రాత్రియుఁబగలును, ప్రమాదపడక = పొరపాటు లేక, ఏలిక = యజమానుఁడు, సాకతము = దయ, కమికెఁడు = పిడికెఁడు. (కమికిలి+ఎఁడు).

పు. 52. పాటెఱుంగని = కష్టముదెలిసికొనని, మిన్నకుండుట = ఊరకుండుట, ఖరశ్వానములు = గాడిదయును కుక్కయును. దురాత్మ = దుష్టుఁడ! పోరామి = సంకటము, స్వామిదోషములు = యజమానుని తప్పులు. తడవి = విచారించి, భృత్యునకుఁ = సేవకునకు, స్వార్థపరుఁడు = తనమేలునుగోరువాఁడు, స్వకృత్యమునందుఁ ప్రవర్తింపఁడేని = తనపని చేయకుండెనేని, కృతఘ్నుండు=మేలుమఱచినవాఁడు × కృతజ్ఞుఁడు, దొసఁగు పొసఁగు = ఆపదకలుఁగు, ప్రబోధించెదను=లేపెదను. మడివేలు = చాఁకలి, బడియతోఁ = దుడ్డుకఱ్ఱతో, ఆయమందుఁ = ఆయువుపట్టునందు - జీవస్థానమందనుట. ఆవ్రేఁదు=ఆ దెబ్బ, కసరముల డొక్కలు = పసులకళేబరములు, భక్షితావశిష్టము=తినఁగా మిగిలినది, సహజధర్మములు = కూడఁబుట్టి

నవి, కుక్షింభరిత్వము = కడుపునించుకొనుట. మిత్ర-అమిత్రులకున్-ఉప కార-అపకారములు - క్రమాలంకారము వేఁడి=కోరి, స్వ+ఉదర=తనపొట్ట, ఏఁడులేఁడు = ఎవఁడు లేఁడు. మనుగడ = బ్రదుకు.

పు. 53. సఫలము = ప్రయోజనముగలది, ఆమిషశూన్యము = మాం సములేనిది, వసాగంధిలము = క్రొవ్వుచే వాసనగలది, శల్యము = ఎముక, వేఁపి = కుక్క, అంగద = ఆఁకలి, కేసరి = సింగము - వ్యు - కేసరములు గలది. నిజ...కోరును=తన - వాఁడియైనగోళ్ళచేఁ - జీల్పఁబడిన - ఏనుఁగు- తలలోని - మెదటినే కోరును. సత్వ+అనురూపము = బలమునకుఁ దగినట్టి, వాంఛింతురు = కోరుదురు. ఓగిరము = ప్ర. ఆహారము, ద్విరదము = (రెండుదంతములుగలది - వ్యు.) ఏనుఁగు, ధీరముగాన్ = ధైర్యముగా, విలోకించుచున్ = చూచుచు, ఆధోరణ+ఉపలాలితము = మావటీనిచే బుజ్జ గింపఁబడినది, కబళము=ముద్ద. దీనభావము=దైన్యము. అనవద్యము=దోషము లేనిది, అవక్రము = వంకరలేనిది, విక్రమము = పరాక్రమము, నిరపా యము = అపాయములేనిది, గఱువతనము = గొప్పతనము, పూరకము = నిండించుకొనునది, కరటము = కాకి, అలఁతిజలము = తక్కువనీరు, మొరప నేల=జాలినేల, వెల్లిపొడిచినట్లు=ప్రవాహములేర్పడినట్లు, హర్షము = సంతో షము, తృణమాత్ర+అశనము = పచ్చికనే తినునది, కృష్యాదికర్మములు = సేద్యము మొదలగు, పనులు.

పు. 54. నరపశువు = నరుఁడనుపసరము - రూప. స. కావుటకున్ = అగుటకు, పురాకృతసుకృతమువలనన్ = పూర్వపుణ్యముచే, ప్రజ్ఞావంతుఁడు = బుద్ధిశాలి, ప్రాజ్ఞుఁడు = ప్రజ్ఞగలవాఁడు, రాజసమ్మానముచేతన్ = రాజా గౌరవించుటచే, తంత్రావాపములు = రాజ్యతంత్రములు, సమర్థుఁడు = నేర్పరి, ఎట్టి ప్రజ్ఞావంతుఁడుగాని = ఎట్టిబుద్ధిశాలియైనను, పేటిక+అంతర్గత రత్నమంబోలెన్ = పెట్టెలోని రత్నమువలె, ఇనాలోక యోగము = రాజా

చూపుయొక్కకూడిక, (సూర్య కిరణములకూడిక = శ్లేష). పెట్టెలోని రత్నము 'ఇనాలోకము' (దెబ్బును) నకు దేసుండినయెడల నెట్లు ప్రకాశింపదో యట్లే యెట్టి సామర్థ్యవంతుఁడును 'ఇనాశ్రికము' (రాజదర్శనము) లేనియెడల ప్రకాశింపఁ డనిభావము - రాజాశ్రయమున్ననే పండితుఁడు ప్రకాశించు ననుట. గర్హ్యుఁడు = నిరాకరింపఁదగినవాఁడు, ప్రవర్తన + ఆయత్తములు = నడవడికవలనఁగలుగునవి. లాఁతివిధము = ఇతరమార్గము, మహాత్ + గ్రావము = పెద్దబండను, గ్రావ+అగ్రము = కొండమీఁదికి, పెద్దబండను కొండపై నెక్కించుట కష్టము, దిగువకుఁ ద్రోయుట సులభము. దుష్కరము = కష్టమైనది, తలకంటగించు = చీఁదరకలుగు, నొచ్చు. వివేకివి = తెలివిగలవాఁడవు, అర్థము = విషయము, ఉచితము = తగినది.

పు. 55. కాళిందికిన్ = యమునానదికి, తీర్థ - అవతరణము=నీటిలో దిగుట, అవగతము = గ్రహింపఁబడినది, ధీమంతునకున్ = బుద్ధిశాలికి. సుగమము = సులభముగ తెలిసికొనఁదగినది, తురంగమాతంగ +ఆదులు = గుఱ్ఱములు - ఏనుఁగులు - మున్నగునవి. వహనాది 'కార్యములన్ = మోయుట మున్నగుపనులందు, పరేంగిత + అవగాహి = ఇతరులభావములు తెలియునట్టి, తత్ - భావ - అనురూపముగాన్ = ఆతని మనస్సునకుఁ దగినట్లు, కొలువు = సేవ, మెలఁకువగలిగి = హెచ్చరికతో, ప్రవర్తింపవలయును = నడుచుకొనవలయును, విద్వాంసుఁడు,స్త్రీమహాతి. విదుషి. చిత్తవృత్తి=భావము, కడిఁది = కష్టము, స్వచ్ఛందవృత్తి - స్వేచ్ఛాప్రవృత్తి. ఉద్యోగి=ప్రయత్నించువాఁడు = ఉద్యోగ + ఇ = ఇకారము మతుబర్థకము. "బుద్ధిమంతునకసాధ్యమొకటిలేదు" = బుద్ధిశాలి సాధింపనిది యేదియుచులేదు-దీని యుపమానము-ఉద్యోగికి......శత్రువును లేనియట్లు ప్రియవాదికిన్ = హితము పలుకువానికి, నిచ్చలు = ప్ర. నిత్యము. ఱేనికోప ప్రసాదములు = రాజుయొక్క కోపమును దయయును, అంగమచ్చము = గుఱుతు, దొరఁకొను=ఆరంభించు, అర్థము = విషయము.

పు. 56. నియమము=నిర్ణయము, ప్రతిభాశాలికిన్ = బుద్ధిగలవానికి, సమయ+ఉచితముగాన్ = వేళకు తగినట్లు, కడు+ఎదురు = కట్టెదురు - మిక్కిలియెదురు - "కుఱు - చిఱు - కడు - నడు-నిడుల అడలకచ్చు పరంబగుచో ద్విరుక్త టకారంబగు. తలఁగి=తొలఁగి, తనవలను=తనవంక, పౌర్వాపర్యము = పూర్వాపరములసంబంధము, అవిరుద్ధముగన్ = విరోధములేక. ఇరవునకున్ = ఉనికిపట్టునకు, డాఁకొనవచ్చున్ = చేరవచ్చును. పిరిగొనన్ = పెనఁగొన, తొట్రుపడుచున్ = తడఁబడుచు, జోహారువు = వందనము, మృగేంద్రుఁడు = సింగము - పింగళకుఁడనుట, సాదరంబుగన్ = ఆదరముతో, తావకంబు = మీదైన, అపాంగావలోకంబు = కడకంటి చూపు, వనక్షేత్రంబు = అడవిప్రదేశము, జంతు సంతానంబులు = ప్రాణుల మొత్తము, అనాకారితుండు = పిలువఁబడనివాఁడు. ప్రియవాది = ఇంపుగ మాటలాడువాఁడు; సత్+అసత్ వివేక సంపన్నుండు = మేలుకీళ్లను తెలిసికొను తెలివినే సంపదగాఁ గలవాఁడు.

పు. 57. చక్షుష్మంతునకే = కనులుగలవానికే, అంధునకున్ = గ్రుడ్డివానికి, కొఱ = ఉపయోగము, అవధరింపుఁడు = వినుఁడు. బహుదేశాటనంబు = పెక్కుదేశములు తిరుగుట; బహుశ్రుతులతోడన్ = మిక్కిలి వినికిగలవారితో, నిరంతర సాంగత్యంబు = ఎడతెగని స్నేహము, కావ్యశాస్త్ర విచారంబును = కావ్యములను శాస్త్రములను పరిశీలించుటయును, సమర్థంబులు = శక్తిగలవి. కూపస్థ మండూకంబు = బావిలోనున్న కప్ప, స్వజీవనమాత్రంబునకున్ = తన బ్రదుకునకే, తుష్టి = సంతోషము. మ్రుక్కడులు = అల్పులు, సన్నిధాన ప్రభావంబు = దేవర సన్నిధియొక్క మహిమ, అప్రాప్త + అనుయోగుండు = అడుగఁబడనివాఁడు, తఱి = సమయము, తేకువన్ + బొరసెదు = భయముగలిగెడిని, ఆలించి = విని,

ఱిచ్చపడిన = ప్రాస్పడిన, చిత్రరూపంబు = పటములోనిచిత్రాకారము, చూపట్టె = కనఁబడి, ఉత్తలంబు = పరితాపము.

పు. 58. అఖిలసత్త్వశరణ్యంబు = సకలజంతువులకు నునికిపట్టగునది, మత్ - అధీనంబు = నాకులోఁబడినది. ఆదేశంబునన్ = ఉత్తరువున; విపరీతంబు = వ్యత్యస్తము, పిపాసార్దితుండు = దాహముగొన్నవాఁడు, తరంగిణి = నది - వ్యు - అలలుగలది. ఉఱుము = మేఘధ్వని, మొరపంబు = అఱపు, కర్ణగోచరంబయ్యెన్ = వినవచ్చెను. నినదంబు = ధ్వని - రూ. నినాదము. విఱాకుపడి = చేష్టలుడిగి, అలంతిగన్ = అల్పమైనదిగా, పరప్రకర్షంబు = విరోధియుత్సాహము. సహ్యంబు = ఓర్వఁదగినది; ఉపేక్షింపన్ = అలక్ష్యము చేయుట. అశక్తి భీరుత్వంబులు = బలము లేమియును భయమును, మాఁటున్ = మాఁతతో - మాఁటుము శబ్ద - ఔప. నోళులు = నోళ్లు. క్రమ్మవచ్చునే = మాయ నగునా? నడి = అపనింద, దోరుకంటెన్ = చచ్చుటకంటె, పోరన్ = యుద్ధమాడిన, శ్రేయోదాయకము = మేలొసఁగునది. మాఱుతుండు = పగవాఁడు, దాయపయిన్ = విరోధిపై, అరాతి నిరాసంబ = శత్రునిర్మూలనమే, పరమార్థంబుగన్ = ముఖ్యాభిప్రాయముగ, ఉపాయ + అన్వేషణంబు = తంత్రము వెదకుట, పగతున్ = శత్రువును, కాలదేశ + ఉచితంబుగన్ = కాలమునకును దేశమునకును దగినట్లు, సమర్థించుకొని = బాగుగా నిశ్చయించుకొని, విపక్షున్ = విరోధిని.

పు. 59. తుదముట్టన్ = కడవఱకు, తమకింపరాదు = ఆత్రపడరాదు. నివ్వెఱ = నిండు + వెఱ = మిక్కిలి భయము. ఉదరంబు = కడుపు, నకనకంబడన్ = కృశింపఁగా, డిల్లపడి = ఱిచ్చవోయి, వికలాంగంబులు = అవయవములు తెగినవి, శతాంగంబులు = రథములు, ఖండితశుండా దండకాండంబులు = నఱకఁబడిన కోలలవంటి తొండముల మొత్తములు, కెడసి = చచ్చి, పిండు = మొత్తము, విడంబించు = పోలు, వేదండతండంబులు =

ఏనుఁగుల మొత్తములును. వారువంబులు=గుఱ్ఱములు, సెఱుఁగంటిమి=నిండుశౌర్యము, వాతెరన్ = పెదవిని, జంకెన = బెదరింపు, వాలు=కత్తి, వీర శయనంబు = యుద్ధమునఁ బడుట, యోధవారంబు=వీరుల మొత్తము; వివిక్తంబు = నిర్జనము, ఖాలికలనిన్ = రణభూమిని, దారుణ+ఆరావంబు = భీకరధ్వని, దుందుభిన్ = భేరీని, తలంబగు కొందలంబు = ఎక్కువదిగులు. శవనివహంబు = పీనుఁగుల మొత్తము, సురంగన్ = పాఱిపోవుటకు, పలలంబు = మాంసము.

పు. 60. ముదల = ఆజ్ఞ, లెంక = భటుఁడు, తమకింపన్ = ఆత్రపడుట, లగ్గు=మేలు × ఎగ్గు, శాసనంబు = ఆజ్ఞ, ఆజ్ఞానువర్తి = ఆజ్ఞను అనుసరించినడచుకొను వాఁడు. అనురూపంబు = తగిన, మెలఁకువ = ఉనికి, విచారణీయంబు=విచారింపవలసినది, గమ్యుండు = చేరఁదగినవాఁడు.

పు. 61. అనుగ్రాహ్యుండు = దయఁజూపఁదగినవాఁడు × నిగ్రాహ్యుండు = నిగ్రహింప దగినవాఁడు ; ప్రభంజనుండు = వాయువు, మహాభూజాంబులన్ = గొప్పవృక్షములను, భంజించున్‌గాని = పడఁద్రోయునుగాని, వినతంబులగుతృణవితానంబు = వంగినపచ్చికల మొత్తమును, వాక్రువ్వన్ వలయునే = చెప్పవలయునా ? ఓలగంబునన్ = సభయందు, వినమితగాత్రుండు = వంగినయొడలు గలిగినవాఁడు, భాగ్యంబు కతంబునన్ = అదృష్టకారణమున, ప్రసాదమేదురంబు = దయతో నిండినది, ఉగ్గడింపన్ = పొగడఁగా, ఈయకొనుట = అంగీకరించుట.

పు. 62. జాగరూకుండవు = జాగ్రత్త గలవాఁడవు; మత్ నియోగములందున్ = నాయాజ్ఞలందు, పరివార-సంరక్షణ - ఆదికార్యంబులు = పరివారమువారిని పోషించుట మున్నగుపనులు, దొరకొని = మొదలుచేసి, బద్ధసఖ్యంబునన్ = ఎడవిడని స్నేహముతో, నిరాదరుండు=ఆదరము లేనివాఁడు. చిన్నంబోవన్ = చిన్నబోవునట్లు, కతంబు = కారణంబు, వల్లించితివి =

చెప్పినవానినే చెప్పితివి. తన్ను...కొన్నట్లు = తనయాపనను దానే తెచ్చు కొన్నట్లు, తలపంకించి = తలయూఁచి, ఊంకించి = యత్నించి, ప్రతికూలంబు = విరుద్ధమయినది, మేషయుద్ధంబుచేత = పొట్టేళ్లజగడముచేత.

పు. 63. వాక్రుచ్చెదన్ = చెప్పెదను. దేవశర్మ-అభిధానుండు=దేవశర్మయను పేరుగలవాఁడు, పరివ్రాజక బ్రువుండు=సన్యాసులలో నధముఁడు, బ్రువశబ్దము కుత్సావాచకము. లోభ=ఆశచే, ఆకృష్టచేతస్కుండు=ఆకర్షింపఁబడిన మనస్సుగలవాఁడు, వీతస్పృహుండు పోలెన్ = ఆశలేని వానివలె, అశ్రాంతంబు = సర్వదా, తత్+ఆకర్ణన = వానిని వినుటయందు, కుతూహలంబునన్=ఆసక్తిచే, అనాదరసూచక = ఆదరములేమిని దెలుపు, మందహాస = చిఱునవ్వుయొక్క, రోచిః = కాంతిచే, ఉదంచిత = కూడిన, సుందర = అందమయిన, వదనుఁడు = ముఖముగలవాఁడు. అనుగ్రహార్థంబు = అనుగ్రహించుటకొఱకు, నానాఁటన్=దినక్రమమున, సముపార్జించిన=సంపాదించిన, విత్తంబు=ధనము, పదిలంబుగన్ = భద్రముగ, కూర్పవోసి = కట్టి, త్రిమ్మరుచుండును=తిరుగుచుండును. కర్ణరసాయనంబుగన్ = చెవుల కింపుగా, మాయావి=జిత్తులమాఱి, మస్కరి=యతి, తస్కరింపన్ = దొంగలింప; లాఁతి వెరవు=మఱియొక యుపాయము, సర్వాంగ+ఆలింగితభూతలంబుగన్=అన్ని యవయవములచేఁ గౌఁగిలింపఁబడిన నేలఁగా, ప్రణామంబు = నమస్కారము, ముకుళితకరుండు = చేమోడ్పుగలవాఁడు, వాక్రుచ్చు = చెప్పునట్టి, తత్+ఏకాగ్రహృదయుండు=అందే ముఖ్యముగా నుంచఁబడిన మనస్సుగలవాఁడు, విలక్షుండు = సిగ్గరి, వెఱఁగుపడినవాఁడు, దూరిత తారళ్య విస్తారిత నయనుండు=చిరము చలనముతో విస్తృతముగాఁ జేయఁబడిన కన్నులుగలవాఁడు, చిరంతన=చిరకాలముగా నున్న, ఆత్మీయ ధర్మ సంశయ=తన ధర్మ సందేహమును, నిరాకరణచణ = తొలఁగించుటయందు సమర్థమైన, ప్రస్తుత ప్రకరణార్థ = అప్పుడు జరుగుచున్న విషయార్థములను, శ్లాఘమానుండున్

పోలెన్ = పొగడుచున్నవానివలె, పరివాహితమ_స్తకుండు = కదల్పఁబడిన తలగలవాఁడు, శ్రవణ = వినుటయందు, అంతరాయ = విఘ్నమును, అస హిష్ణుండునుంబోలెన్ = ఓర్వనివానివలె, సీత్కార=సుస్సురదుధ్వని, తత్రత్య జన=అందలిజనుల, భ్రుకుటితముఖుఁడు = బొమముడిపాటుతోడి మోముగల వాఁడు, ఉత్క్షిప్తకర సంజ్ఞన్ = ఎత్తఁబడినచేతియొక్క సైఁగచే, వారించు చున్ = అడ్డువెట్టుచు, నిర్భర+ఆనంద=భరించుటకుఁగాని సంతోషముచే, వివ శుండునుంబోలె = ఒడలెఱుఁగనివానివలె, సబాష్ప = కన్నీటితోడఁగూడిన, నిమీలిత లోచనుండు = మూయఁబడిన కన్నులుగలవాఁడు.

పు. 64. తత్-ఉపన్యాస-అవసానంబునన్ = అతని యుపన్యాసము నకుఁ గడపట, ఎడగలుగన్ = తొలఁగి, భిక్షు-అనంతరము = యతికి భోజన మయిన పిదప, తాళవృంతంబు = విసనకఱ్ఱ. గుప్తంబై = దాచఁబడినదై. అనన్యసాధ్యంబు = ఇతరులచే సాధింపఁ బడనిది, అర్థంబు = వేదాంతార్థ మును (ధనమును), ఈప్సితార్థము = కోరినకోరిక, పారాశరి = సన్న్యాసి. టక్కుగాఁడు = మోసగాఁడు, ద్రుతగతిన్ = వేగపు నడకతో, వీతస్పృ హుండు = ఆశలేనివాఁడు, అవిగీతచరిత్రుండు = పొగడఁ దగిన నడవడిఁ గలవాఁడు. పచ్చెకాఁడు = మోసగాఁడు, (చూచుచుండఁగా నేదొంగిలించు వాఁడు).

పు. 65. పెచ్చు హెచ్చరికతోన్ = మిగులజాగ్రత్తతో, భిక్షు నకున్ = యతికి, ఓడెంబు = ఓడిగము. కావితాల్పు = బ. స. యతి, "సమయ...చూపట్టుదున్"="కాలము అనెడు పరశురాముఁడు-వేయి కిరణ ములను లేక చేతులును (శ్లేష) త్రెంచఁగా, ఎఱ్ఱకాంతిచే ప్రకాశించు వాఁడును లేక నెత్తుటిచే నొప్పారువాఁడును, వేఁడిమి లేనివాఁడును లేక శౌర్యముచెడినవాఁడును (శ్లేష) అయి, కార్తవీర్యార్జునునివలె సూర్యుండు కానరాఁగా" —అలం-శ్లేషానుప్రాణితరూపకము. మేషంబులు = మేఁకలు,

నగంబులు=కొండలు, ప్రతిఘోషంబులు = ప్రతిధ్వనులు, ఈనన్ = కలిగిం పఁగా, వెడిల్లనన్ = వెడిల్లునను ధ్వనితో, డీకొంచున్=మోఁదికొనుచు, ప్రవిదారణంబు = యుద్ధమును,నల్లన్ = నెత్తుటిని, ఫేరవంబు=నక్క, పలల ఖండంబు = మాంసపుముక్క, యుద్ధ్యత్ + మేషమధ్యంబు = యుద్ధమాడు చున్న మేఁకలను నడిమిచోటు.-అను నాసికాక్షరసంధి; గణింపక = లెక్కిం పక, ఉరణంబులు = పొట్టేళ్లు, వంచకంబు = నక్క, పంచత్వంబున్ = చావును, ఆమిషలోభంబు = మాంసమునందలియాశ, గోమాయువున్ = నక్కను, ఆషాఢభూతి = వ్యు. మేషి 'కట్టినే సంపదగఁగలవాఁడు-బ్రహ్మచారి యని యర్థము, ఓహో=దూరాహ్వానముం దెలుపుసంబోధనము.

పు. 66. కనుమేర = చూపుమేర, యాతా యాత జనంబులన్ = పోవుచు వచ్చుచు నున్నవారిని, అంగమచ్చము = గుఱుతు, ప్రతారించెను = మోసపుచ్చెను. స్వదోషంబు = తాముచేసిన నేరము. ప్రమాదంబు=పొర పాటు, పాటిల్లుట=కలుగుట, వినాశ+ఉన్ముఖ కార్యంబున్ = నాశమెదురు చూచు పనిని, భావి+అర్థసంగ్రహంబునకున్ = రాఁబోవు నర్థములనుపొందు టకును, అనర్థప్రతీకారంబునకున్=అనిష్టముల బదులు చేఁతలకును, అర్హం బగు మంత్రంబే = తగిన యాలోచనమే. కర్తవ్యంబు = చేయఁదగినది. ఎల్లయర్థంబులు = కోర్కులన్నియు, దుష్కరంబు = కష్టమైనది; పరాక్రమ శతంబుచేతన్=అనేకములైన పరాక్రమములచేత; సరీసృపంబును=పామును: వర్ణించెదన్-ప్రక్రి. వ్యాఖ్యానించెదను.

పు. 67. వాయస మిథునము = కాకులజంట, అంగలార్చెను=మొఱ యిడెను. కడముట్టింపుము = చంపుము. సారోదము = సారమైన జలముగలది, కాసారంబు=కొలను, క్రశిమంబు=కృశించుటను, మహార్థంబు = గొప్పకోర్కి, అనశనవ్రతానుష్ఠానము=భోజనము చేయని వ్రతము చేయుట, విచిత్ర చరి త్రంబు = వింతనడత, శ్రోత్రపేయంబు = కర్ణరసాయనము, కర్కటక+

ఉత్తమా = ఎంద్రులలో శ్రేష్ఠమా, భావంబున్ = ఇతరుల తలంపును. భావింపన్=ఊహించుటకు, నిస్సంగులమ=ఏకాంతులము, మౌనముద్రా ధారులము=మాటాడనివారము, మాదృశులకున్=మావంటివారికి, వచనచారిమంబు=మాటలధోరణి, సల్లాపంబునందున్ = సంభాషణయందు, ఉల్లాసము = సంతోషము. పుట్టువున్ తొట్టి = జన్మమాదిగా.

పుట. 68. కడుపుఁజిచ్చు = జఠరాగ్ని (ఆఁకలి), మడిసిన=చచ్చిన, స్వాభావికమ్ము = సహజము. భూతహింస = ప్రాణులను జంపుట, శరీర భరణంబు = దేహపోషణము, గంగ + ఉత్తరతీరమందున్ = గంగానదిఉత్తరపుగట్టున, యోగిపుంగవుండు = యోగిశ్రేష్ఠుఁడు, పుంగవశబ్దము శ్రేష్ఠవాచకము, ఉపదేశించు = చెప్పు, అర్థించువారికిన్ = కోరునట్టివారికి, అవశ్యాచరణీయంబు = ముఖ్యముగాఁ జేయఁదగినది, సకల దోషంబులకున్ = అన్ని పాపములకు, మూలంబు = కారణము. లోభంబు = ఆశ, విసర్జింపవలయున్ =విడిచిపెట్టవలయును,సదయుండు = దయగలవాఁడు, అనుష్ఠితంబులయ్యున్ = చేయఁబడిన వయ్యును, నిరర్థకంబులు =వ్యర్థములు, జీవనంబు = బ్రదుకు, క్షణభంగురంబు = క్షణమందే నశించునది; నాఁటంగోలెన్ = అదిమొదలు కోలె దఘ్నార్థక శద్ధితము, పురుషార్థంబు నంద = ధర్మమునందే, జలశైవాలాదులతోన్ = నీటితోను నాచుతోను, దేహధారణంబు సేయుచున్ = జీవించుచు, ముముక్షుత్వంబున్=మోక్షముపొందు భావమును, నీఱు=నివురు-బూది. కవిసిన=క్రమ్మిన, కృపావలోకంబు=దయతోడి చూపు, పొలయింపుము = వ్యాపింపఁజేయుము. అనావిల భావంబునన్=పాపరహితమైన బుద్ధితో.

పుట. 69. ప్రసాదభాసురము = దయతోఁ బ్రకాశించునది, దరహాసంబు=చిఱునవ్వు, పఱువాతన్=ఉదయమున, ఖగంబు=పక్షి-వ్యు. ఆకసమునఁబోవునది. సౌఖశాయనికంబులు=సుఖనిద్రను గూర్చి యడుగునవి. బాష్పవారిపూరితనంబు=కన్నీటితోఁగూడిన కన్నులు గలది, కాలనియోగంబు=కాలము

యొక్క-నిర్ణయము, తడవులంబట్టి=చిరకాలముగా, నిత్య సంతుష్టుండు=ఎడతెగని సంతోషముగలవాఁడు, నెగడితివి=ఒప్పితివి. ఖేదంబు=దుఃఖము, టక్కరి=మాయావి, ఎలుంగురాలుపడక = వణఁకుగొంతుతో, ముముక్షుండను = మోక్షమునందపేక్షగలవాఁడను. బంధముచేక = కట్టుచే, మంటిని = బ్రదికితిని. ప్రారబ్ధకర్మవశంబునక్=(దేహోత్పత్తికిఁ గారణముగా) ప్రారంభించిన పూర్వకర్మచే, మీతగులంబు = మీబాధంబు, ఉల్లంబు=మనస్సు, జాలరులు = చెంబడివారు, కొలంది = మేర, విపణ్ణుండను=ఖేదముగల వాఁడను. బారి = ఆపద, వెరవు = ఉపాయము. వలంతివి = సమర్థుఁడవు. శరణంబు=రక్షకంబు.

పు. 70 నిత్యాపంబు = వ్యు. ఎడతెగని నీరుగలది, ఓపినంత = శక్తమైనంత, నిర్మీనంబు = మత్స్యములులేనిది, మీను-బ. వ. మీలు. చంచువులక = ముక్కుల, గుంటిమీఁదక = ఔప. గుండుమీఁద, ఆప్తులవలనక్= మిత్రులవలన, ఖలుని = దుష్టుని, ఋజువుగాక = సత్యముగా, దుసికిలకుండక = జాఱకుండ.

పు 71. అభిమతంబు = కోర్కి, గమ్యస్థానము = చేరఁదగినచోటు, కుళీరంబు=ఎండ్రి, సదుపాయము = మంచి యుపాయము, విలాసధామంబు=శృంగార విహారములకు స్థానమైనది, రాజ+అంగనలు = రాజస్త్రీలు, క్రీడ+అర్థంబు = వేడుకకొఱకు, కుసుమాపచయంబు = పువ్వులు గిల్లుట, శ్రాంతి = అలసట, జలంబులాడక = జలక్రీడలాడుటకు, సరసిక = కొలనిని, అనూనంబు = తక్కువకానిది, మానోజ్ఞకంబునకుక = చక్కఁదనమునకు, నిట్టపొడువక = అతిశయింపఁగా, తత్+తీరంబుక = దానిగట్టును, పరిష్కారంబులు = నగలు, ఊడ్చి = తీసి, చెట్టలు = చేతులను, సుందరమంద గమనంబులక = చక్కని తిన్నని నడకలచేత, ఒయ్యారంబు = విలాసము, నీరంబులక = నీళ్లయందు, విసారవార పరిస్ఫురణంబులక = చేఁపలసమూ

హాములయొక్క మెఱపుంటలను, మించులు = కాంతులు, మించుగన్ = అధికముగా, వెలితళుకుంజూపులు = తెల్లని కాంతిగలచూపులు, కళవళింపన్ = చెదరఁగా, ఉలుకుచున్ = భయపడుచు, కటిద్వయసంబుగన్ =తొడలోఁతు వఱకు, సలిలవిహారంబు = జలక్రీడను, లతాంగి = తీఁగవంటి దేహముగలస్త్రీ, తోయంబులు = నీళ్లు, దోయిలించి దోయిలించి = దోసిళ్లతో నెత్తియెత్తి.

పు. 72. తోయజాక్షి = కమలములవంటి కన్నులుగలస్త్రీ, మాఱుకొని = ఎదుర్కొని, మీఱన్ = అధికముగా, ధారాసారంబునకున్ = నీటిధారల యెడతెగని వర్షమునకు, కేలు ఒడ్డి = చేతులును అడ్డముపెట్టుకొని, పెడమొగంబు ఇడి = మాఱుమోముచేసికొని, వెఱకేలు = ఇంకొకచేతిని, మానుము = వదలుము. నాన్ = అనిచెప్పఁగా, తెఱవ = స్త్రీ, నెఱజాణవు = మిక్కిలి నేర్పుగలదానవు, చిఱుతుకదానితోడన్ ఆ = చిన్నదానితోనా, బింకంబులు = పంతములను, పొంకించెదవు = ఆడుచున్నావు. మలంగక = మరలక, తొలంగక = దూరముగపోక, పట్టువదలక = తానుపట్టినకార్యము విడువక, నట్టు కదలక = తానున్నచోటునుండి కదలక, పరస్పర...ధారలన్ = ఒండొరుల కమలములవంటి చేతులతో చల్లఁబడిన నీటిధారలచేత, లోఁగక = వెనుదీయక, తోఁగుచున్ = తడియుచు, సుమాళంబు = ఆవేశము, ఆలంబు = యుద్ధమును, దరహాస అంకూరంబులు = చిఱునవ్వు మొలకలు, ఆనన అంబుజంబులన్ = కమలములవంటి ముఖములను, ఆర్ద్ర శుక ఉత్తరీయాంతర్గత నిస్తుల స్తన స్తబకంబులు = తడిసిన పైఁటలోనున్న సాటిలేని పూగుత్తులవంటి స్తనములు, నిబ్బరంబుగన్ = ఎడములేనియట్లుగా, రొఁజుచున్ = నిట్టూర్చుచు, ముద్దియలు = స్త్రీలు, ఉద్దులుఅయి = జతకూడి, ఒండొరుల రవణంబులు = ఒకరొకరిసొమ్ములను, పణంబుగన్ = పందెముగా, పన్నిదంబుచఱచి = ఒడ్డి, హారంబు = గట్టు, కరంబు=మిక్కిలి, కలగుండుపఱచు = కలఁతపెట్టు, లాఁతిచేడియలు = ఇతరస్త్రీలు, అతను

క్షోభంబు = అధికమయినకలఁత, (మన్మథునిబాధ అని యర్థము,) దుర్వారంబు = అడ్డుపెట్టరానిది, చదురులు అగు = చమత్కారముగ మాటలాడు, మట్టు = చేరు, కరంబులన్ = చేతులతో, స్తన గమన సామ్య అసహనత్వంబునన్ పోలెన్ = స్తనములయొక్కయు నడకలయొక్కయు పోలికను సహింపని వారగుటచేతనో యనునట్లు, రథాంగ చక్రాంగంబులన్ = చక్రవాకపక్షులను హంసలను, (స్తనసామ్యమునకు ఓర్వలేనితనముచేత చక్రవాకములను, నడకసామ్యమునకు ఓర్వలేనితనముచేత హంసలను అని క్రమాలంకారము.) స్వఉపప్లవకారణ మార ప్రహారణంబులు = తమయొక్క యుపద్రవమునకు కారణములైన మన్మథబాణములు, అను ఈరసంబునన్ = అనఁబడు ఈసుచేత నో యనులాగున, సారసంబులన్ = కమలములను, తునుముచున్ = గిల్లుచు, చేరవన్ = దగ్గఱ, ఉదారప్రభారమణీయంబు = ఎక్కుడుకాంతిచే మనోహరమైనది.

పు. 73. అల్లఅంతన్ = కొంచెము దూరమునందు, తరుశాఖన్ = చెట్టుకొమ్మమీఁద, రత్నసరంబు = రత్నాలహారమును, కరటంబు = కాకి, సీమంతినీ లలామంబు = స్త్రీరత్నము, వాక్రువ్వన్ = చెప్పఁగా, ఒక్క మొగిన్ = ఒకమాఱుగా, వదన అరవిందంబులు = కమలములవంటి ముఖమును, పాశిష్ట నేతర విస్తారిత చారులోచనలు = కదలనివియు విశాలములయినవియు అగు చక్కని కన్నులు గలవారు, అస్పంద...అనుకారిణులు - అస్పంద = కదలని, మిళింద = తుమ్మెదలచేత, సుందర = చక్కనివియు, వికసిత = పూచినవియు, (అగు), కుసుమ = పువ్వులయొక్క, రాజీ = సమూహముచేత, విరాజమాన = ప్రకాశించుచున్న, మల్లికా వల్లికా మతల్లికా = శ్రేష్ఠములయిన మల్లెతీగలయొక్క, విభ్రమ = విలాసములను, అనుకారిణులు = అనుసరించువారు, సూచీముఖ అలంకృతనాసికా అగ్రలు = నిలువుగాఁ జాపఁబడిన చూపుడువ్రేలిచే నలంకరింపఁబడిన ముక్కుకొనగలవారు (చూపుడువ్రేలిని ముక్కుకొనపై నుంచుకొని అని యర్థము - ఇది ఆశ్చర్యసూచకము.) దూకి

కృతనిమేషంబుకఁ = దూరముగాఁ జేయఁబడిన ఱెప్పపాటు గలుగునట్లుగా, దృష్టి సారించి = చూపు నిగిడించి, పద్మరాగ ప్రభాతింఛోళిఁ = కెంపుల కాంతుల సమూహమును, ఆమిషంబు = మాంసము, సుందరంబుగఁ = అందముగా, పంకించి = ఆడించి, జుట్టనఁ = జుట్టనవ్రేలితో. నెటికవిఱుచుట = తిరస్కారసూచకము, పలుగాకి = దుష్టమైనది, చేపడునో = చేతికిఁజిక్కునో, జలవన ఆది దుర్గస్థానంబులఁ = నీరు అడవి మొదలుగాఁగల చొరరాని చోట్ల యందు, అండజంబునకుఁ = పక్షికి, మండనంబుతోడఁ = నగతో, కతంబు = కారణమును, పరికింపవలయుఁ = చూడవలెను. నిమిత్తంబు = కారణము, పరిచారికలు = పనికత్తెలు, వాయసంబు = కాకి, ఏచాయకుఁ = ఏదిక్కునకు, కనుఁగలిగి = దృష్టియుంచి, వనపాలకులఁ = తోఁటమాలులను, నియమించి = ఏర్పాటుచేసి, రాజపురుషులకుఁ = రాజసేవకులకు, నివేదించి = తెలిపి, ప్రేరితులు = పంపఁబడినవారు.

పు. 74. ఆశ్మ - ఆవాసంబు = తానుండుచోటు, వటకుటంబు = మఱ్ఱిచెట్టు, నేరిమిమీఱఁ = నేర్పుఅతిశయింపఁగా, క్రింది వల్మీకంబునకుఁ = దిగువనున్న పుట్టకు, చూటివడఁ (పా. సూటివడఁ) = గుఱిగా, మీసరంబుగఁ = మిక్కుటముగా, తుఱంగలింపఁ = వ్యాపింపఁగా, తత్ర...కారి. తత్రత్య = అచటనున్న, కాలవ్యాళ = కాలసర్పముయొక్క, వినాశ = నాశమును, పిశున = తెల్పునట్టి, ఉల్కాపాత+అనుకారి = కొఱవులుపడుటను పోలినది. కోమక్రంతఁ = పుట్ట చివరిరంధ్రమును, గునపంబులు = గడ్డపాఱలు, సాధనంబులు = కొఱముట్లు, క్రొక్కించినఁ = త్రవ్వింపఁగా, దందశూకంబు = పాము, విషానలంబు = విస మనెడియగ్గిని, వరికొల్పుటకుఁ బోలెఁ = రగులఁబెట్టుటకో యనునట్లు, ఫూత్కారంబులు = బుసకొట్టుటలు, పరప్రాణానిలంబులు = ఇతరుల ప్రాణవాయువులు, క్రోలుటకుఁ బోలెఁ = త్రాఁగుటకో యనునట్లు, ఆభీలంబుగఁ = భయంకరముగ, నిర్గ

మించి = వెడలి, గమకించుచున్ = ప్రయత్నింపఁగా, చక్కని = గట్టివైన, పెక్కుబడియలన్ = పెక్కు కట్టెలతో, చదియన్ = చచ్చునట్లుగా, అడిచి= కొట్టి (అడుచు ధా॰ క్త్వా) ఆసేవళంబున్ = ఆ దండను, తక్కుబలము = తక్కంగలబలము = మిగిలినబలము. ధీశక్తి విరహితునకున్ = బుద్ధిబలము లేనివానికి, అసత్కల్పంబు = వ్యర్థమైనది. కల్పమన నిట తుల్య మనియర్థము, సత్తువలేనివానికి తుల్యమయినదనుట. శశకంబు = కుందేలు, కంఠీరవంబు = సింగము, జంతు సంతానములన్ = ప్రాణికోట్లను, ఖాలియించి = చంపి, సత్త్వంబులు = జంతువులు, ప్రతీకారమ్ము = పరిహారము, కర్తవ్యాంశము = చేయఁదగిన విషయమును, కలియన్ = అన్నియును, బెండగిలి = ప్రయాణమై, ఘనంబుగన్ = అధికముగా, దరంబు = భయము, కదురన్ = కలుగఁగా.

పు. 75. నివ్వటిల్లన్ = అతిశయింపఁగా, దవ్వు దవ్వులన్ = మిక్కిలి దూరమందు, అభివందనంబు = నమస్కారమును, అవధరింపుఁడు = వినుఁడు; ప్రతాపానలంబునకున్ = శౌర్యమను నగ్నికి, వ్యాళజాలంబు = మదించిన యేనుఁగుల మొత్తములు, తెగవు = సాహసింపవు, మ్రుక్కడులన్= అల్పులను కరుణాళుండు= దయగలవాఁడు, పొలివోవదు = చెడదు; వంతు మయిన్=వరుసక్రమమున, మేకొని = ఒప్పి, పాచి= తొలఁగించి, వీడు కొలిపెన్ = పంపివేసెను. (శ. క్రి.) మృగసంతానంబు = మెకముల మొత్తము, వంతన్ = దుఃఖమును, తలంగి = విడిచి, వఱువాతన్ = కూడ యము మున, ప్రతి-అహంబు = ప్రతిదినము, చెంగటికిన్ = దగ్గఱకు, (చెంగలి- ప్ర॰ వి.) యథాసంకేతంబుగన్=తమయేర్పాటు చొప్పున, చెవులపోతున్ = కుందేలిని, ఎల్లి = రేపు, భృశంబు=మిక్కిలి, పదిలించుకొని = కుదురుపఱచికొని, విధి విధానంబు = తలవ్రాత, అప్రతివిధానంబు = బదులు చేయుటకుఁగానిది, నిగుడన్ = కలుగఁగా, శిరఃకంపంబు=తలయూచుట, ఎడరు=ఆపద, ఎఱుక బలిమి = తెలివియొక్కశక్తి, పరికింపవలయుంన్ = వెదకవలయును. వెఱుగు

పాటు=దిగులుపడుట, కేసరిన్=సింగమును, వ్యు. కేసరములు (జూలు) గలది. ప్రతారించి = మోసపుచ్చి, దోరింపన్ = చంపుటకు.

పు. 76. పంచినగతిన్ = ఏర్పఱచిన విధమున, బలగంబువలనన్= పరిజనమువలన, అల్లనల్లన్ = మెల్ల మెల్లన, రోసి = ఆలోచించి, మసలి = ఆలస్యము చేసి, ఆహారంబుతఱిన్ = భోజనవేళను, సవినయంబునన్=అడఁకువతో, ప్రణమిల్లుడున్ = మ్రొక్కఁగా, హర్యక్షంబు=వ్యు-పసుపుఁ గన్నులు గలది-సింగము, సటాజాలంబు=కేసరముల మొత్తము. వెక్కసంబు=అధికము, రోషంబునన్ = కోపముతో, అదరులు చెదరన్ = మిసుఁగుఱులు చెదరునట్లు, అస్మదీయ = మాదైన, క్షాంతికిన్ = ఓర్పునకు, కట్టిన ...గాదె = శిక్షించినయెడలనే రాజునకుఁ బ్రజలు భయపడుదురు గాని శాంతుఁడుగానున్న నెవ్వరును భయపడరని భావము, పనుచుట = పంపుట, వేఁడిమిచవి= ప్రతాపము యొక్కరుచిని, చూడవేఁడి = చూడఁగోరి, మత్తిల్లునే = మదించునా? ఇవ్వాలంబునన్ = ఈక్షేత్రంబున, చమరి = అఱచేతఁగొట్టి, సమయించి = చంపి, ఎరియు = మండుచున్న, కడుపుచిచ్చునన్ వ్రేల్చెదన్ = జఠరాగ్నియందు హోమముచేసెదను. తాడించి = (నేఁమీఁద)కొట్టి, తావకులగు=నీవారగు, నేఁటిజేపు = నేఁటియుదయము, శాసనంబు = ఆజ్ఞ, సరభసగతిన్ = వేగముగా, రూక్షంబుగన్ వీక్షించి = క్రూరముగాఁ జూచి, శశాధమా=చెవుల పోతులలో నీచుఁడా! ఎట్టి సత్త్వంబు ఏనిన్=ఎట్టిదుండే దైననను, కడు+ఎదురన్ = ఎట్ట యెదుట; దరవిరహితంబుగన్ = భయములేక, మాయంరే = భళీ; ఉద్ధతిన్ = గర్వమును, వెఱంగు = వింత, చీరికిన్ గొనక= లక్ష్యపెట్టక, ఒరసికొని=తాఁకి, పాఱుపోతరంబు = పరుగిడి పోవునట్టి క్రొవ్వు. కతంబు =కారణము, అధిక్షేపించి = ఆక్షేపించి, ప్రతిరోధింపన్ = అడ్డగింపఁగా, వల్లభుండు = రాజు, సత్త్వసార+అభిధానుండు = సత్త్వసారుఁడను పేరుగలవాఁడు, అమ్మహామహుసన్నిధికిన్ = ఆగొప్పపరాక్రమము గలవానియొద్దకు, మసలింపకుము = తడయఁజేయకుము.

పుట. 77. ఆకులంబగుఁ = వెతనొందును: మధ్యందిన = మధ్యా హ్నమందు, విద్యోతమాన=వెలుఁగుచున్న, ఖద్యోతమండలంబుఁ పోలెఁ= సూర్యమండలమువలె, సందోహంబు=సమూహము, నాకపదొర=నాకు సముఁడు, దొర=రాజు, అందనిపదవికిఁ = అలవిగాని స్థానమునకు, గంతుకొనఁ = దుముకుటకు, ఊంకించెనేనిఁ=ప్రయత్నించినయెడల, మదీయతేజః అనలంబునకుఁ = నా ప్రతాపాగ్నికి, రూప. స. ఇంధనము కావించెదఁ = సమిధ నుఁగాఁ జేసెదను: రూపకాలంకారము. కయ్యంబునకుఁ = ప్ర. కలహము నకు, పొలియించెదఁ = చంపెదను. పలికించి = చెప్పించి, పుత్తెంచెఁ = పంపెను. అప్రతి రోధక్రోధుండు = అడ్డులేని కోపముగలవాఁడు, దండధరు వీటికిఁ = యముని పట్టణమునకు, మార్గాభిజ్ఞానార్థంబు = త్రోవ తెలియుం టకై, వినయభయసంభ్రమంబులు = అడఁకువయు భయమును వేఁగిర పాటును, వత్తె యని = సరి యని, సార్వభౌమా = చక్రవర్తీ! మార్తుండు = రూ. మాఱుతుండు = విరోధి, వాపికయందుఁ = బావిలో, తన ప్రతి బింబంబు = తననీడను, భావించి = తలఁచి, కోప+ఆటోపంబు = కోపము యొక్క వేఁగిరపాటు, వలంకులు=ప్రక్కలు-వి. వ. వలను, మాఱునెలంగఁ= ప్రతిధ్వని కలుగునట్లు, గుభుల్లునఁ = దబాలున, కాలధర్మంబుఁ = మర ణంబును, జంబుకంబులు = నక్కలు, కృతాపరాధంబులు = నేరముచేసినవి, నిష్కాసితమ్ములు = వెడలఁగొట్టఁబడినవి, మదీయ ఉద్యోగంబునకుఁ = నాదైనయత్నమునకు.

పుట. 78. ప్రువ్వను = పురుగును, మూలచ్ఛేదంబు = వేరుయొక్క నాశము - వ్యా. మూల-ఛేదంబు - హ్రస్వంబుమీఁది ఛకారము గాన ద్విత్వము గలిగెను. వెలార్చి = వెడలించి, మాయించుట=చంపుట; 'కావృత మెడ'-కావృతఁ+ఎడ-వ్యా. ఎడు-త-ల-ద్రుతమునకు అచ్చుపరమగునపుడు మకారంబగు. దీనభావము = దైన్యము, భావించికొని = నటించి, ఖేదంబు

నకుఁ = దుఃఖమునకు, నిమిత్తము = కారణము; ఉత్తలంపడియెడుఁ = విచారమొందజేసిని, కొంచక = సంకోచింపక, వాక్రువ్వము = చెప్పము. మతివిహీనుండను = బుద్ధిమాలినవాఁడను; భృత్యుండు = సేవకుఁడు, స్వాపరాధంబుఁ = తననేరమును, స్వామికిఁ = ఏలికకు, నివేదింపక = విన్నవింపక, మొఱంగఁ చనదు = దాఁచరాదు. రెండు లోకములకుఁ = ఇహపరలోకములకు, మనుగడకుఁ = బ్రదుకునకు, మూలంబు = ఆధారము, ఎడరు= ఆపద, పాటిల్లినఁ = కలిగినయెడల, శోచ్యంబు = శోకింపఁదగినది. సూదృశుండు = సాటివాఁడు; క్షుద్రుండు = అల్పుఁడు, అస్తమింపదు=నాశమొందదు. సమక్షంబునఁ = ఎదుట, కీర్తి నీయంబులు = పొగడఁదగినవి; స్వపరోక్షంబునఁ = తన మఱుఁగునందు, చారముఖంబునఁ = వేగులవారివలన, అనుగ్రహ నిగ్రహంబులు - హితులయందనుగ్రహమును అహితులయందు నిగ్రహమును అని భావము. ప్రజావృక్షంబునకుఁ = ప్రజల నెడిచెట్టునకు-రూప. స.

పుట. 79. ఆలంబు = ఉపేక్ష, అనన్యాదృశంబుగఁ = ఇతరులయందుఁ గానరానిదిగా (సాటిలేనిమట్టు,) అవ్యాజప్రేమంబునఁ = కారణములేని ప్రీతితో, ప్రమాదంబు = పొరపాటు, నీరువట్టు=దప్పి, 'చక్కొఁరఁదిని చేఁదనవచ్చునే'—సామెత; మే లనుభవించి కీడుగాఁ చెప్పరా దని యర్థము. వేనోళ్లఁ = పలువిధముల, నిర్భర-ఆనంద పారవశ్యంబునకుఁ = భరించుటకుఁ గాని సంతోషమువలని మైమఱపునకు, కొలంది = మేర, అంగీకారసూచకవచనంబులతోడఁ = సమ్మతిని దెలుపు పలుకులతోడ నే. ప్రశంసనంబు = పొగడ్త, తెచ్చికోలు = తెచ్చుకొనునట్టి, తెచ్చికొను-ధాతువు కృ. రూపము, అను భావంబు = ప్రభావము, నిగృహీతులు = తిరస్కరింపఁబడినవారు, చెలికారంబు = చెలిమిని,

పుట. 80. నిచ్చలు = నిత్యమును, మంత్రంబు = ఆలోచనము, నిర్వర్తించు=జరుపుచున్న; కాంక్షించు = కోరునట్టి, స్వప్నావస్థయందైనఁ =

కలలోనైనను, సఖ్యంబు = చెలిమి, శ్రవణమూలంబు = చెవుల మొదటి భాగమును, వినిపించిరి = చెప్పిరి. మోఁసారించి = మోముచాఁచి, తెల్లంబు= స్పష్టము, బయలు పోఁగక = వెలుపలఁజెప్పక, అద్భుతరోష విషాదంబులు= అచ్చెరువు కోపము విచారము, పెరఁగొనన్ = చుట్టుకొనఁగా, కొలువుకు కాండ్రు=సేవకులు, ఏరేనిన్=ఎవరైనను, నేస్తంబు = నెయ్యము, మేకొని= సమ్మతించి; అర్థంబు=విషయమును, ఉబ్బనీకుము = చెప్పకుము - క్రక్కకుము. పుచ్చి = పోవుధా. ప్రేర. పోనిచ్చి. చొప్పు = విధము. డెందంబు=మనస్సు, సేవి = సేవగలవాఁడు, తెలిసి తెలియములు = తెలిసియుం తెలియమియు; ఇది యొక సమాసరూప విశేషము.

పుట. 81. పెఱలన్ = ఇతరులను, ఆవిష్కరించి = ప్రకటించి, అలుకు = ఒగులు, న + అతికఠినంబు కన్ = మిగుల కఠినముగాక, వెతార్తము = వెడలఁగొట్టునది, ఒండె = వికల్ప ప్రత్యయము, స్నిగ్ధము = స్నేహముకలది 'సహసా విదధీత న క్రియామ్' - క్రియామ్ = పనులను- సహసా = తొందరతో, (ఆలోచింపక), న విదధీత = చేయఁదగదు. నీతికో విదులు = నీతి నెఱిఁగినవారు, వక్కాణింతురు = చెప్పుదురు; ధీమంతు నితోన్ = బుద్ధిగలవానితో; మృగపతి = సింగము. బుద్ధికౌశలంబులు = బుద్ధియొక్క నేర్పులు; కౌశలంబు = కుశలుని భావము—భా. తద్ధిత. ఉప్పరంబు = ఆకసము రూ. కౌశల్యము, కౌశలి.

పుట. 82. అనుయుక్త స్వాగతుండై = అడుగఁబడిన మంచి రాఁక గలవాఁడై, తత్-ఆదిష్టంబు = ఆతనిచే నేర్పరుపఁబడినది. ఉచిత+ఆసనం బునన్ = తగిన పీఠమందు, సాకల్యంబుగన్ = సంపూర్ణముగ. వర్తనం బులు=నడవడులు, అవసానంబునన్ = కడపట, మత్+ఉక్త+అర్థంబును = నాచేఁ జెప్పఁబడిన విషయమును. అమాత్యపదంబునన్=మంత్రిస్థానమందు, అమాత్యుఁడు - వ్యు. రాజుతో నుండువాఁడు, అంతరంబు = తారతమ్యము,

(సమయమును - అనియుం), వెలార్చక చనదు=వెడలఁగొట్టరాదు; గోరక ...
వచ్చును=సులభముగాఁ జేయఁదగినపనికి గొప్ప ప్రయత్నము చేయవలసి
వచ్చును. గొడ్డంటక = గొడ్డలి శబ్ద. ఔప. విఫలమనోరథుండు = చెడిన
కోరికగలవాఁడు, ఫలానుమేయంబు = ప్రయోజనముచే నూహింపఁదగినది.
రాజద్రోహిని దండింపక మనలో చేర్చుకొన్న పక్షమున వాఁడు తన యత్న
మును ఇతరులకు తెలియరానీయక పగ సాధించు నని తాత్పర్యము.

పుట. 83. చికిత్సకునివలనక = వైద్యునివలన, కోవిదుండు = పండి
తుఁడు, ఉపధాశుద్ధుక = పరీక్షచే శుద్ధుఁడైనవానిని, మందవిసర్పిణి =
మెల్లగాఁ బ్రాకునది, మత్కుణంబు = నల్లి, పర్యంకంబు = పడక, మిత్రంబు=
మిత్రుఁడు. దీనికి నపుంసక రూపము వైకల్పికము. ఇటులే-శరణము,
పాత్రము, ప్రధానము లోనగునవి: మదాయత్తంబు = నాకులోఁబడినది.

పుట. 84. నానామానవసంతాన శోణితంబులు = పలువిధముల
మనుష్య సమూహముల రక్తములు, ఆనియున్నవాఁడక=త్రాఁగియుఁన్నాను.
మానవనాథు మేనిరుధిరంబు = రాజు శరీరరక్తమును, శాల్యోదనము=మంచి
బియ్యపుటన్నము, హైయంగవీనము = అప్పుడు కాచిన వెన్న నేయి, మధుర
సూపంబు = కమ్మని పప్పు, సారతరశాకంబులు = మిక్కిలి రుచ్యములగు
కూరలు, రసాయనంబులు=పానకములు, గోక్షీరంబు = ఆవుపాలు, మద్యంబు
లును = సురయును, ఉపదంశంబులు = పచ్చళ్లును. పిచ్ఛిలదధియును =
మీఁగడపెరుఁగును, పులకండంబు=కండచక్కెరయుం, గంధ ఉదకంబులును=
సువాసనగలనీరును, స్వాద్యంబు = రుచ్యము, తలిమంబు=పడక, ఉనుకువ =
ఉనికి, ఈకొంటివేనిక, = అంగీకరించినయెడల, మోమోడి-యూ, మొగ
మోడి = దాక్షిణ్యపడి, వెరవు = ఉపాయము, కూరుకుసమయంబు =
నిద్రించు కాలము, వేచి = కనుపెట్టి, ఱేనిమేని = రాజుయొక్క యొడలిని,
నల్లక = నెత్తుటిని, మైత్రి = చెలిమి, శయ్య = పక్క. సెజ్జ, తమిపెల్లిదంబు=

ఆశ్రమముయొక్క తీవ్వరను, సీత్కారంబు = ఉస్సురనుటను, పాదసంవాహనంబు = కాళ్లొత్తిపిసుకుటను, పరిచారకుఁ = సేవకుని, ఎరిసెడుఁ = మండుచున్నది. సత్వరంబుగఁ = శీఘ్రగా, దీవియ = రూ. దివ్వె. దీపమును, సరింగినఁ = పొటిపోఁగా,

పుట. 85. స్వరూపంబుఁ = స్వభావమును, పరునిఁ = ఇతరుని, నెరసు = నలుసు, పొలియించిరి = చంపిరి. సంతానంబులకుఁ = సమూహములకు, సంతానము - నానా. కల్పవృక్షము. మృత్యుప్రాయంబు = మృత్యుదేవతతో నెచ్చుతక్కువ సరిపోలునది, ప్రాయము - ఇది-ప్రత్యయము; పదముగానున్న - వయస్సు.మృత్యు-విశ్ర. మిత్తి. లోకవిశ్రుతంబు = లోకప్రసిద్ధము; ఎత్తుట=తాఁకుట, ఎదుర్కొనుట యని భావము, కాలాగ్ని= ప్రళయకాలమునందలియగ్ని, ఏవెరవునఁ = ఏవిధమున, రోయంగలండు = వెతకఁగలఁడు, క్షుద్రుండు = అల్పుఁడు. జ్ఞాతమర్ముండు = గుట్టుదెలిసినవాఁడు, సుకరంబు = సులభము. ప్రమాదంబు = పొరపాటు. నీతికోవిదుఁడు. నీతినెఱిఁగినవాఁడు, ఈమంత్రంబుతోడన = ఈ రహస్యాలోచనముతోనే, లోగుట్టు = లోపలిరహస్యమును, లోక అపవాదంబునకుఁ = లోకము యొక్క నిందకు, ప్రకృతివర్గంబు = ప్రజలు, అవిమృశ్యకారి = విమర్శింపక చేయువాఁడు, దీనవత్సలుండు = దీనులయెడ ప్రేమగలవాఁడు, నాబడిఁ= నావెంట, నిజ+అపరాధంబు = నీతప్పును, నివేదించి = విన్నవించి,

పుట. 86. కలుపుగోలుదనంబునకుఁ అ = భేదములేకుండుటకే. నీచాః = అల్పులు, కలహమ్=జగడమును, ఇచ్ఛన్తి= కోరుదురు. సాధవః = సజ్జనులు, సంధిమ్ = స్నేహమును, ఇచ్ఛన్తి = కోరుదురు, ధర్మజ్ఞులు = ఉప. స. ధర్మముదెలిసిన వారు, వేఱిమి = భేదము, త్రప్పకుము = చెప్పకుము, ఆననంబునఁ = మోమున, ప్రత్యుత్థానంబు = ఎదురు చని తెచ్చుటను, తత్-అమీ:భావంబునకుఁ = వానిచింతకు, పరాధీనవర్తనులకుఁ = ఇతరులకు లొంగిన జీవనముగలవారికి. అంతరంబు = భేదము, పరాధీనులకు సుఖము

లేదని తాత్పర్యము. రాజసేవాపరుండు = రాజులను సేవించుటయం దాసక్తి గలవాఁడు. మృత్యుగ్రస్త - తుల్యుండు = మృత్యువుచే మ్రింగఁబడిన వానికి సమానుఁడు! నచ్చిక = నమ్మిక, మృగతృష్ణికాప్రవాహంబు = ఎండమావుల లోని వెల్లువను, ఉపన్యాస+అపనోదనంబునకున్ = నేర్పుపట్టుట పోఁగొట్టు కొనుటకు, ప్రభావించువాఁడు = పరుగిడువాఁడు, ఉర్వీశాక్షతంబునకున్ = రాజానుగ్రహమునకు, మోఁ అనుతీరునన్ = మూర్ఖునివలె, గోవల్లభుండు = వృషభము - సంజీవకుఁడు, వచనభంగి=మాటలతీరు, ఏకాంతకాంక్షా సూచకంబుగాన్ = ఒంటరిపాటుఁగోరుటను తెలుపునట్లు, ఇరుపక్కియలు = ద్వ్యా· సమాసమున రెండు-నకు ఇరు-ఆదేశము - రెండుప్రక్కలు. అపాంగ వీక్ష ణంబు=కడకంటిచూపు. ఇడుమ = కష్టము,

పుట. 87. చేటు = నాశము పాటు = కష్టము, పార్థివుండు = రాజు, దుర్వారక్రోధభీషణుండు = అణఁపరాని కోపముచే భయంకరుఁడు, కృతాంత నిశాంత ఆవేశినులన్ = యముని యింటిని జేరువానినిఁగా, హర్యక్షుండు = సింహరాజు, సంగరంబు = ప్రతిజ్ఞ, వెలిగఱచెదరు = దుర్బోధన చేసెదరు. కొండెముచెప్పెదరు అని భావము. గళజలసేతుబంధనంబు=పోయిన నీటికిఁ గట్టఁగట్టుట, ఖేద విషాదంబులు = దుఃఖమును చింతయు, అభినయించువాఁడు = చేయువాఁడు, వజ్రపాతంబు = వజ్రాయుధప్రవేటు, అసహార్యంబునట్లు - కొండనువలె, ధైర్యసారంబున్ = ధైర్యముయొక్క సారమును, అగలింపన్ = భేదింపఁగా. ఉపమాలంకారము. వెఱపెల్లిదంబునన్ = భయముయొక్క అతిశయముచేత, నివ్వెఱ = ఆశ్చర్యము,

పుట. 88. అనారతంబు = సదా, ఒప్పమి = కీడు, లగ్గు = మేలు, ఎగ్గు = కీఁడు, లాఁతివారు = పరులు, చొప్పడి = కుదిరి, పుణ్యాత్ములన్ - పాపాత్ము లనుటకు నిందార్థకము. ఆ బ్రహ్మకల్పాంతంబు = బ్రహ్మకల్పము తుదవఱకు - (బ్రహ్మకల్పము:—బ్రహ్మయొక్క దినము) - ఇందలి 'ఆజ్'

సమంతార్థకము. మనియెదరు = బ్రదికెదరు. సర్వ - అనర్థంబులకున్ = అన్ని యిడుములకు, ఎద్దీనె...కట్టింపుము = ఎద్దు ఈనినా యను తెలివియుం లేని వాఁడనుట - ఇదిలోకోక్తి. లెంకలు = సేవకులు, కొంకుమాని = జంకువిడిచి, లోఁచి = లొంగునట్లు చేసి, పరలోకదూరుఁడు = పుణ్యలోకములుఁ లేని వానిని- పాపిని, ఆపాదించున్ = కలిగించును. మనః వాక్ కర్మంబులన్ = మనస్సు చేత మాటలచేత కార్యములచేత. ఈపత్తు = కొంచెము. వక్త్రబిలము = నోరు, సెరగు = కీడు, రాగద్వేషదూషితాత్ములు = ప్రేమచే విరోధముచే దూషితమైన మనస్సుగలవారు, సాధువు×ధూర్తుఁడు; వికృతిన్ = వికార మును. త్రుంగించెన్ = చంపించెను. ససాకల్యంబుగన్ = సమగ్రంబుగ,

పుట. 89. మలయంబు-ఉపత్యకా విపినంబు - ష.త. నుగాగమసంధి. మలయపర్వతపుఁ జఱియ యందలి యడవి. ఉపత్యక (చఱియ) × అధి త్యక=కొండనెత్తము, కంఠీరవము=వ్యు. కంఠమందే రవము గలది - సింగము, గహనంబునన్ = అడవియందు, ఉష్ట్రంబు = వికృ. ఒంటె, క్రమేలకంబు= ఒంటె, భారవహనక్లేశంబు = బరువును మోయుటవలని దుఃఖమును, మొఱఁగి= వంచించి, ప్రాజ్ఞులరు = ప్రజ్ఞగలవారు. త్రాసంబు = భయము, పాసి = వదలి, శరణంబు=దిక్కు, ధర్మవిదులు=ధర్మము దెలిసినవారు, ప్రతీప...మహో బలుండు = శత్రువులయొక్క - ప్రతాపము అనెడు - దీపమును - ఆర్పుట యందు - వాయుదేవుఁడు - రూపకబహువ్రీహి - అగు మహాబలుండు = అయిన గొప్ప బలముగలవాఁడు, అలం. రూపకము, మహాత్ - అంగము = ఒంటె, అంతరంగంబునన్ = మనస్సునందు, పొంగి = సంతసించి, యథాశ్రుతం బుగన్=పెన్నది విన్నయట్టు, సాంతంబుగన్ = పూర్తిగా, వాసంతంబున్ = ఒంటెను; పంచాస్యము - వ్యు. విశాలమైన ముఖముగలది - సింగము, కృపా యత్తచిత్తంబు = దయతోఁగూడిన మనస్సుగలది.

పుట. 90. తత్ - ఉక్తప్రకారంబునన్ = అది చెప్పినట్లు, పాటవంబు = శక్తి. పాద+ఛాయన్ - హ్రస్వముమీఁది ఛకారంబుగాన ద్విత్వప్రాప్తి = పాదములనీడ, సత్త్వంబు = బలము, తోఁపెంబు = స్వల్పము, శ్రమింపఁబడును - వ్యా. కర్తృవాచకములు గాని మువర్ణకాంతశబ్దములకు షష్ఠ్యాదులు పరంబు లగుచో మువర్ణమునకు లోపపూర్ణానుస్వారంబులు వైకల్పికంబుగ నాదేశ మగును. జాపు=ఆలస్యము, ఎఱచి=మాంసము. శాసింపన్ = ఆజ్ఞాపింపఁగా, ఉఱవు = అధికము, నిర్వేదించి = దుఃఖపడి, చెఱటి = ఒకటొకటి, అండజ = వ్యు. గ్రుడ్డులవలనఁ బుట్టినది - ఇట కాకము; ఒక్కచక్కటిన్ = ఒక చోటిని, పుండరీక = పులి, జంబుకంబులు = నక్క - ద్వం.-స. బలిభుక్కు-రూ. బలిభుజము = కాకి - వ్యు. బల్యన్నము దినునది. జాడ=పొలఁకువ.

పుట. 91. చెనఁటిచేతులన్ = శూన్యహస్తములతో, బరులు = ప్రక్కలు, గ్రాసంబు = కబళమును, భృత్యభావంబు = సేవకత్వము, చొప్పు= విధము, ఆమిషంబున్ = మాంసమును, కలయన్ = అంతటను, సరిపెట్టి = చంపి, న + అన్యాపేక్షంబు = ఇతరమునుగోరనట్టుగా, నొవ్వ = రూ. నోవు = బాధ, మన మాయొంటెను చెఱుపుచేసినపక్షమున రాజునకు కోపము వచ్చి మనలను తఱుమును అని తాత్పర్యము. క్షుధాబాధితుండు = ఆఁకలిచే బాధింపఁబడినవాఁడు, కృత్య + అకృత్యంబులు=బాగోగులు, వ్యాళియున్ శార్దూలియున్ = ఆఁడుపామును ఆఁడుపులియును, నిజఅండశాబకంబులన్ = తమ గ్రుడ్లను పిల్లలను - వ్యాళి యండములను, శార్దూలి శాబకములను అని యథాసంఖ్యము. క్షుధితుండు = ఆఁకొన్నవాఁడు, తత్ +హననంబునకున్ = దానిని జంపుటకు, మోఁకగక = దాఁచక.

పుట. 92. మనపడిన తెఱంగు = మనముపడ్డపాటును, నివేదింతము= తెలుపుదము. తారు = తాము. కరుణా-ఉదారుండు = దయచే గొప్పవాఁడు,

భరణము - అన్నాదులనుపెట్టి పోషించుట, రక్షణము - భయమునుండి కాపాడుట. ధన్యుక్ = పుణ్యముకలవానిని, వ్యు. ధనమును బొందినవాఁడు. సైకంబవు = చిన్నవాఁడవు. వలంతివి = సమర్థుఁడవు; కొండొకయేని=ఇంచుకైనను, గ్రాహ్యంబు = గ్రహింపఁదగినది, కమ్మసుద్దులు = సాంకేతికములు,

పుట. 93. చిత్రవర్ణుండు=పింజె, శరీరమ్ = ఒడలు, ఆద్యం=మొదటిదైన, ధర్మసాధనమ్ ఖలు = ధర్మమునకు కారణముకదా. హతప్రాణుండు = చచ్చినవాఁడు. నాకలోకసుఖంబు = స్వర్గసుఖము, దుస్సహంబు = ఓర్వరానిది, "క్షుద్ర...పుట్టించును"-ఉపమాలంకారము. క్షుద్ర...వృధుండు= అల్పులచే - చుట్టఁబడినవాఁడు - అగురాజు; దందశూక...వడువునక్ = పాముల సమూహముచే - చుట్టఁబడిన - గంధపుఁజెట్టువలె, సమా...లకుక్ = డాసినజనులకు - దెప్పరంపు ముప్పు = అధికమైన ఆపదను, తార్కాణంబుగక్ = నిదర్శనముగా, తరునికరంబు = చెట్లమొత్తమును,

పుట. 94. సుహృద్విలోచనంబు = నెయ్యురను జూచునది, కృపాతరంగిత అంతరంగంబు = దయచే నుప్పొంగిన మనస్సుగలది, హస్తి మస్తక= ఏనుఁగు మస్తకమును, విదళన = చీల్చుటయందు, ఖరంబులు = వాఁడియైనవి, మత్-నఖరంబులు=నాగోళ్లు, దయనీయులు = కరుణింపఁదగినవారు. బెగడు= భయము, ముదల = ఆజ్ఞ, కృతజ్ఞుండు = చేసినమేలు తలఁచువాఁడు, భవాదృశులు = నీవంటివారు, తనుపుచుండుక్ = తృప్తిపఱచును. దివసంబులు = దినములు, అనుచరంబులు = నౌకరులు. రథకారుండు = వడ్రంగి, సాఫల్యపాత్రంబులు = ప్రయోజనవంతము లగుటకుఁ దగినవి, భీతచేతస్కుండు = భయపడిన మనస్సుగలవాఁడు, నేదిష్ఠపాదపంబుక్ = మిక్కిలి దాపుననున్న చెట్టును, ఆరోహించినక్ = ఎక్కఁగా, ఈసాలంబుక్ = ఈచెట్టును.

పుట. 95. అధిరోహించితివి = ఎక్కితివి, అన్వర్థాభిధానంబులు = అర్థముతోఁ గూడినపేళ్లు గలవి; అరిష్టవాచకములు = కాకజంబుకములు,

అరిష్టము = అశుభము, వంచకము = మోసపుచ్చునది. భవత్పార్శ్వచరంబులు = నీప్రక్కను చరించునవి, చమువు = పతత్రికులగుంపు, సంసర్గమునం జేసి=కూడికచే, బకోటఝాటంబు = కొక్కెరలగుంపు. సాధుచరిత్రుండు = మంచి నడవడికలవాఁడు, ప్రకృతివర్గంబున్ = జనుల సమూహమును. యథా...ప్రజాః - రాజా = రాజు. యథా = ఎట్లో, ప్రజాః = జనులు, తథా = అట్లే - కల్లనిజంబులు = అబద్ధమును సత్యమును, విపరీతంబులుగన్ = వ్యత్యస్తములుగా, అప్రతిరోధంబు = అడ్డగించుటకుఁగానిది, రణంబు = యుద్ధము. లబ్ధవిజయుండు = పొందిన జయముగలవాఁడు. యశః లక్ష్ములు = యశస్సనెడి సంపదలు - శూరలోకశ్లాఘ్యుండను = వీరులచే పొగడ్త గనువాఁడను; నాకలోకభోగంబు = స్వర్గలోకసుఖములు. నాక - వ్యు. దుఃఖము లేనిది. ఉపాయాంతరంబుచేన్ = మఱియొక యుక్తిచే, కడయుపాయంబు = కడపటినీతి-దండోపాయ మనుట, కడింది మార్తురతోన్ = కఠినులయిన (బలిష్ఠులయిన) శత్రువులతో, ధర్మంబు = పాడి, జీవన్ = బ్రదికినవాఁడై భద్రాణి = శ్రేయములను, పశ్యతి = చూచును. తనసారంబున్ = తనశక్తిని, పరసారంబున్ = శత్రువులశక్తిని,

పుట. 96. మార్కొనవలయున్ = ఎదిరింపవలయును. విపరీతంబు అయినన్ = తనశక్తిని ఎదిరిశక్తిని తెలిసికొనక తాఁకినపక్షమున, పరాభవంబు = అపజయము, సముద్రుండు = సముద్రము. వ్యా. మహద్వివక్ష యందు సముద్రాదులకు డువర్ణకము వచ్చును. పారావారము = వ్యు. గట్లను కప్పియుండినది - సముద్రము, టిట్టిభ = తిత్తిరిపక్షి, చేడియన్ = భార్యను, శకుంతంబు = పక్షి. వ్యు. శక్తిగలది. గర్భశ్రాంత = వేఁకటిచే నలయుటఁ గలది, ఎట్టికడిమి = ఎట్టినేర్పు, అవధరింపుఁడు = వినుఁడు, పులుఁగుఁజెలువ = ఆఁడుపక్షి, పర్వదివసంబులన్ = దర్శప్రతిపత్సంధులందు (అష్టమి, చతుర్దశి, అమావాస్య, పూర్ణిమ, సంక్రమణము - ఇవి యైదుఁ పర్వదినములు.) సము

తుంగ - రంగత్ - తరంగంబులు = మిక్కిలియెత్తుగా నటించుచున్నయలలు, నింగిముట్టి = ఆకసమునందాఁకి, ఆవాసంబు = ఇల్లు, ఆసన్నంబగుటన్ = దగ్గఱ యగుటచే, అండంబులు = గ్రుడ్లు, కాండ-ఆక్రాంతంబులు = జలముచే మునుఁగఁబడినవి. వైళంబు అ= వేగమే, పోలినయిరవు = తగినచోటు, ప్రసూతి సమయంబు = కాన్పుకాలము, దేశాంతరగమనంబు = వేఱొకదేశమునకుఁ బోవుట. సుకరము = సులభము, అలంబు సేసి= ఉపేక్ష చేసి, మందహాస సుందర వదనంబుతోన్ = చిఱునగవుచే నందమయిన మోముతో, కువలయ - నివహంబునకున్ = కలువల మొత్తమునకు. తుహినకిరణుండు = చంద్రుఁడు - వ్యు. మంచు కిరణములుగాఁగలవాఁడు. పుండరీక షండంబునకున్ = తెల్ల తామరల మొత్తమునకు. చండభానుండును=తీక్ష్ణమయిన కాంతిగలవాఁడును-సూర్యుఁడు ననుట. చాతక వ్రాతంబునకున్ = చాతక పక్షుల సమూహంబునకు, జీమూతంబును = మేఘమును, వ్యు. నీటిమూట. నాగాంతకుండు = గరుడుఁడు - (తొల్లి గరుడుఁడు అమృతము దెచ్చునప్పుడు, పాములు తనకు భోజ్యములు గావలయు నని ఇంద్రునివలన వరము పడసెను. అది మొద లితఁడు నాగములను జంపి తినుచుండును.) ప్రభుండు - కలువలకుఁ జంద్రునివలెను, తామరలకు సూర్యునివలెను, చాతకములకు మేఘమువలెను మనకు గరుత్మంతుఁడు ప్రభు వని తాత్పర్యము. నిజ...బలుండు-నిజపక్ష= తన ఱెక్కలయొక్క, విక్షేప = కదల్పుచేత, జాత = కలిగిన, వాత=గాలిచే, ఉద్ధూత = వెదఁజల్లఁబడిన, క అండ కాండ = బ్రహ్మాండములయొక్క సముదాయముగలవాఁడు, చండబలుండు = అధికమైన బలముగలవాఁడు. ఆగరుత్మంతుఁడు తన ఱెక్కలగాలిచేత బ్రహ్మాండములను పెక్కింటిని ఎగురఁగొట్టువాఁ డని భావము. తత్ - ఆశ్రయులన్ = అతనిని జేరినవారిని, జడాశయుండు = మందబుద్ధి; రూ. జలాశయుండు (సముద్రుఁడు) అని శబ్దశ్లేష. మయిమంబున్ = అనాయాసముగా, కొఱమాలిన = పనికిమాలిన, హత్తించెదు = కలఁత పెట్టెదవు.

పుట. 97. సమాహిత చిత్తంబునన్ = నెమ్మదితో, టిట్టిభి = ఆఁడు తిత్తిరి. భావి-అనర్థంబునకున్ = రాఁబోవు నాపదకు, ప్రహాణకంబు = వినాశముచేయునది, ప్రమత్తుండయి = మదించినవాఁడయి, నయవిజ్ఞాన సంపన్నులు = నీతిశాస్త్రజ్ఞానముతో గూడినవారు, విజ్ఞాన మనఁగా శాస్త్రములు చదువుటచేఁ గలిగిన జ్ఞానము. మోక్షవిషయక మయిన తెలివి జ్ఞాన మనఁబడును. గర్హింతురు = నిరాకరింతురు. అస్మాదృశ = మనవంటి, చెప్పనేల-ఎంతటి పరాక్రమవంతుఁడైనను రాఁబోవు చెడుగునకుఁ బ్రతీకారము నాలోచింపక గర్వించియున్నయెడ వానిని నీతి తెలిసినవారు దూషింతురు; పరాక్రమవంతునే దూషింపఁగా మనలఁ దూఱుదు రని వేఱుగా చెప్పవలసినదే పనిలే దని తాత్పర్యము. బాలిశుండు=వికృ. పాలసుఁడు. మూర్ఖుఁడు, కాసారంబు = కొలను, చక్ర...రమ్యంబు - చక్ర = చక్రములు, చక్రాంగ = హంసలు, ప్రముఖ = మున్నగు, జలవిహంగమ = నీటి పక్షులయొక్క, విహార = సంచారముచే, రమ్యంబు = మనోజ్ఞమయినది, పుండరీక...సంకులంబు పుండరీకషండ = తెల్లతామరల మొత్తములయందలి, సాంద్ర = దట్టమైన, మరంద = తేనెయొక్క, ధార - ఆసార = పరంపరల తుంపరలతో, సంభ్రమత్ = ముసరుచున్న, భ్రమర = తుమ్మెదలయొక్క, ఝుంకార = శబ్దముచేత, సంకులంబు = నిండినది, ఎసంగున్ = ఒప్పును. కంబుగ్రీవంబు-వ్యు. శంఖమువంటి మెడ గలది. కూర్మంబు = తాఁబేలు. వ్యు. భూమియందు వేగము గలది. వఱపునం జేసి = వానలేమిచే, కాసారంబు = కొలనియొక్క, వారిపూరంబు = నీటిసమూహము. ఇవురన్ పాఱుదున్ = ఇంకఁగా, మరాళంబులు = అంచలు, దేశాంతర జిగమిషన్ = వేఱొండు దేశమునకుఁబోవు వ్యాజమును, కచ్ఛపంబు = తాఁబేలు, వ్యు. కన్నెమునఁ ద్రాగునది. ఎలుంగు ఱుత్తుకన్ తగులన్=ధ్వని ఱుత్తుకలోనే యణఁగఁగా, కమఠంబు = తాఁబేలు, వ్యు. నీటియందుఁ దిరుగునది. ఏక-ఉదరులము = అన్నదమ్ములము. చలిపితిమి= చేసితిమి. దోసంగు = విఘ్నము, కలిమిం జేసి = ఉండుటచేత, వలంతులు =

సమర్థులు - అంతరంబు = తారతమ్యము, ఇచ్చవచ్చినచోటికి పోవ శక్తిగల మీకును పోలేని నాకును మిక్కిలి తారతమ్యము కలదు. అని తాత్పర్యము.

పుట. 98. అనురూపంబుగన్ = తగినట్లు, తుదముట్టింపవలయున్ = కొనసాగింపవలెను, వెరవు = ఉపాయము, సయింపంజాలన్ = ఓర్వలేను. విప్రకృష్టదేశగాములకున్ = ప్రకర్షలేని (క్రొత్త) దేశములకుఁ బోవువారికి, దుస్సాధంబు = చేయరానిది, కక్కసించినన్ = తొందరపెట్టఁగా, యష్టిన్ = కొయ్యను, ప్రమాదంబున్ పొరయక = పొరపాటుచేయక, తత్ - అనీతం బయిన = వానిచేఁదేఁబడిన, కాష్ఠంబు = కట్టె, చంచువులన్ = ముక్కుల యందు, తత్ - అంచలంబులు పొంకించి = దాని మొనలను పొందికచేసి, అంబర తలంబు = ఆకాశప్రదేశము, మాంసలుబ్ధులచేన్ = కటికవారిచే, అనర్థ ఆవహంబు = కీడు గలిగించునది, అభిజనంబున్ = జన్మస్థలమును, దైవ పరుండు = దైవమే ప్రధానముగాఁగలవాఁడు, దేవునే నమ్మినవాఁడు.

పుట. 99. జలాశయంబునన్ = కొలనియందు, అనాగతవిధాత - వ్యు. రాఁబోవుదానిని తెలియువాఁడు, ప్రత్యుత్పన్నమతి - వ్యు. అప్పటికిఁ దగిన బుద్ధిస్ఫురణము గలవాఁడు. యద్భవిష్యుఁడు - వ్యు. ఏది జరుగవల యునో యది జరుగఁగల దనువాఁడు, లేబరంబయ్యెన్ = శూన్యమయ్యెను, మెలంకువ = జాగ్రత్త, మసలినన్ = ఆలస్యముచేసిన, మోస = కీడు ధ్రువ ఉదంబు = నిలువయైన నీరుగలది, హ్రాదంబు = లోఁతైన నిడుపాటి నీటి పట్టు - మడుఁగు, వరవ = నీరువచ్చుట కేర్పఱచిన కాలువ, వెనుమూయన్ = నిల్చినయెడల, నడికిరేయిటన్ = అర్ధరాత్రంబునందు, మైనికులు = జాలరి వాండ్రు, వ్యు. మీనము జీవనముగాఁ గలవాండ్రు. హ్రదము = ఏటినడిమి పల్లము, ఉల్లంబు = మనస్సు, ఊపికిల్లెడున్ = మునిఁగెను, అల్ప - అవశేషం బుగన్ = కొంచెము మిగతగా, శోషిల్లుడున్ = ఇంకఁగా, ఎత్తెం = చేపలఁ బట్టెడి యడ్డువల, కొడమ = చేఁపలను బట్టెడి పొంతవంటివల, గత్తె = తిత్తి

వంటి పెద్దసాధనము, మావు = చేపఁబట్టు సాధనవిశేషము. మీలకున్ = ష. వ. మీనులకున్,

ప్రు. 100. కెడయించిరి = చంపిరి. మృతకల్పంబుగన్ = చచ్చిన వానితో సమానముగా, వ్యు. కొంచెము తక్కువగా మృతుఁడు. తేలగిలన్ = పైకి తేలునట్లుగా, వారిన్ = నీటియందు, వారిన్ = ఆపదను. కొందలపడకుము = కలఁతపడకుము, నెఱమగంటిమి = నిండు మగతనము, కల్లోలమాలాభీలంబుగన్ = అలలసమూహముచే భయంకరముగ, పులుఁగువెలంది = ఆఁడుపక్షి, తొరఁగన్ = కాఱఁగా, అంగలార్చుచున్ = భయముచే సఱవఁగా, ఖగంబులు = స్వజన సమూహమును, అజాండసహితంబుగన్ = బ్రహ్మాండముతో, ఆవరణ వారిపూరంబు = చుట్టుకొనియున్న జలము = గండూషింపంజాలిన = పుక్కిలించి ఉమ్మివేయఁగలిగిన, చండవిక్రముఁడును, గొప్పపరాక్రమముగలవాఁడు, వజ్రతుండుఁడు=వజ్రాయుధమువంటి ముక్కుగలవాఁడు,—గరుడుఁడు, ఈజడ ఆత్ముండు = ఈ మందబుద్ధికలవాఁడు— ఈ ఉదకరూప మయిన స్వరూపము గలవాఁడు, గర్వంబు = కావరమును, నేఁడు గోరంత...వచ్చున్ - ఈ అపరాధము చిన్నది అని విడిచిపెట్టినయెడల ఱేపు గొప్పతప్పిదమే యితఁడు చేయు నని తాత్పర్యము. - ఇది యొక లోకోక్తి. అవహిత చిత్తంబులతోన్ = అవధానముతోడి మనస్సులతో, వినత ఆనంప సంధాయకుండు = నమస్కరించినవారికి సంతోషమును గలిగించువాఁడు, వినతా నందనున్ = వినతయొక్క కొడుకును. అప. తద్ధి=వైనతేయుఁడు (గరుడుని తండ్రి కశ్యపుఁడు; తల్లి వినత).

పు. 101. అనిష్టంబు=ఆపదను, తాత్పర్యము = తత్పరత్వము, పక్షిస్వామి=పక్షీంద్రుఁడు, సాక్షాత్కరించి=ప్రత్యక్షమై, హృష్టుండనైతిన్ = సంతోషించిన, అండజాతంబులు=పక్షులు. వ్యు. గ్రుడ్డునుండి పుట్టినవి. అవజ్ఞన్=అపచారమును, కుపిత చేతస్కుఁడై=కోపముగొన్న మనస్సుగలవాఁడై,

నదీనేతఁ=నదులతోఁ బెనిమిటిని-సముద్రుని ననుట, నిజఆదేశంబునఁ = తన ఆజ్ఞచేత, ఇప్పటికిఁ = ఈసమయమునకు, క్షమియించితిఁ = సన్నించితిని. అస్మత్ జనంబులకుఁ = మాజనులకు, ఎగ్గు = కీడు, లగ్గు = మేలు, నుడివి = చెప్పి, అంతర్హితుండు అయి = అగుపడనివాఁడై, చనియెఁ = పోయెను.

కలకాలంబు = ఎల్లకాలము, పోము-రూ. పోవము. నిక్కంబు = నిక్కువము - యథార్థము, గిట్టినవారిఁ = చచ్చినవారిని, కానము = చూడము, మనకన్నుల...గానము - ఎందఱినో చూచుచున్నాము. పగతుమొగంబునకుఁ=శత్రువుబారికి, మొగము - రూ. మొకము - మోము. ప్ర. ముఖము. తొలంగినఁ = తప్పినను, మృత్యువు మొగంబునకుఁ = యమునిబారికి, నేఁడుపగతు...వచ్చునే - శత్రువుచే చావకపోయినను యమునిచేతఁ జావు తప్పదు అనిభా. దానఁ చేసి=శత్రువు నెదుటనుండి పాఱిపోవుటచేత, అపయశంబు = అపకీర్తి, ప్రయోజనంబు = ఫలము, పగతుకడిమి = శత్రువు యొక్కపరాక్రమమును, తడవక = విచారింపక, కడఁగినవాఁడఁ = ప్రయత్నము చేసినవాఁడను, లాఁతి వెరవు = మఱియొకయుపాయము, లావు=గొప్ప, కామిఁ జేసి = కాకపోవుటచేత, కామి-అగుభా. వ్యతిరేకభావార్థకము, ప్రకృత ఉద్యమంబుఁ = ఇప్పటిప్రయత్నమును, పూనవలసెఁ = పొందవలసి వచ్చెను. ప్రాణహానికిఁ అయినఁ = ప్రాణముపోవుటకైనను, మానహానికిఁ= మానముపోవుటకు, ఇది = ఈమాట, నాకడంకకుఁ = నాపూనికకు, అడ్డ వాట్లు=విఘ్నములను, ప్రేయకుము = చేయకుము, కట్టాయితంబు=కడు+ఆయితంబు = మిక్కిలి సిద్ధము, సరభసగమనంబునఁ = మిక్కిలి వేగముతోఁ గూడిన నడకచేత, చనువాఁడు=పోవుచున్నవాఁడు, ఱేని యిరవు మోసలఁ= రాజునింటిముందఱ, అసమయంబు = తగనికాలము.

ప. 102. సమయంబు+అ = తగినకాలమే, నీరాకఁ = నీయొక్క వచ్చుటను, మొగి తేరఁ = కలుగఁగా, విలోకించి = చూచి, కార్యంబు:

ఖండించికొని = పనినెఱవేర్చుకొని. తుదముట్టన్ = అంతయు, సన్నిధానంబునన్ - రాజుదగ్గఱ నుండు, పుత్తెంచి = పంపి, కొంతవడికిన్ = కొంతసేపటికి, ఓసరిలన్ = తొలఁగి, అల్లనన్ = మెల్లగా, లోనియిరవునన్ = లోపలియింటియందు, వారితోడిసల్లాపంబులు = వారితోడన్ సల్లాపంబులు = ఆటపాటకథలతోడి ముచ్చటలను, వ్యా. సమాసమునందు చేత, తోడ, వలన - లలోనిచివరి అక్షరమునకు ఇత్వ మగు. ప్రత్యుత్థానంబు=ఎదురుకోలును, కుశలప్రశ్నంబు=క్షేమముయొక్క అడుగుటను, తత్ అవసర ఉచితంబుగన్= ఆసమయమునకుఁ దగినట్టుగా, ఏకాంతంబు = ఒంటరిపాటును, ఆకాంక్షించు మాజాడ = కోరునట్టి మా యభిప్రాయమును, ఎడ = దూరము, నయభయంబును=నీతియును భయమును, వచనీయంబు = చెప్పఁదగినదానిని, అశేషంబు = సమస్తమును, వచియించితిని - వచించితిని = చెప్పితిని. పోలినవచనంబులు = తగినమాటలను, తెంపరితనంబు=సాహసము, - వ్యు. తెంపు + అరి- వాకొనన్ = చెప్పుటకును, ఊఁకొనన్ = ఊఁకొట్టుటకును, పోలవు = తగవు. ఉద్యమంబు= ప్రయత్నము, ప్రతికూలంబు = విరుద్ధము, తత్ వచనభంగిన్ = వాని మాటలవిధముచేత, చిరకాలంబు = దీర్ఘకాలము, సంగాతంబు = స్నేహము, కానిచేఁతకున్ = చెడ్డపనికి, ఒత్తి = నొక్కి, తానుబట్టిన...కాళ్లు - తన పట్టు వదలకున్నాఁ డనుట - లోకోక్తి-వినాశకాలే = చెడిపోవుకాలమునందు, విపరీతబుద్ధిః = విరుద్ధమయినబుద్ధి - కలుగును అని అధ్యాహార్యము. ఇదియు నొకలోకోక్తి. అను వచనంబు = అనుమాట. కాలంబు = చావు, ఆసన్నంబు= సమీపించినది.

పు. 103. కుబుద్ధి = దుర్బుద్ధి, పర్యవసానంబునన్ = కట్టకడపట, తెల్లంబుగన్ = స్పష్టమగునట్లు, అడ్డవాట్లుప్రేయకుము = అడ్డుమాటలుపలుకకుము, దిట్టతనంబు = ధైర్యము, ఇంతకున్ = ఇంతసేపటికి, కృతసన్నాహుండు ఐ = చేయఁబడిన ప్రయత్నముకలవాఁడై (ప్రయత్నముతో అని

భావము.), డాయన్=దగ్గఱకు, కర్తవ్య అంశంబు = చేయఁదగినవిషయము, దేవరచిత్తంబునకున్ ఎ = ఏలినవారిమనస్సునకే, విదితంబు = తెలిసినది. అహాహా - ఆశ్చర్యార్థకము, సాహసము=తెగువ. అహాహా సాహసంబు - ఎంత సాహసమురా వీనికి, ఆశ్చర్యకరమైయున్నదే అని భావము. ప్రళయజ్వలనము= ప్రళయకాలమందలి అగ్ని, శలభంబు = మిడుత, విలంఘింపన్ = పడుటకు, ఔర కావరము - ఎంతమదమెక్కియున్నదని భావము. అధిక్షేపించుచున్ = దూఱుచు, క్రోధదుర్నిరీక్షుఁడు = కోపముచేతఁ జూడ శక్యముకానివాఁడు. హార్యక్షవల్లభుఁడు - సింహరాజు - పింగళకుఁడు, హార్యక్షము = హరి+అక్షము-వ్యు. పచ్చని కన్నులుగలది. విపక్షశిక్షాదీక్షన్ = శత్రువుయొక్క దండించుట అను వ్రతమును, సముత్థితుండు - వ్యు. సమ్+ఉత్+స్థితుండు = లేచిన వాఁడు, నిర్గమించి = తరలి, ఖురప్రహారంబులన్ = గిట్టల దెబ్బలచేత, దుమారంబులు = దుమ్ములను, నిరవకాశంబు+కన్ = సందులేనియట్లుగ, తిరోహించి = కప్పి, మఱుఁగుచేసి; ప్రావృషేణ్య+ధారాధర+వారంబు = వర్షాకాలమందలి మేఘముల సమూహమును, విడంబింపన్ = పోలఁగా, ధరాతలంబు = భూప్రదేశము, - సంభా. పూ. కర్మ., అదురన్ = కదలునట్లు, దురవలోకభీకర ఆకారంబు = చూడఁ దరముకాని భయంకరమైనరూపు, మీఱన్ = అతిశయించునట్లు, పాఱుతెంచు = పరుగెత్తివచ్చుచున్న, ఉక్ష+అధ్యక్షున్=శ్రేష్ఠమైనయెద్దును (వృషభరాజును) ధరాధరంబులు=కొండలు - వ్యు. భూమిని ధరించునవి. మాఱుమెలంగన్ = ప్రతిధ్వనించునట్లు, క్ష్వేళారావంబు=సింహనాదమును, (శత్రువునకు భీతికలుగుటకై చేసిన బొబ్బరింత), సటాసంఘాటంబు = జడలసమూహము, నిక్కన్ = ఉన్నతముకాఁగా (నిట్టనిలువఁగా), కర్ణంబులు = చెవులు, ఔక్కించి = నిక్కపొడుచుకొని, పింగళ+ఈక్షణంబులన్ = పచ్చనికనులనుండి, విస్ఫులింగంబులు = మిణుఁగుఱులు, ఎగయన్ = ఎగురఁగా, అరాళదంష్ట్రాకరాళంబుగన్ = వంకరైనకోఱలచేత భయంకరమగునట్లు, ఆస్యగహ్వరంబు = గుహవంటినోటిని, జిహ్వాపల్లవంబు =

చిగురువంటినాలుకను, అల్లార్చుచున్ = ఆడించుచు, కుప్పింపన్ = ఎగిరి దుముకఁగా, చొప్పన్ = జాడను (త్రోవను), తప్పించి = తొలఁగించి, వృషభ ఇంద్రుండు = ఎద్దులయందు శ్రేష్ఠుఁడు—సంజీవకుఁడు, సముత్క్షిప్త వాలవిక్షేపంబు = పైకెత్తఁబడిన తోఁకయొక్క కదలుట, పెల్లు = మిక్కిలి, త్రుళ్ళి = గర్వించి, బయలన్ జాడించుచున్ = బయటకదలించుచు (గాలినా సాడించుచు), భూ నభః అంతరంబు=భూమియొక్కయు ఆకాశముయొక్క యుండడిమి ప్రదేశము (భూమికిని ఆకాశమునకును మధ్యప్రదేశము - అంత రాళము), బూరటిల్లన్ = నిండునట్లు, ఉదార ఆరావంబు = పెద్దఱంకె, మస్తకంబు = తలను, ఏటవాలుగన్ = వంపుగా, ఒడ్డుకొని = చాఁచుకొని, మెఱసిన తెఱఁగునన్ = ప్రకాశించినవిధమున, ఉఱికి = పరువెత్తి, ఉరమ్ము = ఱొమ్మును, క్రుమ్మన్ = పొడువఁగా, ఎకిమీఁడు = రాజు, సొమ్మసిల్లి=మూర్ఛ పోయి, తెప్పునన్ = శీఘ్రముగా, తెప్పిఱి = తెలిసి, ముప్పిరిగొనుకోపంబు= మూఁడంతలు ఎక్కువైనకోపమును, ముప్పిరి = మూఁడు+పేరులు-వ్యా. సమాసమున మూఁడుశబ్దములోని డు వర్ణమునకు లోపము, మీఁది హల్లునకు ద్విత్వము, పూర్వదీర్ఘమునకు హ్రస్వము - ఆచ్ఛికద్విగువుగాన నేకవచనము. ఆటోపించి= త్వరపడి, లాఘవంబునన్=చులుకనచేత, లంఘించి=దుమికి, వజ్రసఖంబులు = వజ్రాయుధమునకు మిత్రములు (అనఁగా వజ్రాయుధముతో సమానమైనవి.) నఖంబులు = గోళ్లు.

పు 104. ఊడుకొనన్ = గ్రుచ్చుకొనునట్లు, మూఁపురంబు=భుజశిరమును, చఱచినన్ = కొట్టఁగా, తొరుఁగు కీలాలజాలంబు = కాఱుచున్న నెత్తుటిసమూహము, నగ...పూరంబు - నగ = కొండయొక్క, శృంగ=శిఖరమునుండి, నిస్సరత్ = ప్రవహించుచున్న, ఝరీపూరంబు = సెలయేటిప్రవాహమును (ప్రవాహముయొక్క అతిశయమును), అనుకరింపన్=పోలఁగా,-నగ ...అనుకరింపన్=పింగళకుని గోటిదెబ్బలచే కాఱిన నెత్తుటిచేఁ దడిసిన సంజీవ

కుఁడు సెలయేటితోఁగూడిన కొండవలె నుండె నని తాత్పర్యము, గోవల్లభుండు=
గోవులకుఁ ప్రభువు - సంజీవకుఁడు, మలంగి = పెనఁగి, శాతశిఖరంబులు=వాఁడి
మొనలు గలవి, ఖురంబులు = డెక్కలు - గొరిజలు, తాఁచినన్ = కొట్టఁగా,
తాఁపు = దెబ్బ, తత్పరాభవంబు = సంజీవకునివలనఁ గలిగిన యవ
మానము, గుండియలు = గుండెలను, అవియింపన్ = పగులఁగొట్టఁగా, బెండు
పడి = నిశ్చేష్టితుఁడై, కంఠీరవవల్లభుండు = సింగములరాయఁడు - కంఠీరవము
వ్యు. కంఠమునందుధ్వనికలది. దండతాడిత భుజంగంబుభంగిన్=కఱ్ఱచేఁగొట్టఁ
బడినపామువలె, భుజంగము - వ్యు. వంకరగాఁబోవునది. రూ. భుజగము.
రోఁజుచున్ = నిట్టూర్పు విడుచుచు, అవలోకించితి - ఏ = చూచితివా-ఇందలి
ఏకారము నిందావాచకము. భవదీయకుమంత్రశ్రవణఫలంబు=నీదయిన దురా
లోచనముయొక్క వినికివలనఁ గలిగిఫలాధిమును-నీమాటవిన్నందువలని ప్రయో
జనమును, చూపోపక = ఓర్వఁజాలక, అన్యోన్యరకున్ = పింగళక సంజీవకులకు,
భేదమున్ = విరోధమును, మొదలన్=మొదటనే, దూరము విచారింపవైతివి -
దీర్ఘాలోచన చేయకపోయితి వనుట. పండితమాని=పండితుఁడని తన్ను తలఁచు
వాఁడు, తనకె=తనకున్+ఎ=తనకుమాత్రమే, స్వామికిన్ సహితము=రాజునకుఁ
గూడ, అహహా - సంతాపార్థకము. మహాపదన్ = మహత్+ఆపదన్=గొప్ప
యాపదను, ఇడుమ = ఆపద, తలంగువెరవు = తొలఁగించునట్టియుపాయము,
పరికించితిమి: ఏనిన్ = ఆలోచించినపక్షమున, వలంతులము అ = సమర్థులమే.
పొంకంబుగాన్ = పొందికగా, బింకంబులు = కావరపుమాటలను, ఆడన్
వచ్చును = చెప్పవచ్చును. పోరామి = కష్టము, సంబళించుట=వల్లపఱచుట -
నిర్వహించుట, సుకరంబు = సులువు. దుర్జనసేవితునిన్ = దుష్టులచేత సేవింపఁ
బడినవానిని, కమలషండమండితంబున్ ఏనిన్ = కమలసమూహముచేత నలంక
రింపఁబడిన దానినైనను, గ్రాహాక్రాంతంబున్ = మొసళ్లచేఁ జుట్టఁబడినట్టి,
హ్రదంబునుబోలెన్ = మడుఁగునువలె, రాజును... వెఱతురు - మొసళ్లతోఁ
గూడినకొలను కమలములచే నలంకరింపఁ బడినప్పటికిని ఎట్లు ప్రవేశించుటకు

జనులు భయపడుదురో, అట్లు రాజు ఎంతమంచివాఁడైనను దుర్జనులతోఁ గూడినయెడల వానిని జనులు చేరజాలరని తాత్పర్యము. స్వార్థపరుండవు = నీపనియందే ఆసక్తికలవాఁడవు, అనర్థము = కష్టము, ఏకాకిన్ = ఒంటి వానిఁగా, ఏరిన్ = ఎవరిని, చేరనీక = దగ్గఱ రానీయక. తాను అ - అందఱి పనులు పైనివేసికొన్నవాఁడే యనుట. అసాధువులకున్ = దుష్టులకు, హిత ఆపాది అయి = మేలుచేయువాఁడై. తత్ప్రసాదంబునన్ = ఆ ప్రభువు యొక్క అనుగ్రహముచేత, పడసిన = పొందిన, నశింపఁగు = చెడను.

పు. 105. అహితంబు = కీడు, గడియించినది = సంపాదించినది, తత్ప్రసా...చెడిపోవును - రాజానుగ్రహముచేత వచ్చినసంపద చెడదనియు, రాజద్రోహముచేత సంపాదించినది మిక్కిలిత్వరలో చెడు ననియు తాత్పర్యము. అర్థశాస్త్ర...అయ్యున్ = నీతిశాస్త్రము నెఱుఁగనివారైనను, పండిత మానులుఅయి = పండితుల మని తలఁచువారై, కృత్యాకృత్యంబులు = చేయఁదగినపనులను చేయరానిపనులను, నిర్ణయింతురు = నిశ్చయింతురు. ఫలవైపరీత్యంబునన్ = కార్యముచెడినపుడు, దైవప్రాతికూల్యంబు = దైవము యొక్క ప్రతికూలత్వమును, నిమిత్తంబుగన్ = కారణముగా, వచియింతురు కాని = చెప్పుదురేతప్ప, నీతిశాస్త్రము నెఱుంగని కొందఱు తాము సర్వజ్ఞులని యెంచి, తెలిసియుం తెలియనిపనులను చేయుదురు; ఆకార్యములుచెడినయెడల దైవానుకూల్యములేమిచేఁ జెడిన వని తలంతురనిభావము. అట్టిమూర్ఖులకున్ = అట్టిమూఢులకు, సూచీముఖమువలెన్ = సూచీముఖమనుపక్షివలె, సూచీముఖము - వ్యు. సూదివంటి ముక్కు గలది.

హిమవంతంబు - వ్యు. మంచుకలది, ప్రాంతంబునన్ = దగ్గఱ, కుసుమ...కాంతంబు - కుసుమ=పువ్వులయొక్కయు, ఫల=పండ్లయొక్కయు, సంతాన = సమూహముచేత, కాంతంబు = మనోహరమైనది, కాంతారంబు = అడవి, కపిసందోహంబు = కోఁతులగుంపు. కపి - వ్యు. చలించునది. జ్యోతి

రింగణసంఘంబు = మిడుఁగురుఁబురుగుల సమూహము. అనలంబు = నిప్పు. అనుబుద్ధిం జేసి = అనుతలఁపుచేత, డాసి = దగ్గఱకుఁ బోయి, నిప్పుకలు = నిప్పులు. పురువులు - రూ. పురుగులు, ఆచాయన్ = ఆతట్టు, అల్లమహీరుహంబుచేరువన్ = అయగపడుచున్న చెట్టుదగ్గఱ, మహీరుహంబు - వ్యు. భూమియందు మొలచునది. ఇంగలంబు = నిప్పుక, పాచికొండు = పోఁగొట్టుకొనుఁడు. మర్కటము = కోఁతి, - వ్యు. తిరుగునది. గాటంబు=ఎక్కువ.వి.కృ. ప్రకృతి-గాఢంబు. దీపింపన్ = అతిశయింపఁగా, కర్తవ్య ఉపదేష్టవు = చేయఁదగిన దానిని ఉపదేశించుదానవు. గ్రక్కునన్ = శీఘ్రముగా, కాలంబుతుదముట్టించెన్ = చంపెను.

బుద్ధిహీనునికిన్ = బుద్ధిచేతవిడువఁబడినవానికి. ప్రియవాదులు = ఇచ్చకములాడువారు, పెక్కండ్రు = అనేకులు - రూ. పెక్కురు. దుర్లభుండు = అరుదు. హితశ్రోత = హితమును వినువాఁడు, దుర్లభుండు = దొరకఁడు, రోయువాఁడు = వెదకువాఁడు.

పు. 106. కోలుపోయెను = పోఁగొట్టుకొనెను. సాకల్యముతోన్ = పూర్ణముగా, వాక్రుచ్చెదను=చెప్పెదను, ఆకర్ణింపుము = వినుము.

జనావలి = వ్యు. ఎక్కువజనముకలది. దేహారులు = వర్తకులు, తద్దయున్ = మిక్కిలి, సౌహార్దంబు = స్నేహమును, వర్తింతురు = ఉందురు. లాఁతివిలాతికిన్ = ఇతరదేశమునకు, పాలిబేరంబు = భాగముతోడిబేరమును, అభిమతంబు = ఇష్టమును - ధనముసంపాదించుట యనుట, ఒడఁగూడుడున్ = నెఱవేఱఁగా, అభిజనంబునకున్ = తొల్లింటివాసస్థానమునకు, తానుండు చోటు నివాస మనియు, తనపూర్వు లుండుచోటు అభిజన మనియు నెఱుఁగవలెను. ఆనయించుట = తెచ్చుటను, ప్రకటింపన్ చనదు = వెల్లడిచేయరాదు. న్యాయార్జితంబు = న్యాయము చేత సంపాదింపఁబడినది. కొఱంత = తక్కువ, సరఘాసముత్కరసమార్జితంబు = తేనెటీఁగలసమూహముచేఁ గూర్పఁబడినది.

మధువు = తేనె, తొఱఁగి = విడిచి, కులము=జనులు. పోఁద్రొక్కొనుట = తీసికొందురుగదా. నగరంబుపజ్జగడక్ = పట్టణంబువెలుపల, రొక్కంబు = ధనమును, గుప్తంబు = దాఁచఁబడినదానిని, పలుకారితిక్ = కొనలసిన...స్వామి, ఒడంబడి = సమ్మతించి, బిందియక్ = బిందెయొక్క, పొంకుపఱిచి = భద్రము చేసి - పదిలపఱిచి, సాభిజ్ఞానంబుగన్ = గుఱుతుతోఁ గూడినట్లుగా. ఒక్కచోట మహీరుహంబుచేరువన్ = ఒక చెట్టుదగ్గఱ. బాంధవులు = ఇతరులు, పాఁతి = పూడ్చి, తమఇరవులకున్ = తాముండుచోట్లకు, సుఖమ్ముండిరి = సుఖముతో నుండిరి. గుప్తప్రకారంబునన్ = రహస్యరీతియైనవిధమున, త్రొచ్చి= త్రవ్వి, శంకింపన్ = భయపడుట, పెద్దకాలము = చాలకాలము, నను మూసితిమి = మోసపుచ్చితిమి. ఉల్లంబులందున్ = మనస్సులలో, పెఱలు = ఇతరులు, కొఱంత = తక్కువ. రాజన్యవంశజుఁడు - వ్యు. మహారాజులగలది; పెద్దరాజులగలది రాజవంశ మనఁబడును. విషయంబునన్ = దేశమునందు.

పు. 107. చనుగొమ్మ = రొమ్ము. తోడ్కొని = వెంటబెట్టుకొని, పరికించి = చూచి. విపణ్ణుండు = దుఃఖముకలవాఁడు, అప్పళించుకొని = కొట్టికొని, మిత్రద్రోహి=స్నేహితునికి ద్రోహముచేసినవాఁడు. ఒంటిక్ = ఒంటరితనముచే, విషాదంబు = దుఃఖమును, దక్కించికొనక్=లభ్యపఱుచుకొనుటకు, అన్యులు = ఇతరులు, అలంతులక్ = సులువుగా, కినుక = కోపమును, మెచ్చుగన్ = మెచ్చునట్లు, బహిర్వాసంబు = ఉత్తరీయమును, కటివస్త్రంబున్ = మొలయందలి వస్త్రమునందు, ఆకర్షింపన్ = లాగఁగా, వివగించి = అసహ్యపడి, నేలవిడిచి సాముచేసెదవు - ఆధారములేక దోషారోపణము చేసెదవని తాత్పర్యము. నాలుకమిగులరానీకుము = ఎక్కువగా మాటాడకుము. తాళిక= ఓర్పు, కొలుపోయినవానికిన్ = పోఁగొట్టుకొనినవానికిని, ఎంతదూరంబు - సొమ్ముపోయినవానికి ఓర్పు ఉండుట కష్ట మని తాత్పర్యము. కాదే = కదా. చేపట్టు = చేతియొక్కపట్టును, నివేదింపన్ = విన్నవింపఁగా.

పు. 108. ఇంత = ఇంతమాత్రమే. ఒక్క పాపంబు = ఒకదోష
మును, పార్థివుండు = రాజు, వ్యు. పృథివికి ఈశ్వరుఁడు. ధర్మ అధికృతులన్ =
న్యాయాధిపతులను, తగవు = జగడము, నియోగింపన్ = ఆజ్ఞాపింపఁగా, అవ
ధానంబుతోడన్ = నెమ్మదితో, అవధరించి = విని, వాదిన్ - నందిగుప్తుని;
ప్రతివాది సుదర్శనగుప్తుఁడు, కొనినందులకున్ = అపహరించినందులకు,
సాక్షులు - వ్యు. సాక్షాత్తుగాఁ జూచినవారు. ఆననంబు = ముఖమును,
దీనంబు = దుఃఖముతోఁగూడినదానినిగా, వెండియున్ = మఱియు, నాశప
థంబు = నాప్రతిజ్ఞను, మాతృపితలకున్ = తల్లిదండ్రులయెడ, స్వప్నావస్థ
యందున్ ఐనన్ = కలలోనైనను, సత్యశీలుండన్ = సత్యమేస్వభావముగాఁ
గలవాఁడను, గుణగణ్యులరు=గుణవంతుల యందెన్నఁదగినవారు, ఎలుఁగెత్తి =
బిగ్గరగా, శక్యంబే = తరమా? శపథమాత్రంబునన్ = ప్రతిజ్ఞ చేసినమాత్ర
ముననే, తుదముట్టన్ = నెఱవేఱుపఱుప, ఇదమ్ = ఇది, ఇత్థమ్ = ఇట్లు, అని=
అనుకొని, కల్లనిజంబులు = అబద్ధమును నిజమును, నింద = దూఱును, మోపి =
పెట్టి, గొంతు = అఱపును, కావించెదున్ కాఁబోలున్ = చేయుచున్న
వాఁడేమో. అంకుటాలికిన్ = జారస్త్రీకి, క్రొత్తడి+సుద్దులు = పతివ్రత
మాటలు - జారస్త్రీ పతివ్రతవలె మాటలాడునట్లు ఈనందిగుప్తుఁడే ధనమును
అపహరించి అఱచుచున్నాఁడేమో యని తలంచిరని తాత్పర్యము. చూపఱు=
చూచువారు, ఆడికొనుచుండన్ = చెప్పుకొనుచుండఁగా, సభాసదులు =
న్యాయాధిపతులు, వ్యు. సభలోనుండువారు, వెఱఁగుపడి = ఆశ్చర్యపడి,
అన్యోన్యముఖ అవలోకనంబు = ఒకరొకరి మోముయొక్క చూచుకొనుటను.

పు. 109. అశ్రుతచరంబు = ముందెన్నడునువిననిది, ముచ్చటించు
చున్ = చెప్పుచు, వణిజులన్ = వర్తకులను - వణిజుఁడు - వ్యు. వ్యవహా
రము చేయువాఁడు, వఱువాతన్ = ప్రాతఃకాలమునందు, వివాదంబు = తగ
వును, పరిశీలించెదము=విచారించెదము. చెల్లె అని = సరి యని, సమ్మతించి, నిబ.

యంబులకున్ = ఇడ్డను, నిజగృహబహిర్ద్వారంబు = తనయింటి తలవాకిలి,
కవాటపిహితంబు = తలుపుచేమూయఁబడినదానిఁ, గావించి = చేసి (అనఁగా
తలుపుమూసి), గర్భఅగారంబున్ = లోపలియింటికి, భూగుప్తధన అపహార
ణంబు = భూమియందు దాఁపఁబడినధనమును అపహరించుట, ఆదిగన్ =
మొదలుగా, స్వకృతంబు = తనచే చేయఁబడినదానిని, నివేదించి = తెలిపి,
అర్థంబు = ధనము, సకలపురుషార్థసాధనంబు = ఎల్లపురుషార్థములను (ధర్మ
అర్థ కామ మోక్షము లను కోరికలను) సాధించునది. దుస్సాధంబు=సాధింప
నలవిగానిది, ఒక్కండు = అన్యము, కులవిద్యారూపగుణ విహీనున్ ఏనిన్ =
కులముచేతను విద్యచేతను చక్కఁదనముచేతను మంచిగుణములచేతను విడువఁ
బడినవానినిగూడ, సర్వసంపన్నుండు = అన్నిటితోఁగూడినవాఁడు, దురితంబు
లకున్ = పాపములకు, దారిద్ర్యంబున్ పోలెన్ = పేదఱికమువలె, దారి
ద్ర్యము - వ్యు. దరిద్రునితనము. సకల దురితక్షపణంబునకున్ = ఎల్లపాప
ములను బోఁగొట్టుటకు, నిదానము = మొదటికారణము. సకల...నిదానంబు-
దారిద్ర్యము పాపమునకుఁ గారణమైనట్లు ధనము పాపమును బోఁగొట్టుటను
కారణము అని భావము. తత్ అర్జనంబుకయి = ఆధనమును సంపాదించుటకై
(ఆధనముయొక్క సంపాదనకై), పాచితంబునన్ = ప్రాయశ్చిత్తముచేత,
పాచికొనవచ్చున్ = పోఁగొట్టుకొనవచ్చును. దానంబట్టి = ఆనీతిశాస్త్రముచేత,
ఒక్కమయిన్ = ఒక్కవిధమున, రొక్కంబు = ధనమును, సమార్జించితిన్ =
సంపాదించితిని. హస్తగతంబు = చేతినిపొందినది, విత్తంబు = ధనము, దక్కించు
కొనువెరవు = తనకైనిలుపుకొను నుపాయము, పిఱికితనంబునన్ = అవివేకము
చేత, జాఱన్ విడువన్ ఏల = ఏల వదలిపెట్టవలయును? చేతఁజిక్కినధనమును
వదలుట అవివేక మని తాత్పర్యము. సత్ ఉపాయంబు=మంచియుపాయము.
జాగు = ఆలస్యము, వేగకమున్న+అ = తెల్లవాఱకముందే, అడంగి = దాఁగి.
రూ. అణఁగి, అదృశ్యుండవు = కానరానివాఁడవు - ధర్మఅధికృతులు =
ధర్మాధికారులు, న్యాయాధిపతు లనుట. చనుదెంచి = వచ్చి, అడుగుతఱిన్ =

అడుగునప్పుడు, జంపు = ఆలస్యము, ఒత్తిపలుకుము = నొక్కిచెప్పుము - బిగ్గఅఁగా చెప్పుము, నా చెప్పినచొప్పు=నేను చెప్పినవిధమును, చింతించుచోన్ = ఆలోచించునపుడు, రాఁగల అపాయంబుసహితము = రాఁబోవుకీడునుగూడ.

పు. 110. శాబకంబులన్ = పిల్లలను, కాచికొనన్ = కాపాడుకొనుట, కోలుపోయిన బకంబుచందంబు = పోఁగొట్టుకొనిన కొంగయొక్క విధము, నింబవృక్షము = వేఁపచెట్టు, బకమిథునంబు = కొంగలజంట. బక+అంగన = ఆఁడుకొంగ, చిదుగులు = పుల్లలు, బోదలన్ = పిల్లలుగా, ఏదుచున్ = పెంచుచు. విహంగమ అంగన = ఆఁడుపక్షి - ఇక్కడ ఆఁడుకొంగ. అల్ల ఈక్రిందిపుట్టలోని కాలభుజంగంబు = అగపడుచున్న యీక్రింది పుట్టలో నుండు త్రాఁచుపాము, రాయిడి = ఉపద్రవము, ఆపులుంగులు = ఆ పక్షులు, వలసపోయెను అఁట=చోటువిడిచిపోయెనఁట. విన్నఅప్పటంగోలెన్ = విన్నదిమొదలు, ఎరియుచున్నయది = తపించుచున్నది. ఈతరువున్ = ఈచెట్టును, ఈనెత్తురుఁగందులన్ = నెత్తురు+కందులన్ = ఈ నెత్తురు బిడ్డలను - పసికూనల ననుట. ఇడుమ = ఆపద, తొడరినన్ = పొందిన యెడల, సయిరింతున్ = ఓర్తును. తొరఁగన్ = కాఱఁగా, ఎలుంగు = కంఠ ధ్వని, కుత్తుకన్ = కంఠమందు, తగులన్ = తగులఁగా - పైకి రాక యిమిడి యుండఁగా నని యర్థము, దయితన్=భార్యను, బకోటంబు = కొంగ, ఉమ్మలించెదు = దుఃఖించెదవు. ఉమ్మలించెదు — ఉమ్మలించెదవు - తద్ధర్మార్థక క్రియ గావున వకారమునకులోపము బహుళము. ఉమ్మలికన్ = దుఃఖమును, కొండొకకార్యంబు = ఒకకార్యమైనను, ఉడుగుము = ఉపశమిల్లుము. శత్రువున్ = పగవానిని, పరిమార్చువెరవు = చంపువిధమును, పరికించితిన్ = ఆలోచించితిని. ముంగిసపొదదొరఁకొని = ముంగిసపొదమొదలుకొని, అట్లు = ముంగిసపొద మొదలుకొని పాముపుట్టవఱ కనుట.

పు. 111. పుట్టపట్టున్ = పుట్టయున్నచోటును, ఉరగంబున్ = పామును. వ్యు. ఱొమ్ముతోఁ బ్రాకునట్టిది. పరిమార్చి = చంపి, భూరుహంబు =

చెట్టును, ఆరోహించి=ఎక్కి - స్థలి రేకార్థ క్షేము-అవరోహించి, వ్యవహారం... కంబంబు - అడుసున పాతిన కంబము స్థిరత్వము జాలక నిలిచియుండలేక ఏవంక కూలునో తెలియక పడిపోవునట్లే శాస్త్రసైతము స్వల్పాధారమున అనుకూలమైనను కావచ్చును; లేదా పడిపోనువచ్చును. మనకు విరుద్ధముగ పరిణమించు నని భావము. ఏవంకనుక్ = ఏ ప్రక్కను, శ్రేయంబు=మంచి, మందల= మేర, శస్త్రంబు = మంగళము, బోము కావించి = బలాత్కారము చేసి, ఎట్టకేలకున్ = కష్టము చేత, ఈకొన్న పితరునిన్ = అంగీకరించిన తండ్రిని, దొంగ సేయుటన్ = దొంగిలించుటకు అనుకూలమైన అర్ధరాత్రమునందు, ఆమ్రాని లోనికోటరంబునన్ = ఆ చెట్టు లోనున్న తొఱ్ఱయందు, మాటుపఱిచి = మఱుగు చేసి, ఇరవునకున్ = ఇంటికి, అరుగుదెంచి = అరుదెంచి = వచ్చి, కొఱ సేయిన్ = మిగత రాత్రిని, పుచ్చి = గడపి, వేపకడన్ = ప్రాతఃకాలము నందు, ప్రతివాదియున్ = సుదర్శనగుప్తుడును, అరుదేరన్ = రాగా, తోకొని = వెంటబెట్టుకొని, దిదృక్షానుయాయి జనకలకలంబులు = చూడ నిచ్ఛచే వెంబడించివచ్చిన జనులకలకలధ్వనులు, దిదృక్ష - వ్యు. చూడనిచ్ఛ. రోదోంతరంబు = రోదః అంతరంబు = భూమ్యాకాశముల మధ్యప్రదేశము. పురంబు = పట్టణమునుండి, వెలువడి=బయలి, శ్రుతచర అభిజ్ఞానంబుల్=ముందు న్నట్టిగుఱుతును, వృక్షవిటపమధ్యంబుననుండి = ఆ చెట్టుకొమ్మలనడుమనుండి, వీతేరన్ = వెడలఁగా, తత్రత్యజనంబులు = అచ్చటనున్న జనులు, చిత్రంపడి= ఆశ్చర్యపడి - రూ. చిత్రముపడి, చిత్రపడి - వ్యా. కర్తృవాచకములుకాని మువర్ణకాంతశబ్దములకు పడ్వాదులు పరమగునప్పుడు మువర్ణకమునకు లోప పూర్ణబిందువులు వికల్పముగ నగు. చిత్రప్రతిమలరూపంబునన్ = చిత్తరువు లోని బొమ్మల ఆకారముచేత,-కదలమెదలనివారై యని భావము. చూపట్టన్= అగపడఁగా, కొండొక = కొంచెము; విచారించి = తలపోసి.

పు. 112. నిక్కంబు = సత్యము, పృష్ఠతాడనాత్=వీఁపునఁగొట్టుట వలన, దన్తభఙ్గః = పండ్లురాలుట-కారణమొకటియైన కార్యము మఱొకటి యనుట. మదల = అనుజ్ఞను, సాక్షిభావంబు = సాక్షితనమును, తత్ అను జ్ఞాతుండు = వారిచేత ననుమతింపఁ బడినవాఁడు, పడుఁగొమ్మలయుంన్=ఊడల యొక్కయు, అంతరంబులు = సందులను, స్కంధశాఖన్ = మ్రాని పెద్దకొమ్మ యందు, ఒక్కంటన్ = ఒకదానియందు, విశాల అంతరాళంబు = విరివియైన లోపలిచోటుగలది, తమోమయంబు = చీఁకటిచే నిండినది-ఇక్కడ మయట్ ప్రత్యయము ప్రాచుర్యార్థకము, ఎండుగాదంబు = ఎండినకసవును, ఇంగలంబు ఇడి=నిప్పును పెట్టి, దరికొల్పుడున్=మండింపఁగా, మహాత్ అఖిలంబు=మిక్కిలి భయంకరము, అగు జ్వాలాజాలంబుచేన్ = అగు మంటలసమూహముచేత, పొదువంబడి = చుట్టఁబడి, కమరన్ = కాలఁగా, అంతఃవర్తి = లోపలనున్న వాఁడు, ముదివగ్గు = ముసలితనముచే బక్కయైనవాఁడు, బెగ్గిలి = భయపడి, బెగ్గలంపుఁ దాపంబునకున్=బెగ్గలము+తాపంబునకున్ = అధికమైన వేఁడిమికి-కర్మధారయమున ము వర్ణమునకు పు వర్ణాదేశము, పరుషము పరమగుటచే సుగా గమ ద్రుతసంధికార్యములు - మొఱ = కూఁతను, వెలికిన్ ఉఱికి = వెలు పలికి దుమికి, అనుయుక్తుండు అయి = అడుగఁబడినవాఁడై, పితరుండన్ = తండ్రిని, పెడచెవిన్ = చెవియొక్క వెనుకటిప్రక్కను, పెడ... బెట్టి - వినక అని యర్థము. ఆరటంపడుచున్ = పరితపించుచు, లొఱంగెన్ = విడిచెను కొఱుతన్ = కొట్టునందు, ఈకొంటిన్ = సమ్మతించితిని. అకార్యంబు = చేయ రానిది. ఎడరు = ఆపదను, పాపిష్ఠుండన్ = మిక్కిలి పాపముకలవాఁడను, పరులన్ = ఇతరులను, వంచింపన్ = మోసపుచ్చుటకు, వంచితుండు=మోస పుచ్చఁబడినవాఁడు.

పు. 113. నిదర్శనంబుగన్ = దృష్టాంతముగా, అజస్తుందంబు - వ్యు. మేఁకయొక్క కడుపువంటి కడుపుకలది - వణిజుండు-రూ. వణిక్కు=కోమటి, వర్తకుఁడు, మిత్రుండు = స్నేహితుఁడు, అయిలిగాదు = పల్లకాదు, శక్యము

కాదు. దుగులము = ¼ అణాలు, అడితి = తఱుఁగును, లోహము = ఇనుము, దాపు=దగ్గఱ, అన్యుఁడనా = క్రొత్తవాఁడనా, (తెలియనివాఁడనా అనుట), శ్రమంబు = కష్టము, సురక్షితముగాన్ = చక్కఁగా కాపాడఁబడినట్లుగా భద్రముగా - క్షేమముగా, అజ్ఞాతుండు అయి = సెలవీయఁబడినవాఁడై. వేఁబోకన్ = వేకువను - రూ. వేఁగుఁబోకన్.

పు. 114. తత్కాల ఉచితంబుగన్ = ఆసమయమునకుఁ దగినట్లుగా, అభ్యుత్థానంబు = ఎదురుకోలుచు, కుశలప్రశ్నంబు = క్షేమముయొక్క అడుగుటను, తత్ అనురూపసల్లాపంబు = దానికిఁ దగినమాటను, కొంతతడవు=కొంతసేపు, కడపి=జరపి, యోగక్షేమంబులు - యోగ మనఁగా అలబ్ధలాభము, క్షేమ మనఁగా ఉన్నదానిని గాపాడుకొనుట. విన్నఁదనంబు = దైన్యము, నిలువ= మిగత, పదిలము = భద్రము, ఆమీఁదటన్ = అటుపైని, చూతున్ కా = చూతునుగదా - (ఆశ్చర్యము) వెనుఁబాటు = దుఃఖము, విశ్వసించి = నమ్మి, ఇల్లడ=పదిలపఱిచిపెట్టి మరల అడిగినప్పుడిమ్మని యొకరియొద్దదాఁచుట-వ్యు. ఇల్లు+అడకము - రాపడి = స్తంభించి, నానాఁడెము = నాపరువు - నాణెము చింతఆకులితుండున్ పోలెన్=చింతచేతఁ గలఁగింపఁబడినవానివలె (దుఃఖము చేత వ్యాకులత నొందిన వానివలె) నిమిత్తము = కారణము, నిపుణముగాన్= చక్కఁగా - నేర్పుతో, రాయిడి = ఉపద్రవము, వాతన్ = వాయి+అన్ = నోట. కొట్టుకొనిపోయెను - ఎలుకలు తినివేసె నని భావము.

పు. 115. పన్నినాఁడు = కల్పించినాఁడు. రాఁబట్టుకోవలెను = తీసికొనవలయును. లాఁతి ఉపాయముచేతన్ = వేఱు ఉపాయముచేత, భావవికారంబు=మనస్సుయొక్క వికారమును, ఏమియున్=కొంచెమైనను, మోమునందున్ = ముఖములో, తోఁపనీక = అగపడనీయక, అడఁచికొని = అణఁచిపెట్టుకొని - ఇముడ్చుకొని, వచ్చిననేగికిన్=కలిగిననష్టమునకు, మిత్రభావము= చెలిమి, ఎక్కించుకొని = ఎక్కువచేసికొని, రాకపోకలు = వచ్చుటను పోవు

టను రాక - వచ్చుధా. కృదం. పోక - పోవుధా. కృదం. అజ్జలు = అడుగులు, త్రొక్కుచున్ = పెట్టుచు, కుసిలించుచున్ = దుఃఖించుచు, ఔచ్చు= అల్లరి, వెంబడించు నెపమునన్ = వెంటపోవువ్యాజముచేత, ఏకాంతస్థానంబునన్ = జనులులేనిచోట, డాఁచి = దాఁచి, ఆననంబునన్ = మోమునందు, దీనిభావంబు = దైన్యమును, అరుదెంచుచున్ = రాఁగా, అప్పళించుకొనుచున్=బాదుకొనుచు, ఒడిగట్టితిరిరా = పూనుకొంటిరిరా! రా - నీచోద్దేశకమగు ప్రత్యయము.

పు. 116. ఇంత తెగువకున్ = ఇంతసాహసకార్యమునకు, పాలుపడుదువా = పూనుకొందువా? నిసువు = బిడ్డ, రూ. నిసుగు. శోకక్రోధపరీతమానసుండు అయి = దుఃఖముచేతను కోపముచేతను చుట్టఁబడినమనసుకలవాఁడై, తేఱన్ = పుట్టఁగా, కానీర - రా. నీచోద్దేశకమగు ప్రత్యయము, అనుకోకుము = అనుకొనకుము=తలఁపకుము. - కొను-నకు కో - ఆదేశము. సత్వరముగాన్ = వేగముతోఁగూడినట్లుగా. నీచెప్పినఅర్థము = నీవు చెప్పినసమాచారము, చెప్పిన - ధాతుజవిశేషణము. ఇట్టివిశేషణముల కర్తృవాచకము షష్ఠీవిభక్తియందేనియు, ప్రథమయందేనియు నుండును. అశ్రుతదృష్టచరంబు = ముందు వినఁబడనిదియు, చూడఁబడనిదియు నగుసంగతి. పొడమించెడున్ = కలిగించుచున్నది. నాన్ = అని ధర్మాధికారులు అడుగఁగా, జరిగినఅర్థంబు= నడచినసమాచారము, వారికిన్ - ఇంద్రపాలితునకును ధనగుప్తునకును - ఇంద్రపాలితునకులోహమును ధనగుప్తునకు బాలుని అని యథాసంఖ్యము. చోరదండంబు = దొంగయొక్కశిక్షను, నానాప్రకారంబులన్ = పలువిధములచేత, ఉపాలంభించుచుండెన్ = దూఱుచుండెను.

తత్ అవసరంబునన్ = ఆసమయమునందు, మృగంబులరాయండు = సింహము, పొడవు = ఆకారమును, ఒందినకాతాళంబు అనన్ = పొందిన

కోపమో అనునట్లు, అడరి = విజృంభించి, జుంజుములు = చిరుపిటి వెండ్రుకలు, నిక్కఁగ్ = నిగుడఁగా, బెడిదంపుటుఱుమును = భయంకరమైన మేఘగర్జనమును, వ్యు. బెడిదము + ఉఱుము = వ్యా. కర్మధారయసమాసమున ముపర్ణమునకు అచ్చు పరమైనదిగావున పువర్ణాదేశటువర్ణ ఆగమములు. ఉఱని నెఱబొబ్బ = లక్ష్యము చేయని నిండుబొబ్బరింతగు, ఇడి = చేసి, చంగునన్ - ఎగురుటయందగు ధ్వన్యను కరణము. కోలగగ్గెరకున్ పోలెన్ = కాళ్లకు దారమును పెనఁచి మూటకట్టుగా కట్టెడికట్టువలె. కూలంగన్ = కుడునట్లు, ముంగాళ్లన్ = ముందటికాళ్ల చేత వ్యు. ముందు + కాళ్లు - ప్రాఁతాదిసూత్రముచే 'ందు'-కులోపము, నుగామము నై ద్రుతసంధిచే ముంగాళ్లు అయినది. ఒత్తిపట్టి = అదిమిపట్టుకొని, కుత్తుకన్ = మెడను, గుటగుటన్ - త్రాగుటయందలి ధ్వన్యనుకరణము. త్రావి - రూ. త్రాగి. ఆబసవనిన్ = ఆయెద్దును - సంజీవకు ననుట, ఉసుఱునకున్ పాఁచి = ప్రాణ మునుపోఁగొట్టి, ప్రశాంతక్రోధుండు = మిక్కిలి ఉపశమిల్లిన కోపముకలఁ వాఁడు.

పు. 117. ఇరవునకున్ = ఉనికిపట్టునకు, అనుతాపపరీతమాన సుండు = పశ్చాత్తాపముచేతఁ బుట్టఁబడిన మనసుగలవాఁడు, డాయన్ = దగ్గఱకు, కటకటా - అయ్యయ్యో. ఇది సంతాపమును తెలుపును. దారుణ కర్మంబు = క్రూరకార్యమును, భరణరక్షణంబులన్ = పోషించుటచేతను కాపా డుటచేతను, ప్రకృతిరంజనంబు = జనులకు సంతోషమును, రాజనామంబు = రాజు అను పేరు, కాల్పనే - పనికిమాలినవస్తువుల నగ్గిలో వైచి రూపుమాపు నట్లు రూపుమాపుటకా - వ్యర్థ మని యర్థము. విషవృక్షమేనిన్ = విసపుచెట్టు నైనను, సంవర్ధించి = చక్కఁగాఁబెంచి, ఛేదింపన్ చనదు = నఱుకరాదు. ఎఱిఁగి ఏన్ = తెలిసియో, ఎఱుఁగక ఏన్ = తెలియకయో. నేరమి = తప్పును - అపరాధమును, నయంబుభయంబున్ = నీతిని భయమును, వేఁడుకోలునన్ =

ప్రార్థనచేత, తెలపంబడినట్లు = తెలియఁజేయఁబడినట్లు, అభినయించి = నటించి, మిన్నక = ఊరక, మఱి = మరల, నిజఅధికారంబువలనన్ = తనఅధికారము నుండి, తలంగన్ వలయున్ = తొలఁగింపవలయును. తీండ్రంబు = తీక్ష్ణత్వము - తీవ్రత, కానిపింపన్ = అగపఱచుట, పోలదు = తగదు. తక్కుం గల = మిగిలిన, లెంకకూటువ=సేవకులసమూహము, (రూ. కూటువు.) కాయంపున్ = అనురాగమును, తొఱంగున్ = విడుచును. దోసంగు = ఆపద, పొసంగున్ = కలుగును. కడిందికర్జంబు ఐనన్ = కష్టమైనకార్యమైనను, సాధింపవచ్చున్ = చక్కఁబెట్టవచ్చును. గడియించుట = సంపాదించుట, సుకరంబు = సులువు, కలకాలము = ఉన్నంతకాలము, దుర్వారంబు = అడ్డగింపరానిది, దుర్యశంబు = అపకీర్తిని, దాయన్ = శత్రువును, ఇవ్విధమునన్ = ఈవిధముగా, ఉమ్మలంపడన్ పోలదు = దుఃఖపడుటతగదు. సెరగు = ఆపద, పఱుపన్ = చేయుంటకు, ఏనిన్ ఏనిన్ = ఎవనినైనను, ఒప్పరికింపక = ఉపేక్ష చేయక, దోరింపవలయును = చంపవలయును. పాడి = న్యాయమును, నెఱిన్ = పూర్ణముగా, ఎఱింగినగఱువలు = తెలిసినపెద్దలు, భూపాలునకున్ = రాజునకు, రాజ్యలోభంబువలనన్ = దొరతనమునందలి ఆశచేత, అహంకారంబువలనన్ = గర్వముచేత, స్వామిపదంబున్ = దొరతనమును, వధంబు = చావు, దండంబు = శిక్ష, సర్వసమ్మతంబు = ఎల్లరకు నిష్టమైనది. భద్రఆసనంబున్ = సింహాసనమును, అధిష్ఠించెన్ = ఎక్కెను.

పు. 118. ప్రహృష్టుండు అయి = సంతోషించినవాఁడై, స్వస్తి = శుభము, కావుతన్ - ఆశీరర్థకము - కావుత మని = కావుతన్+అని - తన్-ప్రత్యయమువీఁది నకారమునకు అచ్చు పరముగుటచే మకారాదేశమైనది. సకలపరిజనంబులును = ఎల్లపరివారములును, సుఖంబు ఉండెన్=సుఖముతో

నుండెను - వ్యా. కర్త్రువాచకములురెండైనను 'తాను' శబ్దమునైతము కర్త యగుటచే క్రియ ఏకవచనమే యగును.

సుహృత్ భేదంబు = మిత్రభేదమును, సుహృత్ - వ్యు. మంచిమనస్సు కలవాఁడు. సాంతంబుగన్=పూర్ణముగా, ఇట్టిభేదంబు=ఇట్టివేఱిమి, మీశత్రువులయందున్ = మీవిరోధులయందు, ప్రయోగించి=నడపి, విజయంబున్= గెలుపును, పుత్త్రులు - వ్యు. పుత్ అను నరకమునుండి తల్లిదండ్రులను రక్షించువారు. హర్షంబున్ ఒందిరి = సంతోషమును పొందిరి.

పూర్వార్ధము=మొదటిసగము, (మిత్రలాభమిత్రభేదములు); ఉత్తరార్ధము = రెండవసగము (విగ్రహము - సంధి)

పూర్వార్ధముమాత్రమే
శ్రీ చిన్నయసూరిగారి రచితము
మిత్రభేదము సంపూర్ణము

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1950

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| భాస్కరరామాయణము | ... | 8 | 0 |
| భక్తిరసశతకసంపుటము I (20) శతకములు | ... | 3 | 0 |
| ,, II ,, | ... | 3 | 0 |
| ,, III ,, | ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము I ,, | ... | 3 | 0 |
| మల్లభూపాలీయము, నీతిశతకము, ఎలకూచి బాలసరస్వతిది, టీకా | | 1 | 8 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద ముద్రితము | ... | 5 | 0 |
| మార్కండేయపురాణము | ... | 5 | 0 |
| మొల్లరామాయణము | ... | 1 | 8 |
| యయాతిచరిత్ర, పొన్నిగంటి తెలగనార్య | ... | 1 | 0 |
| యయాతిచరిత్ర, ఆకొండి వ్యాసమూర్తి | ... | 0 | 4 |
| రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద | ... | 6 | 0 |
| రంగరాయచరిత్రము | ... | 0 | 12 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 4 | 0 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 6 |
| రామరాజీయము | ... | 0 | 12 |
| రామాభ్యుదయము | ... | 2 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 8 |
| వసుచరిత్రవిమర్శనము | ... | 2 | 0 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | ... | 1 | 4 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | ... | 6 | 0 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) | ... | 2 | 0 |
| బిల్హణీయము | ... | 1 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక | ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి | ... | 0 | 10 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 1 | 8 |
| వసిష్ఠజనకసంవాదము | ... | 0 | 8 |
| వివేకసింధు, కొండాచార్యప్రణీతము | ... | 1 | 0 |
| వేమనపద్యములు | ... | 0 | 8 |
| ,, బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో | ... | 1 | 8 |
| ,, (2728) చిన్నసైజు | ... | 3 | 8 |
| ,, (2728) ఆంధ్రతాత్పర్యముతో | ... | 7 | 8 |
| వేమనశతకము | ... | 0 | 4 |
| విజయవిలాసము | ... | 1 | 4 |
| వీథినాటకము, శ్రీనాథునిది | ... | 0 | 4 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | ... | 0 | 6 |
| వైశ్యపురాణము | ... | 1 | 4 |
| వైజయంతీవిలాసము | ... | 1 | 0 |
| శతకంఠరామాయణము | ... | 1 | 0 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 1 | 0 |
| శశాంకవిజయము | ... | 1 | 8 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము | ... | 1 | 0 |
| శివలీలావిలాసము | ... | 0 | 8 |
| శేషధర్మము, తామరపల్లి తమ్మయ్య | ... | 1 | 0 |
| శుకసప్తతి, కదిరీపతికృతము | ... | 2 | 8 |
| సమీరకుమారవిజయము | ... | 1 | 8 |
| సప్తమస్కంధము, ప్రహ్లాదచరిత్ర | ... | 0 | 6 |
| ,, సటీక, చిన్నసైజు | ... | 3 | 8 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక | ... | 6 | 0 |
| సీతారామరామాయణము | ... | 1 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| …శేఖరుఁడు, గోపాలుఁడు | … | 0 | 12 |
| …దర్విషుకథలు | … | 1 | 0 |
| …ాచార్యులకథలు | … | 0 | 12 |
| …ఋనికథలు | … | 0 | 12 |
| …నందశిష్యులకథలు | … | 0 | 4 |
| …రుమంత్రులకథలు | … | 0 | 6 |
| …దుగురుదొంగలకథలు | … | 0 | 8 |
| …ణగాథలు I | … | 1 | 0 |
| … II | … | 1 | 0 |
| …రాయని చరిత్ర | … | 1 | 4 |
| …వంశకథ | … | 0 | 10 |
| …మార్కునిచరిత్ర, భా, రామ. శాస్త్రి | … | 1 | 8 |
| …నీతికథలు, I-వ భాగము | … | అచ్చు | |
| డిటో 2-వ భాగము | … | 0 | 12 |
| …ఖుఅల్లరి | … | 0 | 8 |
| …ద్దరామన్నకథలు | … | 0 | 3 |
| …వణచరిత్ర, చక్కనికూర్పు | … | 0 | 2 |
| …సాగరము, [illegible]రాయసముద్రచరిత్ర | … | 0 | 12 |
| …తల చరిత్ర చిన్నసైజు | … | 0 | 6 |
| ” | … | 0 | 8 |
| …త్రి ” | … | 0 | 6 |
| …ంద్ర ” | … | 0 | 8 |
| …ోదచరిత్ర ” | … | 0 | 6 |
| …థభక్తులచరిత్ర | … | అచ్చు | |
| …ర్ఖులకథలు | … | 0 | 6 |
| …ంగనలు | … | అచ్చు | |
| …క్క పగటిచుక్క | … | 0 | 4 |
| …వవిజయము | … | 0 | 6 |

# నవలలు

| | | ప్రతి రూ. అ. |
|---|---|---|
| సీతారామము | ... | అచ |
| ఐవన్హో | ... | 1 |
| విజ్జలదేవి | ... | 2 |
| రాధారాణి | ... | 0 |
| దుర్గేశనందిని | ... | 1 |
| లక్షణ | ... | 1 |
| లీల | ... | 0 |
| దిలారామ | ... | 3 |
| కోవలన్ కన్నకి | ... | 1 |
| వీరబాల | ... | 1 |
| ఆనందమఠ | ... | 1 1 |
| లాలాబాయి | ... | 0 1 |
| ఆంధ్రరాష్ట్రము | .. | 1 |
| రోషనార, చరిత్ర విషయకము నవల | ... | 1 |
| బాలాదిత్య (చరిత్రాత్మకము నవల) | ... | అచ |
| దేశభక్తుడు | ... | 1 |
| శంభుతో నొకనాటిసహవాసము | ... | 0 |
| చంద్రగుప్తుడు | ... | 2 |
| నీలిసింధువు | ... | 1 |
| వనజాక్షి | ... | 1 |
| స్వప్నయాత్ర | ... | 1 5 |
| ముగ్గురుకుమార్తులు | ... | 2 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
292, ఎస్ప్లనేడ్, చెన్నపట్టణం